# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 13 సంచిక : 2 హైదరాబాద్ 163 ఫిబ్రవరి 2015 పేజీలు : 68 రు. 20

※ తెలంగాణ పారిశ్రామిక విధానం

※ అరబిందో ఫార్మా కార్మికుల పోరాటం

※ కేంద్ర ప్రభుత్వ ఆర్డినెన్స్‌ల పాలన

※ మోడీ 'మన్‌కీ బాత్'పై బహిరంగ లేఖ

※ భగవద్గీతలో జాతీయ భావం ఉన్నదా?

※ 'పల్లెను మింగిన పెట్టుబడి' సమీక్ష

※ ప్యారిస్ ఘటన - ఫ్రాన్స్ తప్పిదాలు




# భారత చరిత్ర

**అధ్యయనానికి**

## ఒక పరిచయం

An Introduction to the Study of Indian History

## దామోదర్ ధర్మానంద్ కోసంబి

**తెలుగు : ఎన్. వేణుగోపాల్**

ప్రచురణ

నేషనల్ ట్రాన్స్‌లేషన్ మిషన్
హైదరాబాద్ బుక్‌ట్రస్ట్

**పేజీలు: 488**
**వెల: రు. 250**

# ఇండియాలో దాగిన హిందుస్థాన్

**The Indian Ideology**

## పెరి ఆండర్సన్

**తెలుగు : ప్రభాకర్ మందార**

ప్రచురణ

హైదరాబాద్ బుక్‌ట్రస్ట్




**పేజీలు: 164**
**వెల: రు. 150**

ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ - 500 006

ఈ రెండు పుస్తకాలు వీక్షణం దగ్గర కూడ దొరుకుతాయి

## వీక్షణం

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్ / ఫోన్ : 040-66843495 Email : veekshanam2003@gmail.com

163

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2015
సంపుటి : 13
సంచిక : 2





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎస్.తిరుపతి; నల్గొండ – జి. వెంకటేశ్వర్లు; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్.

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; ప్రకాశం – కర్ణ సతీష్‌బాబు; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 జనవరి నెలలో వచ్చిన విరాళాలు - పి.ఎస్.ఎన్. ప్రసాద్, హైదరాబాద్ - రు. 10,000; జి. హరిప్రసాద్, బళ్లారి - రు. 1000; శ్రేయోభిలాషి, శ్రీకాకుళం - రు. 2000; శ్రేయోభిలాషి, పలమనేరు - రు. 2000; కట్టా శేఖర్‌రావు, ఖమ్మం - రు. 5000; డా. ఎన్. వెంకటేశ్వర్లు, హిందూపురం, అనంతపురం జిల్లా - రు. 5000; ఎ. నర్సింహారెడ్డి, జనగాం - రు. 6500; సిక్కోలు బుక్ ట్రస్ట్, శ్రీకాకుళం - రు. 2500; పి. గీత, హనుమకొండ - రు. 1000; ఆశాలత, హైదరాబాద్ - రు. 3000; వంగా మధుసూదన్‌రెడ్డి, హైదరాబాద్ - రు. 1000; బి. కామేశ్వరరావు, హైదరాబాద్ - రు. 200; శ్రేయోభిలాషి, కోదాడ - రు. 25,000; పి. సుబ్బరాయన్, నరసాపూర్ - రు. 576. దాతలందరికీ కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం జనవరి జన్మదిన సంచిక చాలా విజ్ఞానదాయకంగా ఉంది. ఇందులో రాజేంద్రబాబు వ్యాసం, వరవరరావు వ్యాసం విమర్శనాత్మకంగా ఉన్నాయి. ప్రొ. శేషయ్య 'జస్టిస్ కృష్ణ అయ్యర్ జీవిత విశేషాలు విపులంగా వివరించడం శ్లాఘనీయం. ఇది మేధావుల, విమర్శకుల పత్రిక. ఇది సామాన్య జనానికి చేరువగా వెళ్లాలి. అప్పుడే పత్రికకు సార్థకత చేకూరుతుంది. సంపాదకులు దీని గురించి ఆలోచించాలి.

**- డా. బి. విఠల్**
హైదరాబాద్

ప్రతి నెలా మొదటి ఆదివారం జరిగే 'శ్రీకాకుళ సాహితి' సమావేశాలలో 'వీక్షణం'లో వచ్చే వ్యాసాలపై చర్చించుకుంటూ, వీక్షణం పాఠకుల్ని చందాదారులుగా చేర్పించే ప్రయత్నం చేస్తున్నాం. సిక్కోలు బుక్ ట్రస్ట్ తరఫున వీక్షణం మూలనిధికి మా మొదటి ప్రచురణ 'మన ప్రపంచం' నూరు కాపీలు అందచేశాం. రెండో ప్రచురణ 'హింసపాదు' (బమ్మిడి జగదీశ్వరరావు) 25 కాపీలు అందజేస్తాం. 'వీక్షణం' యువ పాఠకులకు ఆలోచనలను నిరంతరం అందిస్తుండాలి. దాని కోసం మావంతు సహకారంగా మీరు చెప్పే మరేపని చేయడానికైనా నేను సిద్ధమే.

**- రవికుమార్,**
టెక్కలి, శ్రీకాకుళం

'వ్యవసాయ రంగలో మార్పులు రూపం-సారం' పత్రం గురించి చర్చించవలసిన అవసరం ఉంది. ఆ పత్రం చదివిన తరువాత వచ్చిన ప్రశ్నలను రాస్తున్నాను. పెద్ద భూఖండాలు అంతరించినవి, అలాగే కొన్ని ప్రాంతాల్లో పెద్ద భూఖండాలు కొందరి యాజమాన్యం లేదా అధీనంలో ఉన్నాయి అని రాశారు. ఇక్కడ భాషకు సంబంధించిన సమస్య ఉంది. భూస్వామి అనే పదం ఫ్యూడల్ భూస్వామి, లేక పెట్టుబడిదారీ భూస్వామి రెండింటికీ వర్తిస్తుంది. భూస్వాములు లేకపోవచ్చు గాని భూస్వామ్యానికి సామాజిక రంగం పెరిగింది అని రాశారు. భూస్వామ్యం (ఫ్యూడల్-అర్ధఫ్యూడల్ భూస్వామ్యం అనే అర్థంలో) అనేది మిగులు సంపదను అనుభవించే ఒక ఆర్థిక సంబంధం. అర్ధ - ఫ్యూడల్ వ్యవసాయదారుల మిగులు ఉత్పత్తి అనుభవించే ఒక వర్గం లేకుండా భూస్వామ్యమే ఉండదు. సామాజిక రంగంలో దాని ప్రభావం దానిని సాంస్కృతిక, రాజకీయ ప్రభావంగా మాత్రమే పరిగణించాలి. అలాగే గైర్హాజరీ భూస్వాములు (కేవలం భూస్వామి అనే అర్థంలో) తమ భూములను కౌలుకిస్తే అక్కడ జరుగుతున్న ఉత్పత్తి వేతన కార్మికులతోనా, కట్టు బానిసలు, చిన్న కౌలుదారులతోనా? కేవలం కౌలు ఫ్యూడల్ సంబంధం కాదు. ఇంగ్లండ్‌లో వ్యవసాయ పెట్టుబడి అభివృద్ధి జరిగింది కౌలు రైతుల ద్వారా, సొంతంగా వ్యవసాయం, గొర్రెల పెంపకంలోకి దిగిన పాత ఫ్యూడల్ భూస్వాముల ద్వారా. ఇక బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల మాటకొస్తే, అవి పశ్చిమ యూరప్‌లో జరిగాయే కాని, తూర్పు ప్రాంతాల్లో వాటి నిమిత్తం లేకుండానే పెట్టుబడి ఎదిగింది. ఉదాహరణకు రష్యాలో పరిశ్రమల ద్వారా పెట్టుబడి జారిస్ట్ ప్రభుత్వం అధీనంలోనే ప్రవేశించింది. జారిస్ట్ అధికారాన్ని, ఫ్యూడల్ సాంస్కృతిక, ఆర్థిక అవశేషాలని కార్మిక వర్గ విప్లవమే కూలదోసింది. చివరికి మధ్య యుగాల నాటి జూలియన్ క్యాలండర్ను కూడా సంస్కరించింది కార్మిక విప్లవం తరువాతే. దీనిని అసమ, మిశ్రమ అభివృద్ధి అనే గతితార్కిక సూత్రంలో చూడవచ్చు. మార్క్సిస్టు రచనల్లో బీజరూపంలో ఉన్న ఈ సూత్రాన్ని ట్రాట్స్కీ అభివృద్ధి చేశాడు. కాబట్టి దీనిని తిరస్కరించాలి అనే వారికి ఒక నమస్కారం.

జపాన్‌లో పెట్టుబడి అభివృద్ధి ఫ్యూడల్ సమురాయ్‌లోని శ్రేణులే చక్రవర్తి పాలనను బలపర్చడం చక్రవర్తి ఆరాధన అనే భావజాలం కింద షోగన్ పాలనను అంత మొందించి, పెట్టుబడి అభివృద్ధి జరిపారు. అమెరికా సైనికశక్తి నుండి రక్షణ పొందడానికి వారికి అలా చేయక తప్పలేదు. ఇక్కడ చూడవలసినది ఆర్థిక సంబంధాలే గాని గత కాలపు సామాజిక, సాంస్కృతిక అవశేషాలు కాదు. అలాగే అర్ధ ఫ్యూడల్ దశ అనడంలో కూడా స్పష్టత లోపిస్తుంది. అర్ధ ఫ్యూడలిజం అనేది ఒక ఉత్పత్తి విధానం అయితే అది ఒక దశ కాదు, దానికి కొన్ని నిర్దిష్టమైన గతి సూత్రాలు (డైనమిక్స్) ఉండాలి. అది ఒక దశ (ఫేజ్) అయితే దాని గమనం ఎటువైపో చూడాలి. నేను ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళం వంటి ప్రాంతంలోని మారుమూల గ్రామంలో కూడా చూసినది ఏమిటంటే ఇవాళ వ్యవసాయం రెండు వైపుల నుండి - వినియోగాలు, ఉత్పత్తులు - గుత్త పెట్టుబడి, స్థానిక పెట్టుబడి అధీనంలోకి వెళ్లిపోయింది. కొన్ని గిరిజన సమూహాలు మినహాయించి, రెండు ఎకరాల రైతులు కూడా మార్కెట్ కోసమే ఉత్పత్తి చేస్తున్నారు. శాస్త్రీయ పరిశీలన జరగాలంటే, అర్ధ ఫ్యూడలిజం నిర్దిష్ట లక్షణాలు (నిర్వచనం) ఏమిటి? అది ఒక ఉత్పత్తి విధానమా, లేక ఫ్యూడలిజానికి పెట్టుబడికి జరిగే పరిణామ క్రమంలో ఒక దశా అన్నది తేలాలి.

ఆంధ్రప్రదేశ్ రాజధాని మీద రాసిన వ్యాసాలు చదివిన తరువాత బాధ కలుగుతోంది. వామపక్ష సంస్థలుండి కూడా పంట భూముల్లో నగరం నిర్మిస్తుంటే ఆందోళన చేసేవారు లేరు. తమకు ఒక రాజధాని త్వరగా కావాలనే కోరిక, హైదరాబాద్‌లో ఉన్న ఆంధ్రులను తిరిగి తనలో ఇముడ్చుకోలేని స్థితి ఆంధ్రప్రదేశ్‌లో ఉండడం, ఈ పర్యావరణ నష్టంతో ప్రజలు రాజీ పడేటట్లు చేస్తోంది.

లోకసంచారి వ్యాసం చదువుతుంటే బాధ, నవ్వు ఒకేసారి కలిగాయి. ప్రజాసంఘం, కార్మికసంఘం కూడా, మహాసభ కొన్ని గంటల్లో మొదలవుతుందనగా ఒక పక్క నాయకులు ప్రధాన కార్యదర్శి నివేదిక అనే ఒక వంటకాన్ని వండుతుంటారు. ఇక దానిని సభలో చర్చించేదేమిటో ఊహించొచ్చు. ఇవాళ ఉన్న విప్లవపార్టీలు అంతరించి పోయే దశలో ఉన్నాయి. వాటికి ఇప్పుడు ఉన్న సంస్థల రూపంలో భవిష్యత్తు లేదు. వాటిలో చిత్తశుద్ధి ఉన్న కార్యకర్తలు ఒక కొత్త సంస్థను స్థాపిస్తే కొంత మెరుగు.

ఇప్పుడున్న రూపంలో పార్టీలు ఏమీ సాధించలేవు. దాదాపు 50 సంవత్సరాల చరిత్ర చూస్తే ఈ పార్టీల అధోగతి భక్తులు తప్ప ఎవరైనా చూడగలరు. ఇక 'ఆదరణ' అంటే ఎవరి ఆదరణ అనే ప్రశ్న వస్తుంది. అత్యంత వెనుకబడిన తరగతుల నుండి అగ్రగామి వర్గానికి ఇంకా ఏ ఎం.ఎల్. పార్టీ చేరుకోలేదు. మావోయిస్టు పార్టీ అడవిలో మిగిలింది కాని అడవి దాటి బయటకు రాలేకుంది. ఇక మిగిలిన రంగాల్లో సంఘాలు నామమాత్రంగా మిగిలాయి.

**- నరేంద్రమోహన్,** ఆస్ట్రేలియా (వీక్షణం బ్లాగ్)

అయ్యా నమో! మీ నూతన సంవత్సర జ్యోతిష్కానికి ఓ నమస్కారం. దేనికైనా ఆచరణే కదా గీటురాయి. వేచి చూద్దాం మీ జ్యోతిష్కం ఎంతవరకు నిజం అవుతుందో! దేశమంతా ఎండుగడ్డి పర్చుకుంటున్నది. రాబోయే కాలం చిరుమంటలు పెనుమంటలై ఎగిసేకాలం. అంతరించి పోవడంకాదు ఆకాశందాకా విస్తరించే కాలం.

**- నటాషా** (వీక్షణం బ్లాగ్)

(మిగతా 56వ పేజీలో...)

## 23వ నాస్తిక మేళాకు తరలిరండి...

2015 ఫిబ్రవరి 14,15 తేదీల్లో శని, ఆదివారాల్లో గుంటూరు జిల్లా, మంగళగిరి సమీపంలోని చార్వాకాశ్రమంలో జరిగే రెండు తెలుగు రాష్ట్రాల 23వ నాస్తిక మేళాకు మీ కుటుంబాలతో తరలిరండి...

**14-2-2015 శనివారం ఉదయం 10 గం.**

మూఢనమ్మకాల నిర్మూలన చట్టం ఆవశ్యకత సదస్సు, మధ్యాహ్నం 3 గం. మంగళగిరిలో ఊరేగింపు, అనంతరం అంబేడ్కర్ సెంటర్‌లో బహిరంగ సభ

**15-2-2015 ఆదివారం ఉదయం 10 గం.**

గ్రహాలు - జాతకాలు, మతం ప్రాధాన్యత ఎందుకు పెరుగుతుంది? అరికట్టడానికి మనం ఏం చేయాలి? చార్వాక భౌతికవాదం, భగవద్గీతను జాతీయ గ్రంథంగా చేయాలా? మహిళలపై మతతత్వ ప్రభావం అనే అంశాలపై ఉపన్యాసాలు ఉంటాయి.

# ఉరుకులు పరుగులతో దళారీతనం, మతోన్మాదం

వీక్షణం

లోక్‌సభలోని 543 స్థానాలలో తాను నాయకత్వం వహిస్తున్న ఎన్‌డిఎ కూటమికి 336 స్థానాలు, సొంతంగా 282 స్థానాలతో స్థిరమైన ఆధిక్యత ఉన్నప్పటికీ నరేంద్ర మోడీ ప్రభుత్వం ఏక్షణాన పదవి పోతుందో అన్నంత తొందరపాటుతో పనిచేస్తున్నట్టున్నది. ఐదు సంవత్సరాల అధికారం వచ్చినప్పటికీ అది ఎప్పుడు జారిపోతుందో, దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్నట్టుగా దాదాపు ప్రతిరోజూ తన మతోన్మాద, మతవిద్వేష, విధ్వంస కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నది. ఎనిమిది నెలలు పూర్తిగా గడవకుండానే దేశ రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక, పాలనా వ్యవహారాలలో ప్రభుత్వం తీసుకువచ్చిన, ప్రయత్నిస్తున్న మార్పులు చూస్తే ఆశ్చర్యం కలుగుతున్నది. ఐదు సంవత్సరాల తర్వాత మరొక ప్రభుత్వం వచ్చి, ప్రజల ఒత్తిడితో తిరగదోడడానికి ప్రయత్నించినప్పటికీ, ఇంత తీవ్రమైన మార్పులకు సమాజం మీద బలమైన ప్రభావమే ఉంటుంది.

అప్పటికప్పుడు తోసుకువచ్చే పనులను తమ దృక్పథం ప్రకారం చేయడం ఒక ఎత్తు, తాము ఎంతో కాలంగా చేయదలచుకున్న పనులు చేయడం మరొక ఎత్తు. వాటిని మించి, భారత సమాజం శతాబ్దాలుగా, దశాబ్దాలుగా నిర్మించుకుంటూ వస్తున్న విలువలను, సంస్థలను, నిర్మాణాలను ధ్వంసం చేసి, నిర్మూలించి, మరెవరైనా అధికారంలోకి వచ్చినా సవరించడం, పునరుద్ధరించడం సాధ్యం కానంత బీభత్సం సృష్టించడమే సంఘ పరివార్ లక్ష్యంగా కనబడుతున్నది. పాత ప్రభుత్వాల విధానాలలో దుర్మార్గమైనవీ, ప్రజావ్యతిరేకమైనవీ, తప్పనిసరిగా మార్చవలసినవీ ఎన్నో ఉన్నాయి. కాని ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం చేస్తున్న పని అది కాదు. అది ఇంకా దుర్మార్గమైన, ఇంకా ప్రజావ్యతిరేకమైన విధానాలు అమలు చేస్తున్నది. పాత విధానాలలో ఎక్కడైనా ఒక ప్రజానుకూల విధానం అంటే దాన్ని రద్దు చేస్తున్నది. పూర్తిగా సామ్రాజ్యవాద అనుకూల, మతోన్మాద విధానాలను అమలులోకి తెస్తున్నది. ఇంతకాలమూ తమను మించిన దేశభక్తులు లేరనీ, తాము స్వదేశీ జాగరణ కోసం కంకణం కట్టుకున్నామనీ అంటూ వచ్చినవాళ్లు ఇప్పుడు దేశ ప్రయోజనాలను తాకట్టు పెడుతూ, అమ్మివేస్తూ సామ్రాజ్యవాదులకు తమను మించిన దళారీలు దొరకబోరని చూపుకోవడానికి తహతహలాడుతున్నారు. గత ఇరవై సంవత్సరాలలో సాగిన ప్రపంచీకరణ విధానాలను మరింత ఎక్కువగా అమలు చేస్తున్నారు. పనిలో పనిగా తమ మతవిద్వేష రాజకీయాలను, భావజాలాన్ని విస్తరిస్తూ సమాజాన్ని చీలదీయడానికి, విధ్వంసం సృష్టించడానికి, ప్రజలు నిత్యజీవిత సమస్యల మీద ఆలోచించకుండా పక్కదారి పట్టించడానికి ప్రయత్నిస్తున్నారు. వలస వ్యతిరేక ఉద్యమంలో, వలసానంతర ప్రభుత్వాలలో కొంతవరకు సామ్యవాద ఆదర్శాల ప్రకటన జరిగింది గనుక, ఆ ప్రస్తావనలను కూడ తొలగించడానికి ప్రయత్నిస్తున్నారు. అది ప్రణాళికా సంఘాన్ని రద్దు చేసి నీతి అయోగ్ ను ఏర్పరచడం కావచ్చు. దాని కీలక స్థానాలలో సంఘ పరివారాన్ని నియమించడం కావచ్చు. న్యాయమూర్తుల ఎంపికకు పాత పద్ధతి మార్చి కొత్త పద్ధతిని సృష్టించడం కావచ్చు. భారత చరిత్ర పరిశోధక మండలి వంటి ప్రామాణిక, తటస్థ సంస్థలను తమ కార్యకర్తలతో నింపడం కావచ్చు. విశ్వవిద్యాలయాల ఆచార్యుల ఎంపికలో, పాఠ్యప్రణాళికల నిర్ణయంలో, మొత్తంగా విద్యా రంగంలో తమ భావజాలాన్ని, మత విద్వేషాన్ని ప్రవేశపెట్టడం కావచ్చు. రక్షణ, బీమా రంగాలతో సహా కీలక రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశానికీ, విస్తరణకూ మార్గాలు తెరవడం ద్వారా బహుళజాతి సంస్థల కోరికలను నెరవేర్చడంలో గత ప్రభుత్వాలకన్న తానే ఎక్కువ బానిసనని చూపుకోవడంలో కావచ్చు. బహుళజాతి సంస్థలకూ పెట్టుబడిదారులకూ అనుకూలంగా కార్మిక సంక్షేమ చట్టాలను సవరించడం కావచ్చు. చట్టాలను మార్చడానికి తగిన బలం తనకు రాజ్యసభలో లేనందువల్ల ఆర్డినెన్సుల రాజ్యపు దుష్ట సంప్రదాయాన్ని నెలకొల్పడంలో కావచ్చు. మొత్తంగా దేశ పాలనా, ప్రణాళికా, న్యాయ, విద్యా వ్యవస్థలలో ఎక్కడ చూసినా ప్రమాదకరమైన, లోతైన ప్రభావం వేయగల విధానాలకూ ఆచరణలకూ ఈ ప్రభుత్వం ఎనిమిది నెలల కాలంలోనే పూనుకున్నది. ఒకవైపు పాలనా పరంగా ఈ మార్పులు తెస్తూ, మరొకవైపు అధికారంలో ఉన్నవారూ లేనివారూ మొత్తంగా సంఘ పరివార శక్తులన్నీ హిందూత్వ భావజాల వ్యాప్తికి మితిమీరి ప్రవర్తిస్తున్నారు. భారతదేశంలో ఉండాలంటే హిందువులు కావాలనడం, భారతీయులందరూ హిందువులే అనడం, హిందువులు కానివారందరూ అక్రమ సంతానమే అనడం, ఇతర మతాల వాళ్లు హిందూమతంలోకి తిరిగిరావాలనే నిర్బంధ, భీతావహ వాతావరణాన్ని కలిగించడం, భగవద్గీతను జాతీయగ్రంథంగా ప్రకటించాలనడం, లౌకిక, ప్రజాస్వామిక, శాస్త్రీయ గ్రంథాలను నిషేధించాలనడం, వాస్తవాలు రాసిన రచయితల నోరు నొక్కడం, వీలయినన్ని చోట్ల మతకల్లోలాలు సృష్టించడానికి ప్రయత్నించడం, చివరికి ఇంటర్ నెట్ మీది సామాజిక మాధ్యమాలలో కూడ భావప్రకటనా స్వేచ్ఛ లేని స్థితి కల్పించడం – ఒక్కమాటలో చెప్పాలంటే నరేంద్ర మోడీ పాలన అడాల్ఫ్ హిట్లర్ పాలనను మరిపిస్తున్నది.

ఇలా దేశ ప్రజలకు వ్యతిరేకమైన, ప్రమాదకరమైన విధానాలకు కొనసాగింపే విదేశాంగ విధానం. యూదుల దురాక్రమణకు గురై తమ మాతృభూమిలో తామే శరణార్థులైన పాలస్తీనా ప్రజల స్వేచ్ఛాకాంక్షను సమర్థిస్తూ వచ్చిన విదేశాంగ విధానాన్ని మోడీ ఒక్క కలంపోటుతో మార్చేశాడు. అధికారంలోకి వచ్చిన తర్వాత మొదటి గణతంత్ర దినోత్సవానికే సామ్రాజ్యవాద చక్రవర్తి బారక్ ఒబామాను ఆహ్వానించి తన సామంత స్థితిని ప్రకటించడం మాత్రమే కాదు, గతంలో ఆగిపోయిన అణు ఒప్పందాన్నీ, ఇతర దళారీ ఒప్పందాలనూ కుదుర్చుకున్నాడు. ఈ ప్రజావ్యతిరేక పాలనను ప్రతిఘటించవలసి ఉందనే చైతన్యాన్ని ప్రజల్లో కలిగించడం, ప్రతిఘటనను సమీకరించి, సంఘటితం చేయడం, ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక, మతోన్మాద వ్యతిరేక విశాల ఐక్యసంఘటన నిర్మించడం ఇవాళ ప్రజానుకూల సంస్థల, బుద్ధిజీవుల ప్రధాన కర్తవ్యం కావాలి. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# అక్రమాల పుట్టలే మణిహారాలవుతున్న వేళ

ఎవరు మరచిపోయినా, మరచిపోదలచుకున్నా తెలంగాణ ఉద్యమ క్రమంలో చెరపలేని విధంగా చరిత్రకెక్కిన ప్రధాన అంశం – ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కోస్తా, రాయలసీమ రాజకీయ నాయకులు, పెట్టుబడిదారులు అధికారాన్ని అడ్డు పెట్టుకుని సాగించిన అక్రమాలు. అందులో భూకబ్జాల దగ్గరి నుంచి నీళ్లలో, నిధులలో, నియామకాలలో అన్యాయాల వరకు ఎన్నో ఘటనలు, పరిణామాలు వివరాలతో, గణాంకాలతో సహా నమోదయ్యాయి. వేదికల మీద వందలాది మంది ఉపన్యాసకులు వాటిని పదేపదే చెప్పారు. అవి పాటలకు కూడ ఎక్కాయి. ప్రతి గ్రామంలోనూ జెఎసిలు ఆ అక్రమాల చిట్టాలను ఫ్లెక్సీల మీద అచ్చువేయించి ప్రదర్శించాయి. అలా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలకుల అక్రమాలు తెలంగాణ ప్రజల నిత్య జ్ఞాపకంలో భాగమయ్యాయి. ఆ జ్ఞాపకాన్ని చెరిపెయ్యడానికి ఇవాళ తెలంగాణ పాలకులే ప్రయత్నించడం ఆశ్చర్యాన్నీ విచారాన్నీ కలిగిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ప్రాతిపదిక అయిన 'పెద్దమనుషుల ఒప్పందం' (1956) లో తెలంగాణలో భూముల క్రయవిక్రయాలు తెలంగాణ ప్రాంతీయ మండలి ఆమోదంతో మాత్రమే జరగాలని స్పష్టంగా రాసుకున్న నిబంధన ఒకటి. కాని తెలంగాణ ప్రాంతీయ మండలి సిఫారసులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎప్పటికప్పుడు చెత్తబుట్టలో వేసింది, చివరికి 1973లో అసలు ప్రాంతీయ మండలిని రద్దు చేసేలా పావులు కదిపింది. అంతకుముందూ, ఆ తర్వాతా కూడ లక్షలాది ఎకరాల భూమి అన్యాక్రాంతమైందని తెలంగాణ ఉద్యమ క్రమంలో ఎన్నో వివరాలు బయటపడ్డాయి. అలాగే నీళ్లకు, నిధులకు, నియామకాలకు, సంస్కృతికి సంబంధించి కోస్తా, రాయలసీమల పాలకవర్గాలు, తెలంగాణలోని దళారుల సహాయంతోనే తెలంగాణకు అన్యాయం చేశారని, ఆ అన్యాయాలను సవరించడానికే తెలంగాణ స్వరాష్ట్రం కావాలని ఉద్యమంలో ప్రజలూ, మేధావులూ, రాజకీయ నాయకులూ ఏకకంఠంతో అన్నారు. 2014 జూన్ 2 తర్వాత ఈ చరిత్రంతా, ఈ వివరాలన్నీ మారిపోతున్నట్టున్నాయి. హైదరాబాద్ పరిసరాలలో ఊరుమ్మడి భూములను, చెరువులను, కుంటలను ఆక్రమించుకుని, గ్రామాల దారులకు అడ్డంగా గోడలు కట్టి రహదారులను కబ్జాచేసి తెలంగాణ శత్రువులుగా ఇరవై సంవత్సరాలుగా ప్రజల ఆగ్రహాన్ని చవిచూసిన కబ్జాకోరులు, అక్రమాల పుట్టలు తెలంగాణ మణిహారాలని స్వయంగా ఉద్యమనాయకులు, ప్రభుత్వాధినేతలు ఇవాళ ప్రకటిస్తున్నారు. తెలంగాణ వనరులు దోచుకున్నందుకు, ప్రజలను పీడించినందుకు, ఆస్తులు కొల్లగొట్టినందుకు, సంస్కృతిని అవమానించినందుకు ఏ ఆంధ్ర పెట్టుబడిదారుల మీద ఉద్యమక్రమంలో తెలంగాణ సమాజమంతా నిప్పులు చెరిగిందో, ఆ 'ఆంధ్ర పెట్టుబడిదారులకు ఎర్ర తివాచీ ఆహ్వానం పలుకుతున్నా' అని స్వయంగా తెలంగాణాధీశులు ఇప్పుడు అంటున్నారు. ఇది కేవలం మాట మార్పు వ్యవహారం మాత్రమే కాదు. పాలకవర్గాల ముఠాతగాదాలు ముగిసిపోయాయనడానికి, ఆని ముఠాలూ ఒకే తానులో ముక్కలని చెప్పడానికి సూచన. సరిగ్గా బ్రిటిష్ వలస వ్యతిరేక ఉద్యమ క్రమంలో ప్రజలు ఏమి ఆశించారో అది 1947 ఆగస్ట్ 15న నెరవేర నట్టుగానే, తెలంగాణ ప్రజలు ఏమి ఆశించారో అది 2014 జూన్ 2న నెరవేరలేదనడానికి చిహ్నం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# పెట్టుబడులకు మరోసారి ఎర్రతివాచీ

మెడమీది కాడి తీసేసినా ఉన్నట్టే అనిపించడం, గతం వర్తమానం మీద అధికారం చలాయించడం వంటి అర్థాలలో డెజావూ అనే ఫ్రెంచి నుడికారం ఉంది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు పాలనా విధానాలు చూస్తుంటే ఆ మాట గుర్తుకొస్తున్నది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా అపారమైన అనుభవం ఉన్న ఆయన అప్పటి తన పాలనా ప్రాంతానికి సగానికన్న కాస్త ఎక్కువ ప్రాంతానికి అధిపతి అయిన తర్వాత తన పాత అనుభవపు గుణపాఠాలను ఉపయోగిస్తున్నట్టు లేరు. గతంలో లాగనే ఆయన ప్రస్తుతం కూడ స్విట్జర్లాండ్ లోని డావోస్ నగరంలో ప్రతి ఏటా జరిగే బహుళజాతిసంస్థల, సంపన్నుల, దేశాధినేతల వరల్డ్ ఎకనమిక్ ఫోరం సమావేశానికి వెళ్లారు. ఏ దేశం, ఏ ప్రాంతం తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు ఇవ్వగలుగుతుందని వెతకడానికి బహుళజాతిసంస్థలు, తమ ప్రాంతపు వనరులను అమ్మజూపడానికి, అందులో భాగంగా ముడుపులు పొందడానికి రాజకీయ నాయకులు ఏర్పాటు చేసుకునే ఈ సమావేశాలకు ముఖ్యమంత్రి హాజరు కావడమే తమ రాష్ట్రానికి ఎంతో మేలు అని ఆంధ్రప్రదేశ్ పాలకవర్గాలు ప్రచారం చేస్తున్నాయి. అక్కడ ఆయన వాల్ మార్ట్, పెప్సీ, మైక్రోసాఫ్ట్ వంటి విదేశీ సంస్థల, విప్రో, భారత్ ఫోర్జ్ వంటి దేశీ సంస్థల అధిపతులను, మలేషియా వంటి దేశాల అధినేతలను కలిసి 'ఆంధ్రప్రదేశ్ కు రండి. మీకు అన్ని సౌకర్యాలూ కల్పిస్తాం' అని పిలిచారు. ఇంకా అవమానకరంగా 'ఆంధ్రప్రదేశ్ ఒక కన్య. మీకోసం ఎదురుచూస్తున్నది' (వర్జిన్ అనేది ఆయన వాడిన మాటే!) అని కూడ అన్నారు. ఆయన డావోస్ కు వెళ్లడం ఇది మొదటిసారి కాదు. గతంలో కూడ ఇటువంటి ఆహ్వానాలే పలికారు. నిజానికి ఆ ఆహ్వానాలకు ఫలితం ఏమీ ఉండదు. ఏ పెట్టుబడిదారైనా తనకు ఎక్కడ ఎక్కువ లాభం వస్తుందనే ప్రాతిపదిక మీదనే పనిచేస్తారు గాని పిలిచారా, పిలవలేదా అనేదానితో ప్రమేయం తక్కువ. కాని మన నాయకులు ఆత్మాభిమానాన్ని వదులుకుని ఇలా దేశాన్ని, ప్రాంతాన్ని అమ్మజూపడానికి ప్రయత్నించవచ్చునా అనేది ప్రశ్న. ఆ పెట్టుబడిదారులు ఒకవేళ వచ్చినా ప్రజా ప్రయోజనాలకు భంగకరంగా భూములు, వనరులు ఆక్రమిస్తారు, ఇక్కడి శ్రమను చవకగా దోచుకుంటారు. ఇక్కడి పర్యావరణాన్ని కలుషితం చేస్తారు. ఇక్కడ కనీసం ఉద్యోగ కల్పనకు కూడ దోహదం చేయరు. అవన్నీ గత పాలనాకాలంలో తెలిసిన సంగతులే. అవి కూడ డెజావూ నే. అయినా ఏదో చేశానని చూపుకోవడానికి, సమస్యలమయంగా మారుతున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలు ఆ సమస్యల మీద పోరాడకుండా పక్కదారి పట్టించే రంగుల కలలు అమ్మడానికి డావోస్ పర్యటనలూ, దేశదేశాల పర్యటనలూ, పెట్టుబడులకు ఎర్ర తివాచీలు పరవడమూ ఉపయోగపడవచ్చు. కాని ఆకలి, అవిద్య, అనారోగ్యం, దారిద్ర్యం, నిరుద్యోగం, వనరులదోపిడీ, అవినీతి వంటి నిత్య జీవిత సమస్యలతో సతమతమవుతున్న ప్రజలకు డావోస్ ఏమి ఇస్తుంది? ఆ ప్రజలు మేల్కొని అది గ్రహించిన నాడు ఈ ఎర్రతివాచీలను లాగేస్తారు. ఆ ఎర్రతివాచీలు పరిచేవారు, ఎర్ర తివాచీల మీద నడిచేవారు జారిపడక తప్పదు.

వీ

# పరిహాస స్వేచ్ఛ, ఆధిక్యతా ప్రదర్శన, హంతక రాజకీయాలు

ఈ నెల జరిగిన అనేక అంతర్జాతీయ పరిణామాలలో రెండు తప్పనిసరిగా గుర్తించవలసినవి. లోతుగా ఆలోచించవలసినవి. ఆ రెండు ఘటనలకూ సన్నిహిత సంబంధమేమీ లేదు కాని ఆ రెండు ఘటనలు, వాటి మీద ప్రతిస్పందనలు ఇవాళ అంతర్జాతీయ రాజకీయాలు, మేధో వైఖరులు ఎలా ఉన్నాయో చూపడానికి ఉపయోగ పడతాయి. మొదటిది ఫ్రాన్స్ రాజధాని ప్యారిస్‌లో చార్లీ హెబ్డో అనే వ్యంగ్య వారపత్రిక కార్యాలయంలోకి ఇద్దరు ఆగంతుకులు చొరబడి 'అల్లాహో అక్బర్', 'ప్రవక్తకు జరిగిన అవమానానికి ప్రతీకారం' అని నినాదాలు చేస్తూ కాల్పులు జరిపి సంపాదకుడితో సహా పన్నెండు మందిని చంపివేసిన ఘటన. మహమ్మద్ ప్రవక్త మీదవ్ ఇస్లాం మీద ఆ పత్రిక అవమానకరమైన వ్యంగ్య రచనలు, కార్టూన్లు ప్రచురిస్తున్నదనే ఆరోపణలు చాలకాలంగా ఉన్నాయి. గతంలో కూడ ఆ పత్రిక మీద, కార్యాలయం మీద దాడులు జరిగాయి. సంపాదకుడిని, కార్టూనిస్టులను, రచయితలను కేవలం వారి చిత్రాల, రచనల కారణంగా హత్య చేయడం తప్పనిసరిగా ఖండించవలసినదే. అది భావప్రకటనా స్వేచ్ఛ మీద హంతక దాడే. హంతకులు ఇస్లామిక్ వాదులైనా కాకపోయినా అది దారుణమైన నేరమే. ప్రపంచమంతా ఈ దారుణాన్ని ఖండిస్తూ సరిగానే, న్యాయంగానే ఎలుగెత్తింది. అయితే, ఈ దారుణాన్ని ఖండించడంతో పాటుగానే గుర్తించవలసిన అంశాలు మరికొన్ని ఉన్నాయని ఆ తర్వాత అంతర్జాతీయ వ్యాఖ్యాతలు చూపుతున్నారు. భావప్రకటనా స్వేచ్ఛ, పరిహాసస్వేచ్ఛ అనేవి నిర్నిబంధమైనవా, సాపేక్షికమైనవా అని వారు ప్రశ్నిస్తున్నారు. అధికారపీఠంలో ఉన్నవారినీ, అణచివేతకు గురవుతున్నవారినీ సమానంగా చూసేది భావప్రకటనా స్వేచ్ఛ అవుతుందా, ఆస్తీ అధికారమూ బలమూ ఉన్నవారిని వదిలి, జవాబు చెప్పలేని అభాగ్యుల మీద విమర్శలు చేసి దాన్ని భావప్రకటనా స్వేచ్ఛ అనడమూ, వారి మీద పరిహాసాలు చేసి దాన్ని పరిహాస స్వేచ్ఛ అనడమూ ఆధిక్యతా ప్రదర్శన కాదా, అది ఒక అహంకారం కాదా అని వారు ప్రశ్నిస్తున్నారు. ఆ పరిహాసాలకు కూడ జవాబు హత్య, భౌతిక దాడి కాగూడదు. కచ్చితంగా ఆ హత్యాకాండను ఖండించవలసిందే. కాని క్రైస్తవ, యూదు తదితర బలమైన అధికారవర్గాల మీద ఉపయోగించని పరిహాస స్వేచ్ఛను, అల్పసంఖ్యాకులైన ముస్లింల మీద ఉపయోగించడం, అందులోనూ మహమ్మద్ ప్రవక్తను నగ్నంగా, అవమానకరంగా చిత్రించడం భావప్రకటనా స్వేచ్ఛ అవుతుందా అని వారు ప్రశ్నిస్తున్నారు. అంతకన్న పెద్ద హత్యాకాండల మీద ప్రతిస్పందన ఏదని వారు అడుగుతున్నారు. దాడి జరిగిన జనవరి 7 నుంచి అంతర్జాతీయ ప్రచారసాధనాలన్నిటిలో హోరాహోరీ చర్చ జరుగుతున్నది. సరిగ్గా ఈ సమయంలోనే తనను తాను బౌద్ధుడిగా చెప్పుకుంటూనే వేలాది మంది ఈలం పోరాటయోధులను, తమిళులను ఊచకోత కోసిన, భయంకరమైన వివక్ష అమలుచేసిన మహింద రాజపక్షె ఎన్నికల్లో ఓడిపోయాడు. మత, జాతి విద్వేషంతో కూడైన హత్యాకాండల పట్ల లోతైన చర్చ జరగవలసిన సన్నివేశం ఇది. పన్నెండు మంది బుద్ధిజీవుల హత్యకు స్పందించిన అంతర్జాతీయ సమాజం వేలాది మంది ముస్లింల, తమిళుల, పీడితుల హత్యలకు, చిత్రహింసలకు, వారి పట్ల జరుగుతున్న అక్రమాలకు ఎలా స్పందిస్తున్నదో ఇప్పటికైనా ఆలోచించాలి. వీ

## ఎన్నికలు – ఎంత స్వేచ్ఛ! ఎంత న్యాయం!

ముప్పై ఏళ్ల కిందటి ఆర్.కె. లక్ష్మణ్ కార్టూన్





❖ **ఇదండీ మహా భారతం! –** రంగనాయకమ్మ – ప్రచురణ : స్వీట్ హోమ్ పబ్లికేషన్స్ – 486 పేజీలు, 1/8 రాయల్, రు. 100, ప్రతులకు : అరుణా పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ–520 002; ఫోన్: 0866–2431181




❖ **పాదముద్రలు** – శాఖమూరి రవి – ప్రచురణ : విప్లవ రచయితల సంఘం–54 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : శాఖమూరి రవి, గ్రా. తిరుమలపూర్, మం. చిట్యాల, జిల్లా. వరంగల్, సెల్ : 7893223770, email : ravishakamoori@gmail.com




❖ **బీజభూమి** – వరవరరావు – ప్రచురణ : విప్లవ రచయితల సంఘం–157 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : వరవరరావు, ఫ్లాట్ నెం. 419, హిమసాయి హైట్స్ జవహర్‌నగర్, హైదరాబాద్ – 500 020, అన్ని పుస్తక కేంద్రాలు.



❖ **సోషలిస్టు సూఫీ – ఫైజ్ అహ్మద్ ఫైజ్ –** జీవితం-కవిత్వం – వాహెద్ – ప్రచురణ : కవి సంగమం బుక్స్ –212 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ, పాలపిట్ట, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, అండ్ ఆల్ రిప్యూటెడ్ బుక్ హౌసెస్



❖ **మీ కోసం – సమాచార హక్కు** – కర్ర రాఘవేందర్‌రెడ్డి –375 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు : సెల్ : 9848492877, email: raghu.dream@yahoo.com




❖ **చూపు నవల** – బి.ఎస్. రాములు – ప్రచురణ: విశాల సాహిత్య అకాడమీ –320 పేజీలు, 1/8 డెమీ, రు. 195, ప్రతులకు : విశాల సాహితీ అకాడమీ, 201, సులేఖ గోల్డెన్ టవర్స్, 2–2–186/53/5, రామకృష్ణ నగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ –500 013, ఫోన్ : 08331966987




❖ **తెలంగాణ రైతాంగ పోరాట భూమిక – చాకలి ఐలమ్మ** – ఎలికట్టె శంకర్‌రావు – ప్రచురణ : నోముల సాహిత్య సమితి –72 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ఎన్.ఎన్. అరుణ, నోముల సాహిత్య సమితి, సాయిటవర్స్, నాగార్జున కాలనీ, నల్లగొండ, ఫోన్ : 7799114349, ప్రముఖ పుస్తక దుకాణాలు.



❖ **దారిలో లాంతరు** – రక్షిత సుమ – ప్రచురణ : కవి సంగమం –48 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : రక్షిత సుమ కెరాఫ్ కట్ట లీలావతి, ఇం.నెం. 3–4–1/12/బి/3, బాలజీనగర్, రామంతాపూర్, హైదరాబాద్ – 500 013



❖ **అనుభవాలు – దృక్పథాలు –** విముక్తి ఉద్యమాల్లో తెలంగాణ స్త్రీలు : సిరీస్–1, ముక్త ప్రచురణ, ఎ తెలంగాణ ఉమెన్స్ కలెక్టివ్– 267 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : ముక్త – ఎ తెలంగాణ ఉమెన్స్ కలెక్టివ్ స్టడీ సెంటర్, 21ఎ, హెచ్ఐజి, ఫేజ్ – , న్యూ సంతోష్‌నగర్ కాలనీ, సైదాబాద్, హైదరాబాద్–500059 సెల్: 9848098333, email : vkatikaneni@gmail.com




❖ **ఈనాటి కవిత** – కవిత్వ విమర్శ – ఎం. నారాయణ శర్మ – ప్రచురణ : కవి సంగమం బుక్స్ – 259 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : ఎం. నారాయణశర్మ, 2–2–1105/5/10, ఫ్లాట్ నెం. 16, నీలాద్రి అపార్ట్‌మెంట్స్, తిలక్‌నగర్, న్యూ నల్లకుంట, హైదరాబాద్ – 500 044 email : manra.sharma66@gmail.com



❖ **మశాల్**–తెలంగాణ మహోద్యమ కావ్యం–వనపట్ల సుబ్బయ్య – ముక్త ప్రచురణలు, 191 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎం. సుబ్బయ్య (వనపట్ల), భార్గవీ హెయిర్ స్టైల్స్, నల్లవెల్లి రోడ్, బస్‌స్టాండ్ దగ్గర, నాగర్‌కర్నూల్ – 509209, మహబూబ్‌నగర్; సెల్: 94927 65358; email : subbaiahvanapatla@gmail.com



❖ **ఆకుపచ్చని తడిగీతం** – బొల్లోజు బాబా – ప్రచురణ : పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం–54 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : బొల్లోజు బాబా, 30–7–31, గొల్లలవీధి, సూర్య నారాయణపురం, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా, ఫోన్ : 0884–2368189, ప్రముఖ బుక్ షాపులలో




❖ **కరువు కురిసిన మేఘం** – వై.హెచ్.కె. మోహన్‌రావు – 53 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : వై.హెచ్.కె. మోహన్‌రావు, పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు, హెచ్.నెం. 11–61/3, జె.పి. రోడ్, పిడుగురాళ్ల, గుంటూరు –522 413, ఫోన్ : 94401 54114



❖ **భూమధ్యరేఖ** – కాశిరాజు కవిత్వం – 94 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : అన్ని పుస్తక షాపులలో




❖ **అందరి దేవుడు ఒక్కడే –** లియో టాల్‌స్టాయ్ అనువాద కథలు – ఒద్దిరాజు మురళీధర్ రావు –113 పేజీలు, 1/8 డెమీ, రు. 125, ప్రతులకు : ఒద్దిరాజు మురళీధరరావు, ఇ.నెం. 1–8–702/1/1, నల్లకుంట, శంకర్‌మఠ్ ప్రక్కన, హైదరాబాద్ – 500 044, ఫోన్ నెం : 9908221920




❖ **పిల్లల సంరక్షణ –** మనకు డాక్టర్ అందుబాటులో లేనప్పుడు – కాసడీ టామస్, లారెన్ హ్యాయి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, 202 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్–500006 ఫోన్: 2352184, www.hyderabadbooktrust.blogspot@gmail.com

# అధ్యక్షుడు ఒబామా - ప్రధాని మోడీ ముఖాముఖీ

***భారత గణతంత్ర దినోత్సవ అతిథిగా వచ్చిన అమెరికా అధ్యక్షుడు బారక్ ఒబామాకూ భారత ప్రధాని నరేంద్ర మోడీకీ మధ్య ఏ సంభాషణ జరుగుతుందో వ్యంగ్యంగా ఊహిస్తున్నారు* అరుణ్ ఫెరీరా, వెర్నన్ గోన్జాల్వెస్**

ప్రధాని నరేంద్ర మోడీ, అధ్యక్షుడు బారక్ ఒబామా సన్నిహితంగా ఉండడానికీ, ప్రపంచంలోకెల్లా పెద్ద, సంక్లిష్టమైన దేశాలను పాలిస్తున్న తమ అనుభవాలు పంచుకోవడానికీ రిపబ్లిక్ డే పరేడ్ మంచి అవకాశం. ఇద్దరూ పక్కపక్కన కూచుని తమ ముందర సాగిపోతున్న శకటాలనూ, వాటి మీద ప్రదర్శనకు పెట్టిన ఆయుధాలనూ చూస్తున్నారు. తలల మీద విమానాలు ఎగురుతున్నాయి. రెండు హృదయాలు కలబోసుకోవడానికి అది ఒక ఆదర్శవంతమైన నేపథ్యాన్ని సమకూరుస్తోంది. అక్కడ అభివృద్ధి గురించీ, సుపరిపాలన గురించీ, మహా ప్రజాస్వామ్యాలను తయారు చేయడానికి అవసరమైన చిన్నా చితకా విషయాల గురించీ వారు మనసులోని మాటలు చెప్పుకోవచ్చు. ఈ ముఖాముఖీ ఎలా ఉంటుందో ఒక ఊహ:

**మోడీ:** బారక్ భాయ్ ఎలా ఉంది మీకిక్కడ? హాయిగా ఉందా? అంతా మీకు ఇష్టంగానే ఉందనుకుంటా...

**ఒబామా:** సారు చె నరేంద్రా, అబ్బ, బ్రహ్మాండంగా ఉంది! ప్రతీదీ కళ్లు మిరుమిట్లు గొలుపుతోంది. ఢిల్లీ అద్భుతమైన నగరం. సుదీర్ఘ చరిత్ర. ఎందరో జనాలు... అక్కడ కూచునీ నిలబడీ మనకు జేజేలు కొడుతున్నవాళ్లు లక్షలాది మంది ఉంటారు గదూ... ఈ పొగమంచులో ఏమీ కనబడ్డం లేదనుకో. మీ భద్రత ఎలా ఉంటుంది, కష్టమా?

**మో:** అయ్యో, ఏమీ కష్టం కాదు. మేం ముందుగానే మెట్రో రైళ్లు ఆపేశాం. రోడ్ల మీద ముళ్లకంచెలు పాతాం. మాకు కావలసిన వాళ్లనే రానిస్తాం. జనం లేకపోతే, కష్టమే లేదు గదా? కావాలంటే వాళ్లు టివి మీద చూడొచ్చు. మనందరం క్రికెట్ చూసినట్టుగా...

(మోడీ, మోడీ అనే కేకలు పొగమంచు చీల్చుకుని వినబడతాయి)

**ఒ:** ఢిల్లీ ఎన్నికలు ఎలా ఉన్నాయి? దారి పొడుగునా నీ బొమ్మలు చూశాను. కాని ఆ మెడకు మఫ్లర్ చుట్టుకున్న వ్యక్తి ఎవరు – ఢిల్లీ ఎన్నికల్లో నీ మనిషా?

**మో:** హే భగవాన్, నా మనిషి కాదు, నా మనిషి కాదు! అతని పేరు అరవింద్. అరాచకవాది! నేనతణ్ని వెళ్లి నక్సలైట్లలో కలవమని చెప్పాను. ఈ సారి ఆ శాల్తీని కట్టగట్టి పంపేస్తాను. ఇక అతనికి ఎన్నికలనేవి ఉండవు.

**ఒ:** ఓ, సారీ నరేన్, నా మాట పట్టించుకోకు. కానీ ఏదో నక్సలైట్లు అన్నావే, ఏంటది, ఏదన్నా వ్యాపారమా?

**మో:** అయ్యో, అది వ్యాపారం కాదు బారక్ భాయ్, నక్సల్ కుర్రాళ్లు అసలు వ్యాపారాలకు వ్యతిరేకం. నక్సలైట్లంటే మావోయిస్టులన్నమాట.

**ఒ:** అమ్మయ్యో, మీకిక్కడ చైనావాళ్లు కూడ ఉన్నారా? వెంటనే వాళ్లను తన్ని తరిమెయ్యి. ఆ విషయంలో నువ్వేం చేసినా నా సాయం ఉంటుందనుకో.

**మో:** అయ్యయ్యో, వాళ్లు చైనావాళ్లు కాదు బారక్ భాయ్. ఈ కుర్రాళ్లు ఇండియా వాళ్లే. మాదేశం లోపల అతి పెద్ద ప్రమాదం వాళ్లే. వాళ్లు మమ్మల్ని మంచి వ్యాపారాలు చేసుకోవద్దంటారు. వాళ్లు ఆ పర్యావరణవాదుల కన్నా ఘోరం. వాళ్లలో చాలమంది ఆదివాసులు. మేం అడవుల్నీ, అడవి మనుషుల్నీ ఖాళీ చేయించొద్దంటారు. వాళ్లవల్ల ఎన్నో గనులు, భారీ ఆనకట్టలు, విద్యుత్ పథకాలు ఆగిపోయి ఉన్నాయి. అసలు అభివృద్ధే ఆగిపోయిందంటే నమ్మండి!

**ఒ:** ఓహ్ నిజంగా వెనుకబడిన దద్దమ్మలే, కదూ? మా వాల్ స్ట్రీట్ కుర్రాళ్లకు ఇటువంటి వాళ్లంటే అసలే పడదు. నువ్వు గట్టిగా ఉండాలి, మాన్. దేశం ప్రగతిపథంలో పోతుంటే పిడికెడు మంది ఆదివాసులు అడ్డుకుంటే ఎట్లా? మాకు కూడ రెడ్ ఇండియన్లని ఉండేవాళ్లు. వాళ్లందరినీ ఖాళీ చేసి ఉండకపోతే ఇవాళ అమెరికా ఎక్కడుండేది? అభివృద్ధి కావాలంటే మూల్యం చెల్లించాలి బాబూ. గొప్ప సత్కార్యం కోసం ఎవరో ఒకరిని బలి ఇవ్వాలిగా.

**మో:** ఔనౌను బారక్ భాయ్, మీరేమీ చింతించకండి. అసలు పని అయిపోయిందనే అనుకోండి. మా రాజ్ ఆ పని మీదనే ఉన్నాడు. ఈ




బొమ్మ : అరుణ్ ఫెరీరా

వ్యవహారాన్ని చక్కదిద్దడానికి అతని హోం శాఖ ఈ మధ్యనే ఒక కొత్త విధానం తయారు చేసింది. 'ఖాళీ చెయ్యి, ఆక్రమించు, నిర్మించు' అని దానిపేరు. స్థానికులను ఖాళీ చెయ్యి. భూమి ఆక్రమించు. ఆ శిథిలాల మీద నిర్మించు – అదీ పథకం. అయినా మీకు చెప్పాలా, మీ వాళ్లు వియత్నాంలో, ఆఫ్ఘనిస్తాన్‌లో, ఇరాక్‌లో చేసిందదేగా. మీ కుర్రాళ్లు కాస్త కంగాళీ చేశారని కొందరంటారనుకోండి. కాని మీరు భలే మంచి పని చేశారని నేనూ మా రాజ్ అనుకుంటాం. ఇంక ఆలస్యం చేయడానికి లేదు. మా కుర్రాళ్లకు – టాటా, ముఖేష్ వగైరాలకు – రోజురోజుకూ ఓపిక నశిస్తోంది. మరి వాళ్లనూ తప్పు పట్టలేం గదా? ఆ అడవుల కింద బంగారం, నిజంగా బంగారం ఉంది. ఎక్కడ తవ్వితే అక్కడ ఉంది. అందుకే మీ కంపెనీల వాళ్లు కూడ ఇంకా ఎక్కువ కల్పించుకోవాలని నేనంటున్నా.

**ఒ:** మావాళ్లలో పెద్దవాళ్లందరినీ రమ్మంటా. కాని వాళ్లు కొన్ని హామీలు అడుగుతున్నారు. ఇబ్బందులు ఎదురవుతాయని తెలిసి తెలిసీ రాలేరు గదా. వందల కోట్లు పెట్టి ఎవరో గోచిపాత రాయుళ్లు అడ్డుపడితే ఆగిపోలేరు గదా...

**మో:** నిజమే బారక్ భాయ్, మేం చాల ఇబ్బందుల్లో ఉన్నాం.

(సరిగ్గా అప్పుడే ఒక కిరకిరలాడే చేతక్ హెలికాప్టర్ వాళ్ల తలల మీద గులాబీ రెక్కలు చల్లుతూ పోయింది. వాళ్లు ఆ హెలికాప్టర్ వైపు, కెమెరాల వైపు చేతులూపారు.)

**మో:** ఆదివాసులను అక్కడి నుంచి తరిమేయడానికి మేం చేయగలిగిందల్లా చేస్తున్నాం. ఇదిగో ఇలాంటి హెలికాప్టర్లు కూడ వాడుతున్నాం. కాని వాళ్లు హెలికాప్టర్ల మీద కూడ కాల్పులు జరుపుతున్నారు. మా ఎయిర్ ఫోర్స్ వాళ్లేమో దీంట్లోకి మమ్మల్ని లాగకండి అంటున్నారు.

**ఒ:** మా అపాచీ, షినూక్ హెలికాప్టర్లు మీకు పనికొస్తాయనుకుంటా. మా దగ్గర మంచి సాయుధ హెలికాప్టర్లున్నాయి. కాని మీరు ఇంత సున్నితంగా ఉంటే కుదరదబ్బాయ్, త్వరలోనే ఏదో ఒకరోజు మీరు విచ్చలవిడిగా కార్పెట్ బాంబింగ్ చేయాలి. మేం అదంతా చాల కష్టపడి నేర్చుకున్నాం. ఇటువంటి విషయాల్లో శషభిషలు కూడవు.

**మో:** ఔనౌను బారక్ భాయ్, కాని ఈ మానవహక్కుల వాళ్లున్నారే, వాళ్లు రచ్చ చేస్తున్నారు. ఆదివాసులు మన సొంత మనుషులే, మన సొంత పౌరులే అంటూ ఉంటారు వాళ్లు. మా రాజ్యాంగం ఒప్పుకోదు అని కొందరు జడ్జిలు కూడ అంటున్నారు.

**ఒ:** ఓ, నరేన్, మాకు కూడ రాజ్యాంగం అనేదొకటి ఉంది. కాని మా పౌరులను ఖతం చేయవలసి వచ్చినప్పుడు ఖతం చేయడంలో అదేమీ అడ్డం రాదు. అదంతా చట్టబద్ధమే. తెలుసా? నేనే స్వయంగా మరణశాసనం మీద సంతకం పెడతాను. నేను డ్రోన్లు కూడ వాడుతున్నాను. అవెంత అద్భుతమైన యంత్రాలో తెలుసా నీకు? సరిగ్గా వీడియో గేమ్స్ ఆడినట్టే. గురి చూడు... వామ్ బామ్ బూమ్... ఖతం. అక్కడో ఇక్కడో పొరపాట్లు జరుగుతాయనుకో, మనం గురి చూడనివాళ్లు కూడ లేచిపోతారనుకో. కాని అటువంటి అనుకోని ప్రమాదాలు జరగకుండా మనం ఏమీ చేయలేం. నీకు కూడ అటువంటి యంత్రాలుండాలి.

**మో:** అవునవును. మేం కూడ అవి కొనడానికి ప్రయత్నిస్తున్నాం. మా సైనికాధికారి మనోహర్ చాల తెలివైనవాడు. అన్ని లావాదేవీలూ గబగబా జరిపేస్తున్నాడు. కాని మీ దగ్గర కోర్టులూ, పత్రికలూ ఏమన్నా గొడవ చేస్తాయేమో...

**ఒ:** కోర్టులా, వాటికి సరిపోయే చట్టాలిచ్చావంటే, వాటి పని అవి చూసుకుంటాయి.

**మో:** ఆ, మాకు ఒక యూపా (యుఎపిఎ – చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం) అనే తీవ్రవాద, చట్టవ్యతిరేక చర్యలను అడ్డుకునే చట్టం ఉంది. కాని కొందరు జడ్జిలు దాన్ని పలచబారుస్తున్నారు...

**ఒ:** ఏంటీ, 'యూ పా' నా? ఆ మాటే బాగా లేదు. మేమయితే మా తీవ్రవాద వ్యతిరేక చట్టానికి పేట్రియట్ (దేశభక్తుడు) అని పేరు పెట్టాం. ఎంత మంచి పేరో చూడు. ఆ పేరుకే మురిసిపోయి చాల మంది దాన్ని సమర్థిస్తారు. ప్రతి ఒక్కరికీ దేశభక్తుడు కావాలని ఉంటుంది గదా. పత్రికలకూ టీవీ ఛానళ్లకూ అయితే ఆ కోరిక మరీ ఎక్కువ. ఇక మీడియా విషయంలో అదనంగా యజమానులను కూడ మనతో కలుపుకోవాలి.

**మో:** ఆ పని నేనూ చేశాననుకోండి. ఇప్పుడు వాళ్లలో చాలమంది మన మాట వినేవాళ్లే. ఇక మన ముఖేష్, ఇతర మిత్రులూ మిగిలిన వాళ్ల సంగతి చూస్తున్నారు. ఎవడైనా తోక జాడిస్తే, కత్తిరించి పారేస్తామనుకోండి.

**ఒ:** సరే సరే... మీకు ఫస్ట్ అమెండ్ మెంట్ హక్కులు (అమెరికన్ రాజ్యాంగంలో మొదటి సవరణ ద్వారా వచ్చిన హక్కులు) లేవా, అంటే తెలుసా, భావప్రకటనా స్వేచ్ఛ వగైరా...

**మో:** అవునవును, మాకూ మొదటి రాజ్యాంగ సవరణ ఉంది. నెహ్రూ దాన్ని తీసుకొచ్చాడు. అయితే అది భావప్రకటనా స్వేచ్ఛ ఇవ్వడానికి కాదు, దాని మీద ఆంక్షలు విధించడానికి.

**ఒ:** వావ్! మా జాతి నిర్మాతలకు అంత తెలివి లేకుండింది. వాళ్లకు అంత తెలివి ఉంటే ఎంత బాగుండు...

**మో:** బారక్ భాయ్, మీరు అచ్చు నాలాగే ఉన్నారు. మే ది ఫోర్స్ బి విత్ యు. మీరు శక్తిమంతులు కావాలి...

(అప్పుడే వాళ్ల సంభాషణలో మిషెల్ జోక్యం చేసుకుంది. 'జశోదాబెన్ బాగున్నారా' అని మర్యాద కోసం మోడీని అడిగింది. ఆ ప్రశ్నే అక్కడి వాతావరణాన్ని చెడగొట్టింది.)

*ఈ వ్యంగ్య, ఊహాత్మక సంభాషణ ఒబామా భారత పర్యటనకు కొద్దిరోజుల ముందు జనవరి 20 న www.dailo.in పై ప్రచురితమయింది.* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.*

# కేంద్ర ప్రభుత్వ ఆర్డినెన్స్‌ల పరిపాలన

***దేశీ, విదేశీ గుత్త పెట్టుబడులను భారీ స్థాయిలో వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో దించి, రైతాంగ, వ్యవసాయ కూలీల, పారిశ్రామిక కార్మికుల జీవితాలను ఛిద్రం చేయడమే ఆర్డినెన్స్‌ల ఉద్దేశం అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

శీతాకాల పార్లమెంట్ సమావేశాలు 2014 డిసెంబర్ 23న ముగిశాయి. ఫిబ్రవరిలో బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానుండగా 'భూ సేకరణ చట్టం -2014' సవరణ బిల్లుకు ఆర్డినెన్స్ ద్వారా చట్ట సవరణకు ఎందుకు తొందర? ఇంత హడావుడిగా నిర్ణయాలు తీసుకుందంటే దానికి రాజకీయ కారణాలు ఉన్నాయి. అది, షేర్ మార్కెట్లకు సానుకూల సంకేతం ఇవ్వడం కావచ్చును! లేదా అంతర్జాతీయ ట్రేడింగ్ మెప్పుకోసం కావచ్చును. లేదా భారత్‌లో పర్యటించిన అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాను సంతృప్తి పరిచేందుకు కూడా కావచ్చును. మోడీ పాలనాధికారం చేపట్టి ఎనిమిది మాసాలు అవుతున్న కాలంలోనే ప్రభుత్వం పది ఆర్డినెన్స్‌లు జారీ చేసింది. ఆర్డినెన్స్‌ల జారీ పద్ధతి ప్రజాస్వామ్యహితమైనది కాదు. ఇది రాజ్యాంగ స్ఫూర్తినీ, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్నీ అవహేళన్యం చేయడమే. అత్యవసరంలో ఉపయోగించాల్సిన అధికారాన్ని దుర్వినియోగం చేయడమే! ఇది మెజారిటీ నియంతృత్వం తప్ప ప్రజాస్వామికం ఏమాత్రం కాదు. మన పార్లమెంట్ తొలి స్పీకర్ జి.వి. మావలంకర్ తొలి ప్రధాని నెహ్రూతో 'దొడ్డి దారిన ఆర్డినెన్స్‌లు జారీ చేయడం అంటే పార్లమెంటును పక్కకు నెట్టి సమాంతరంగా పాలన సాగించడమే' అని చెప్పడం గమనార్హం. అయినా ఆర్డినెన్స్‌రాజ్ నిరంతరంగా కొనసాగుతూనే ఉంది. 255 సభ్యులు గల రాజ్యసభలో బిజెపికి గల సంఖ్య 45 మాత్రమే. ఆర్డినెన్స్ కాలపరిమితి ఆరు మాసాలే. ఆ తర్వాతనైన బిల్లును రాజ్యసభకు పంపాలి. రాజ్యసభలో బిల్లుకు ఆమోదం లభించే అవకాశం లేదు. బిల్లు ఆమోదం పొందాలంటే ఉభయసభలను సమావేశపరిచి చట్టబద్ధతను పొందాల్సి ఉంటుంది. అయితే మన పార్లమెంట్ చరిత్రలో ఇప్పటి వరకు ఉభయ సభలను సమావేశపరిచి ఇప్పటికి 1961లో అసాధారణ బిల్లును, 1978లో బ్యాంకింగ్ సర్వీస్ కమీషన్ సవరణ బిల్లును, 2002లో తీవ్రవాద నిరోధక బిల్లును అసాధారణంగా ఉభయ సభలు ఆమోదించాయి.

తమ గెలుపుకు కారణమైన అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి రుణం తీర్చుకునేందుకు బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల పరిమితి పెంపునకు మార్గం సుగమం చేసే ఆర్డినెన్స్, రద్దు చేసిన బొగ్గు క్షేత్రాల పునః కేటాయింపునకు సంబంధించిన ఆర్డినెన్స్‌లపై రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ 2014 డిసెంబర్ 26న సంతకం చేశారు. శీతాకాల సమావేశాల్లో వీటికి సంబంధించిన బిల్లులు ఆమోదం పొందలేకపోవడంతో ప్రభుత్వం ఆర్డినెన్స్ రూపంలో తీసుకువచ్చింది. బొగ్గుగనుల జాతీయకరణ చట్టం -1973 ప్రకారం బొగ్గు తవ్వకంపై కోల్ ఇండియాది గుత్తాధికారం. ప్రైవేట్ కంపెనీల సొంత వినియోగానికి బొగ్గుగనులు కేటాయించే అవకాశం కల్పిస్తూ 1993లో కోల్‌ఇండియా గుత్తాధికారానికి తూట్లు పొడిచారు. కోల్ ఇండియా ప్రతిపత్తిని కాపాడుతామంటూనే ప్రభుత్వం ప్రైవేటీకరణకు ద్వారాలు తెరిచింది. ఇక అప్పటి నుండి బొగ్గు క్షేత్రాల కేటాయింపుల్లో అనేక అక్రమాలు చోటు చేసుకున్నాయి. బొగ్గుగనుల కేటాయింపు ఒక భారీ కుంభకోణంగా తయారైనందున సుప్రీంకోర్టు 214 గనుల కేటాయింపును రద్దు చేసింది. ఇప్పుడు ఆ క్షేత్రాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడానికి తిరిగి ఇ-వేలం ద్వారా ప్రైవేట్ కంపెనీలకు అప్పజెప్పేందుకై ఆర్డినెన్స్ జారీ చేసింది. తొలుత ప్రభుత్వ రంగాలైన ఎన్‌టిపిసి, రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డులు, మైనింగ్ కార్పొరేషన్లకు కేటాయిస్తారు. తొలి రౌండులో ప్రైవేట్ విద్యుచ్ఛక్తి, సిమెంట్, ఉక్కు పరిశ్రమలకు కేటాయిస్తారు. ప్రైవేట్ కంపెనీలు భవిష్యత్‌లో వాణిజ్య ఉత్పత్తి చేపట్టే వీలు కల్పించే క్లాజును ఆర్డినెన్స్‌లో పొందుపర్చడం గమనార్హం. అంతేకాకుండా అక్రమ పద్ధతుల్లో బొగ్గు క్షేత్రాలు పొంది, సుప్రీంకోర్టు తీర్పుతో రద్దుకు గురైన కంపెనీలు కూడా ఇప్పుడు ఇ-వేలంలో పాల్గొని బొగ్గు క్షేత్రాలు పొందే అవకాశం ఆర్డినెన్స్ కల్పించింది. అవినీతి పద్ధతుల్లో బొగ్గు క్షేత్రాలు పొంది ఉత్పత్తి ప్రారంభించకుండా కృత్రిమ కొరత సృష్టించిన లేదా తమ భవిష్యత్ ప్రణాళికలకు క్షేత్రాలు దాచుకున్న వారికి లేదా కొద్ది కాలంలోనే లాభాలకు ఇతరులకు అమ్ముకున్న కంపెనీలు తిరిగి వేలంలో వాటిని పొందే అవకాశం కల్పించడమంటే అవినీతికి చట్టబద్ధత కల్పించడమే అవుతుంది.

గత దశాబ్దకాలంగా కార్పొరేట్ శక్తులు, పాలకులు కలిసి సహజ వనరులైన బొగ్గు లూటిచేసి ప్రభుత్వ ఖజానాకు నష్టం కలిగించినట్లు కాగ్, సిబిఐ, సుప్రీంకోర్టు తప్పుబట్టిన విషయం తెలిసిందే. పార్లమెంటులో చర్చించకుండా హడావుడిగా 'అత్యవసర ఆదేశం' జారీ చేయడంలోని ఉద్దేశం కార్పొరేట్ ప్రయోజనం తప్ప దేశ ప్రయోజనం ఎంతమాత్రం కాదు. బొగ్గు క్షేత్రాలకు సంబంధించిన ఆర్డినెన్స్‌కు రాష్ట్రపతి ఆమోద ముద్ర లభించడంతో వీటిని ప్రైవేట్ కంపెనీల సొంత అవసరాల కోసం ఇ-వేలం వేయడానికి, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వరంగ సంస్థలకు నేరుగా కేటాయించడానికి వీలవుతుంది. తొలిదశలో 101 బొగ్గు క్షేత్రాలను ప్రైవేట్ కంపెనీలకు కేటాయించనున్నారు. వీటిలో 65 క్షేత్రాలను వేలం వేస్తారు. దీని ద్వారా బొగ్గు నిక్షేపాలు అధికంగా ఉన్న ఒడిశా, జార్ఖండ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలు రాబోయే 3 ఏళ్లలో రు. 7 లక్షల కోట్లకు పైగా విలువగల బొగ్గువేలం వేయబోతున్నారు. తొలిదశలో వేలం వేసే 24 క్షేత్రాల్లో ఏడింటిని విద్యుత్తు రంగానికి కేటాయిస్తారు. ఉక్కు -

సిమెంట్ పరిశ్రమలకు 17 క్షేత్రాలను ఇస్తారు. వేలాన్ని ప్రభుత్వరంగ ఎంఎస్‌టిసి సంస్థ నిర్వహిస్తుందని, లావాదేవీల సలహాదారుగా ఎస్‌బిఐ క్యాప్ వ్యవహరిస్తుందని ప్రభుత్వం తెలిపింది. ఉత్పత్తికి సిద్ధంగా ఉన్న గనులకు వేలం ప్రక్రియను 2015 మార్చ్ 31లోగా పూర్తి చేయనున్నారు. ఈ ఆర్డినెన్స్ ద్వారా జాతి సంపదైన బొగ్గు క్షేత్రాలను ప్రైవేట్ రంగానికి కట్టబెట్టడానికి వీలు అవుతుంది. ఈ దొడ్డిదారి ప్రైవేటీకరణ దేశానికి, పారిశ్రామిక సుస్థిరతకు ఏమాత్రం ప్రయోజనకరం కాదు. ఈ ఆర్డినెన్స్ జారీకాగానే స్టాక్ మార్కెట్ సూచి 321 పాయింట్లు పెరగడంతో పెట్టుబడి దారులకు ఆనందాన్ని కలిగించింది. అంటే మోడీ ప్రభుత్వం పెట్టుబడిదారుల ప్రయోజనాలు కాపాడుతుందనే అర్థం కదా!

బీమారంగంలో ఎఫ్‌డిఐని 49 శాతం అనుమతించే బిల్లును ఎలాగైనా శీతాకాల పార్లమెంట్ సెషన్‌లో ఆమోదింపజేయాలని బిజెపి పట్టుదలతో కృషి చేసింది. ఈ బిల్లు ద్వారా జాతీయ ప్రయోజనాలు చేకూరుతాయని, దేశంలోకి రు.22 వేల కోట్ల విదేశీ పెట్టుబడులు వస్తాయని, ఇన్సూరెన్స్ సదుపాయం ప్రజల్లో మరింత విస్తరిస్తుందని చెపుతున్నారు. బీమారంగంలో ఎఫ్‌డిఐ పరిమితి 26 శాతమే ఉండడం వల్ల రు. 8,700 కోట్ల మేరకే ప్రైవేట్ పెట్టుబడులకు అవకాశం లభించిందని, తాజా ఆర్డినెన్స్ ద్వారా 6-8 బిలియన్ డాలర్ల పెట్టుబడులు వచ్చే అవకాశం ఉన్నట్లు ప్రభుత్వం తెలిపింది. ప్రస్తుతం దేశంలో 24 జీవిత భీమా సంస్థలు, 28 సాధారణ బీమా సంస్థలు పని చేస్తున్నాయి. నిజానికి విదేశీ ఇన్సూరెన్స్ కంపెనీలు తమ మాతృదేశాల్లో మలిన చరిత్ర కలిగి ఉన్నాయి. పట్టాదారుల సొమ్ము (క్లయిమ్) ఎగవేతకు పాల్పడ్డాయి. పశ్చిమ దేశాల బీమా కంపెనీలు నష్టాలకు పెట్టింది పేరు. క్లయిమ్‌లు ఎగవేయడంలో అవి దిట్ట. అమెరికాలోని అత్యంత భారీ బీమా కంపెనీ ఎ.ఐ.జి 2008లో నిలువునా కుప్పకూలిన చరిత్ర మనం ఇంకా మరిచి పోలేదు. 2008 తదనంతరం అమెరికా, పశ్చిమదేశాల బీమా కంపెనీలు దివాళా తీశాయి. అలాంటి విఫల, నష్టపోయిన కంపెనీలకు భారతదేశ బీమారంగాన్ని ఇచ్చేయాలని పశ్చిమ దేశాలు ఎంతో కాలంగా డిమాండ్ చేస్తున్నాయి. దానికి భారత పాలకులు ఆమోదాన్ని తెలుపుతున్నారు.

కాంగ్రెసు ప్రభుత్వం 1956లో 25 ప్రైవేట్ జీవిత భీమా సంస్థలను జాతీయం చేసింది. అప్పటి నుండి జీవిత భీమా సంస్థ (ఎల్‌ఐసి)గా పని చేస్తుంది. 1973లో జనరల్ ఇన్సూరెన్స్ కూడా జాతీయం చేయబడింది. 2002లో ఎన్‌డిఎ ప్రభుత్వం వీటిలోకి 26 శాతం ప్రైవేట్ పెట్టుబడులను అనుమతించింది. 2011లో యుపిఎ ప్రభుత్వం 26 శాతం నుంచి 49 శాతానికి పెంచడానికి పూనుకుంది. అయితే యశ్వంత్ సిన్హా అధ్యక్షతన ఏర్పడిన పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ వ్యతిరేకించింది. దీంతో యుపిఎ ప్రతిపాదన వీగిపోయింది. భారత బీమారంగం 2012 నాటికి రు. 4.42 లక్షల కోట్లు విలువ కలిగి ఉంది. ఇది 2020 నాటికి రు.15 లక్షల కోట్లకు చేరుకోవచ్చని ఒక అంచనా. మనదేశంలో ఇన్సూరెన్స్ రంగం పెరుగుదల విదేశీ కార్పొరేట్ సంస్థలను ఊరిస్తుంది. మార్కెట్లను కొల్లగొట్టుకు పోవాలని యోచిస్తున్నాయి. అటువంటి కంపెనీలు మన జాతి ప్రయోజనం కోసం ఎలా పనిచేస్తాయి? ఇంత భారీ మార్కెట్‌ను ఆక్రమించుకోవడం కోసం విదేశీ ద్రవ్య సంస్థలు గోతికాడి నక్కల్లా కాచుకొని ఉన్నాయి. దేశీయ, విదేశీ ద్రవ్య సంస్థలు ప్రభుత్వ ధోరణికి ప్రశంసలు కురిపించడంలోనే వాటి నైజం తెలుస్తున్నది. ఇన్సూరెన్స్ వ్యాపారానికి పెట్టుబడి అవసరాలు బహుస్వల్పం. ఎల్‌ఐసిని 1956లో కేంద్ర ప్రభుత్వం కేవలం రు.5 కోట్ల పెట్టుబడితో ప్రారంభించింది. పట్టాదారుల సొమ్మును పొదుపు రూపంలో సేకరించిన ఎల్‌ఐసి నేడు రు.16 లక్షల కోట్ల ఆస్తులు కలిగి ఉంది. ఎల్‌ఐసి సేకరించిన పొదుపును దేశంలో ప్రణాళికలకు, సామాజిక రంగానికి, మౌలిక వసతుల అభివృద్ధికి పెట్టుబడిగా అందిస్తోంది. అదే ప్రైవేట్ రంగం చేతిలో పెడితే ఈ సొమ్ము భద్రంగా ఉంటుందని గానీ, దేశానికి పనికొస్తుందని గానీ ఊహించలేం. దేశ ప్రయోజనాలకు వ్యతిరేకంగా, ప్రజలు చేసిన పొదుపును విదేశీ కంపెనీలు దోచుకుపోవడానికి ఈ బిల్లు బాటవేస్తుంది.

భూసేకరణ చట్టం - 2014కు సంబంధించి రాష్ట్రపతి జనవరి 31న 'అత్యవసర ఆదేశం' జారీ చేశారు. నిజానికి భూసేకరణకు సంబంధించిన వివాదం వలసకాలం నుంచి కొనసాగుతుంది. దేశ ప్రయోజనాలని చెప్పి గుడ్డిగా భూసేకరణ జరిపే బ్రిటిష్ కాలం నాటి కాలదోషం పట్టిన 1894 నాటి రైతు వ్యతిరేక భూసేకరణ చట్టం పట్ల ప్రజాక్షేత్రంలో తీవ్రమైన వ్యతిరేకత వచ్చింది. భూ యజమాని ఆమోదం లేకుండా, హేతుబద్ధత లేకుండా, భూమి సేకరించి కార్పొరేట్లవశం చేయడం వల్ల, అక్కడ వచ్చే పరిశ్రమలు, కార్పొరేట్ కార్యకలాపాలు పర్యావరణానికి, పౌరుల జీవన ప్రమాణాలకు ప్రతిబంధకంగా మారడం వల్ల 1947 తదనంతరం ప్రజావ్యతిరేకత పెరుగుతూ వచ్చింది. 1894 నాటి భూసేకరణ చట్టం ఆరు దశాబ్దాలుగా, మరీ ముఖ్యంగా ప్రపంచీకరణ అనంతరం ప్రజానీకంలో కల్లోలం సృష్టించింది. 'ప్రజా ప్రయోజనం' మాటున ఏ భూమినైనా సర్కారు స్వాధీనం చేసుకోవడానికి ఆస్కారం కల్పించిన ఆ చట్టం వల్ల లక్షలాది మంది వీధుల పాలయ్యారు. అధికార మార్పిడి తర్వాత భూసేకరణ వల్ల దాదాపు 6 కోట్ల మంది నిర్వాసితులయ్యారు. వారిలో 20 శాతం మందికి కూడా ఇప్పటి వరకు పునరావాసం దక్కలేదు. ప్రతి భూసేకరణ ఓ యుద్ధ పరిస్థితిని తలపించేది. మానవహక్కుల ఉల్లంఘనగా దాఖలయ్యే పిటిషన్లతో న్యాయ వివాదాలు తలెత్తాయి. ఈ స్థితిని అధిగమించడానికి 1894 భూసేకరణ చట్టానికి చట్ట సవరణ అవసరమైంది. బతుకునిచ్చే పంట భూమితో తమకున్న పేగుబంధాన్ని తెంచే దుష్ట పోకడలపై సింగూరు, నందిగ్రామ్, భట్టాపర్సాల్ వంటి చోట్ల రైతులు తిరగబడ్డారు. ఒడిశాలో పోస్కో కర్మాగారం కోసం భూములు స్వాధీనం చేసుకునే ప్రయత్నం జరిగినప్పుడల్లా అక్కడి ఆదివాసులు, రైతాంగం తీవ్రంగా ప్రతిఘటించింది. ఈ ఉదంతాలన్నిటా పోలీసు కాల్పుల్లో పదులకొద్దీ మంది మరణించారు. వేలాది మంది జైళ్లపాలయ్యారు. ఇంత జరిగాక రైతుల కడుపు కొడుతున్న పాత చట్టాన్ని మార్చాల్సిందేనని సర్వోన్నత న్యాయస్థానం 2007లో తీర్పు చెప్పింది.

సుప్రీంకోర్టు తీర్పు వచ్చాకా దాదాపు ఆరేళ్ల సుదీర్ఘ జాప్యం తర్వాత ఎన్నో శషభిషల తర్వాత 2013 చివరిలో కొత్త చట్టం పురుడుపోసుకుంది. సెజ్‌లు, రియల్ ఎస్టేట్ ప్రాజెక్టులకు ప్రభుత్వాలు నిరంకుశంగా, ఏకపక్షంగా భూమి సేకరిస్తూ లక్షలాది మంది రైతులను బజారుపాల్జేసిన నేపథ్యంలో, భూసేకరణను 'మానవీయ, భాగస్వామ్య, బాహాట,

పారదర్శక' క్రమంలోకి తేవడం ధ్యేయంగా కొత్త 'పునరావాసం, పునస్థిరీకరణ, నష్టపరిహారం' చట్టం వచ్చింది. ఆ చట్టం పేరే 'భూసేకరణలో సబబైన పరిహారం', పారదర్శకత కొరకు, పునరావాసం, పునఃస్థాపన కొరకు హక్కు చట్టం – 2013'. భూమి కోల్పోతున్న వారికి సరైన పునరావాసం, పునఃస్థిరీకరణ, తగు నష్టపరిహారం ఇప్పించే అంశాలతో 2013 చట్టం వచ్చింది. ఈ చట్టం 2014 జనవరి నుంచి అమలులోకి రావల్సి ఉంది. ఈ చట్టం ఆషామాషీగా రాలేదు. రెండేళ్ల పాటు దేశవ్యాప్తంగా చర్చ జరిగింది. రెండు సార్లు అఖిలపక్ష సమావేశాలు, రెండు పార్లమెంటు స్టాండింగ్ కమిటీల వడపోత తర్వాత ఉభయ సభల్లో చర్చ అనంతరం సదరు బిల్లు పలు సవరణలతో ఆమోదం పొంది చట్ట రూపు సంతరించుకుంది. సేకరించే భూమికి మార్కెట్ విలువ కన్నా పట్టణ ప్రాంతాల్లో రెండు రెట్లు, గ్రామీణ ప్రాంతాల్లో నాలుగురెట్లు చెల్లించాలని, పునరావాసాన్ని, పునఃస్థాపన ప్యాకేజి ముందే అమలు చేయాలని, పారిశ్రామిక ప్రాజెక్టులకైతే భూమి కోల్పోయిన కుటుంబంలో ఒకరికి ఉద్యోగం ఇవ్వాలని కూడా ఆ చట్టం చెప్పింది. భూ యజమానుల అనుమతి, అవసరాల్ని సరిగ్గా అంచనా వేయడం, భూములు కోల్పోయే వారిపై ప్రభావం – సామాజిక ప్రభావాల్ని అంచనా వేయడం (ఎస్.ఐ.ఎ.) వంటివి తప్పనిసరిగా చేస్తూ చట్టం తీసుకు వచ్చింది. భూమి కోల్పోతున్న వారిలో కనీసం 80–70 శాతం మంది ఆమోదం తర్వాతే భూసేకరణ జరపాలని, ఆ ప్రాంతంలో సామాజిక ప్రభావాన్ని అంచనా వేయాలని, బాధితులకు తగు నష్టపరిహారం ఇవ్వాలని, ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాలు కల్పించాలని, అభివృద్ధి చేసిన భూమిలో వాటా కల్పించాలని, మూడు పంటల భూముల్ని ముట్టుకోవద్దని... ఇలా చాలా అంశాల్ని 2013 చట్టంలో పొందుపరిచారు. భూ భద్రతకు ఇది భరోసా కల్పించింది.

భూసేకరణ చట్టం విషయంలో బిజెపి యూటర్న్ ఎందుకు తీసుకుంది? – కార్పొరేట్ పెట్టుబడిదార్ల, పారిశ్రామికవేత్తల ఒత్తిళ్లకు కేంద్రం లొంగిందా? రైతన్నలకున్న రాజ్యాంగ హక్కును ఎందుకు కాలరాస్తున్నది. భూసేకరణ అంటే భూస్వాధీన చట్టమా? రైతుల భూములపై అధికారాన్ని కేంద్రం ఎలా తీసుకుంటుంది? 2013లో యుపిఎ ప్రభుత్వ భూసేకరణ చట్టాన్ని ఆమోదించింది బిజెపి సమ్మతితోనే కదా? అభివృద్ధి పేరుతో రైతాంగాన్ని దెబ్బతీయడం కాదా? అంటే వీటికి అవును అనే సమాధానం వస్తుంది. సంస్కరణల జోరుమీదున్న మోడీ ప్రభుత్వం ఏకంగా 2013 భూసేకరణ చట్టంలోని రక్షణలను ఎత్తివేస్తూ రైతుల, భూ యజమానుల వ్యతిరేక నిర్ణయం తీసుకుంది. 2013 చట్టం వల్ల భూసేకరణే కష్టమైందని, ప్రాజెక్టుల నిర్మాణం, అభివృద్ధి కార్యక్రమాల అమలు నిలిచిపోయిందని ప్రస్తుత ప్రభుత్వం అభిప్రాయం. చట్టాన్ని సవరించకపోతే అభివృద్ధి ప్రాజెక్టులు అడుగు ముందుకు సాగవని పారిశ్రామిక వర్గాలు కూడా ముఖ్యమంత్రులపై ఒత్తిడి తేవడంతో వారు వత్తాసు పలికారు. అధికారంలోకి వచ్చిన ఆరు మాసాల్లో ఈ వాదనను బలోపేతం చేసి, సదరు చట్టాన్ని వీలైనంతగా తూట్లు పొడిచే యోచన ఈ ప్రభుత్వ పెద్దలు ప్రారంభించారు. పర్యవసానమే ప్రస్తుత ఆర్డినెన్స్. హర్యానా, మహారాష్ట్ర, జార్ఖండ్, జమ్మూ – కశ్మీర్ శాసనసభ ఎన్నికలు ముగియడంతో కేంద్ర మంత్రివర్గం ఇప్పుడీ ఆర్డినెన్స్ నిర్ణయం తీసుకుంది. రాష్ట్రపతి డిసెంబర్ 29న ఆమోదముద్ర వేశారు.

పారిశ్రామిక కారిడార్లు, ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్య ప్రాజెక్టులు, గ్రామీణ మౌలిక సౌకర్యాలు, చౌక గృహాలు, రక్షణ వంటి అవసరాల కోసం భూసేకరణలో పాటించాల్సిన రైతు, భూ యాజమాని అంగీకారం అనే నిబంధన తొలగింపే మొదటి సవరణ. బహుళ పంటలు పండే పొలాలను కూడా పై సామాజిక అవసరాల కోసం రైతుల అనుమతి, అంగీకారంతో ప్రమేయం లేకుండా సేకరించే అధికారాలను ఈ సవరణ కల్పించింది. జాతీయ భద్రత, రక్షణ విభాగం, గ్రామీణ మౌలిక సదుపాయాలు పారిశ్రామిక కారిడార్లు, ప్రభుత్వ – ప్రైవేట్ భాగస్వామ్యం సహా సామాజిక మౌలిక సౌకర్యాల నిర్మాణం వంటి ఐదు లక్ష్యాల కోసం భూమిని సేకరించేటప్పుడు తప్పనిసరి అంగీకార నిబంధనను తొలగించారు. సామాజిక ప్రభావ మదింపు నిబంధనలను తొలగించడం రెండవ ప్రధాన సవరణ. ఈ నిబంధననూ వదిలేయమంటే, సేకరించిన భూమి ఇతర అవసరాలకు తరలిపోవడానికి మార్గం సుగమం చేయడం. సమాజాభివృద్ధి, ప్రజా ప్రయోజనాల పేరిట భూమిని లాక్కున్న తరువాత అనతికాలంలోనే అది ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోకి పోవడానికి వీలు కల్పిస్తుంది. దీనితో పాటు అవసరాన్ని మించి భూమిని అవలీలగా లాక్కుని, దానిని ప్రజావసరానికి కాక, కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలకో, రియల్ ఎస్టేట్ అవసరాలకో సులభంగా తరలించడానికి ఈ మార్పులు దోహద పడుతాయనుటలో సందేహం లేదు. ఈ చట్ట సవరణ ప్రకారం ప్రభుత్వ – ప్రైవేట్ కంపెనీల కోసం జరిపే భూసేకరణలో అదివరకున్న 70 శాతం అంగీకారం, ప్రైవేట్ ప్రాజెక్టుల విషయంలో 80 శాతం మంది రైతుల అంగీకారం విధిగా కావాలన్న నిబంధనను ఎత్తివేశారు. కొత్త సవరణ ప్రకారం రైతుల అభిప్రాయంతో నిమిత్తం లేదు. అయితే భూసేకరణలో నష్టపరిహారం, పునరావాసం, రీసెటిల్మెంట్ నిబంధనలు యథావిధిగా అమలు అవుతాయని చట్ట సవరణలో పేర్కొనడం ఒక పరిహాసం.

2013 భూసేకరణ చట్టం నుంచి మినహాయించబడిన 13 చట్టాలను నూతన భూసేకరణ పరిధిలోకి తెచ్చేందుకు భూసేకరణ చట్టం – 2013 సెక్షన్ 105ను సవరించింది. ఈ 13 చట్టాలను నాలుగో షెడ్యూలులో పేర్కొంది. అవి ఏమిటంటే – పురావస్తు ప్రాధాన్య ప్రదేశాల పరిరక్షణ చట్టం – 1958, అణు విద్యుత్ చట్టం – 1962, దామోదర్ వ్యాలీ కార్పొరేషన్ చట్టం – 1948, ఇండియన్ ట్రామ్ వేస్ చట్టం 1996, భూసేకరణ చట్టం – 1894, మెట్రో రైల్వేస్ చట్టం– 1978, జాతీయ రహదారుల చట్టం – 1956, పెట్రోలియం మినరల్స్ పైప్‌లైన్ల చట్టం – 1962, స్థిరాస్తి పరిరక్షణ చట్టం – 1948, బొగ్గు గనుల పరిరక్షణ చట్టం – 1967, విద్యుత్ చట్టం – 2003, రైల్వేల చట్టం – 1989. ఇది వరకు భూసేకరణ చట్ట పరిధి నుండి మినహాయింపు పొందిన ఈ 13 చట్టాలను ఇప్పుడు చట్ట పరిధిలోకి తెచ్చారు. మొత్తంగా చూస్తే యుపిఎ అమలు చేయడానికి సాహసించలేని అనేక అంశాలూ ఎన్‌డిఎ ఆర్డినెన్స్‌లో కనిపిస్తున్నాయి. మొత్తం మీద యుపిఎ, ఎన్‌డిఎ కూటముల లక్ష్యం ఒక్కటే – దేశ, విదేశీ గుత్త పెట్టుబడులను భారీ స్థాయిలో వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలోకి దించి, శాసించి, రైతాంగ, వ్యవసాయ కూలీల, పారిశ్రామిక కార్మికుల జీవనాన్ని ఛిద్రం చేయడమే. రైతాంగాన్ని కూలీలుగా మార్చి, వ్యవసాయ కార్మికుల్ని పంట పొలాలపై ఆధారపడకుండా పట్టణాలకు వలస పోయే దుస్థితిని కల్పించనుంది.

ఇది 1894 నాటి వలసపాలనా చట్టాన్ని తిరగరాయడంగా అంటే 1894 నాటి బ్రిటిష్ వలసవాదులు చట్టాన్నే అమలు చేయడమన్నమాట.

ఈ ఆర్డినెన్స్ ద్వారా జరిగే చట్ట సవరణ అనంతరం భూసేకరణకు పంచాయతీ, గ్రామసభల అనుమతి కూడా అవసరం ఉండదు. ఇది 73, 74 వ రాజ్యాంగ, సవరణల స్ఫూర్తికి పూర్తి విరుద్ధం. తాము కేవలం భూసేకరణకున్న అవరోధాలు తొలగిస్తున్నామంటున్న ప్రభుత్వ పెద్దలు 'మేం చట్టంలో ఉన్న పరిహార, పునరావాస, పునః స్థిరీకరణ వ్యవహారాల జోలికి వెళ్లడం లేదు' అంటున్నారు. కానీ, ఇది నిజం కాదు. భూములు కోల్పోయేవారి ఆమోదం అవసరం లేకుండా, ప్రభావాల అంచనాలు లేకుండా, షరతులు వర్తింపజేయకుండా సేకరించే ఏకపక్ష హక్కును ప్రభుత్వాలకు కల్పించడం వల్ల భూములు కోల్పోయే వారు, సహజంగానే తమ 'బేరమాడే శక్తి'ని కూడా కోల్పోతారు. అప్పుడు వారికి దక్కేది తృణమో! పణమో! అభివృద్ధిపరచిన భూమిలో వాటా కూడా దక్కే అవకాశాలు లేవు. రైతులకు, సాధారణ పౌరులకు ఇంకా చాలా ప్రత్యక్ష, పరోక్ష నష్టాలకు ఆస్కారముంది.

పిపిపి ప్రాజెక్టుల నిమిత్తం పెక్కు పంటల మాగాణి భూములను కూడా సేకరించవచ్చని ఇప్పుడు మోడీ ప్రభుత్వం తెచ్చిన సవరణల్లో ఉంది. ఐదు రంగాల్లో – జాతీయ భద్రత, రక్షణ, గ్రామీణ మౌలిక వసతులు, విద్యుద్దీకరణ పేదలకు గృహాలు, పారిశ్రామిక కారిడార్‌ల అభివృద్ధి, పిపిపి ప్రాజెక్టులు సహా మౌలిక వసతులు, సామాజిక మౌలిక వసతులకు భూసేకరణను ఏకపక్షం చేస్తాయి. ఈ సవరణలను 'ఆర్థిక సంస్కరణపట్ల ప్రభుత్వం తీవ్రమైన నిబద్ధతకు సంకేతం'గా పారిశ్రామిక వేత్తల సంఘాల్లో ఒకటైన కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (సిఐఐ) స్వాగతించింది. అయితే ఆర్డినెన్స్ జారీ చేయడానికి ఒకరోజు ముందు ఆర్‌ఎస్‌ఎస్ ఆర్థిక విభాగమైన స్వదేశీ జాగరణ్ మంచ్ (ఎస్‌జెఎం) కేంద్ర తాజా ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా గళమెత్తడం కొసమెరుపు.

2013 చట్టంలో భూములు కోల్పోయే వారిపై ప్రభావాలు, సామాజిక ప్రభావాల అంచనా వల్ల బహుళ ప్రయోజనాలుండేవి. అది పౌర సమాజం పోరాడి సాధించుకున్న హక్కు. అది లేకపోతే సమాజానికి అరిష్టాలు తప్పవు. 1. ఏ అవసరానికి ఎంత భూమి సేకరిస్తారన్న హేతుబద్ధత లేకుండా పోయి, ఆయా ప్రాజెక్టులకు వాడగా మిగిలింది ఇతరేతర అవసరాలకు వాడి వినియోగ సమతూకం చెడగొట్టే ప్రమాదం ఉంది. 2. లెక్కకు మించి భూసేకరణ జరిపి ప్రైవేట్, వ్యాపార శక్తుల పరం చేయడంవల్ల సామాన్యుల జీవనం దుర్భరమవుతుంది. 3. అభివృద్ధి పేరుతో సహజవనరుల్ని నిర్హేతుకంగా కొల్లగొట్టే రకరకాల పరిశ్రమలు, ఉత్పత్తి కేంద్రాలు, కారిడార్లు వచ్చే ఆస్కారం ఉంటుంది. 4. ప్రజలపై చూపే దుష్ప్రభావాల్ని లెక్క చేయకుండా పర్యావరణ సమతూకానికి భంగం కలిగించే సంస్థల ఏర్పాటు చేసే ప్రమాదం ఉంటుంది. 5. ఏడాదికి మూడు పంటలిచ్చే భూముల్ని కూడా పెద్ద మొత్తాల్లో సేకరించడం వల్ల ఆహార ఉత్పత్తిపైనా ప్రతికూల ప్రభావం పడుతుంది. వీటన్నింటికన్నా ముఖ్యమైంది భూ యజమానుల మౌలిక హక్కు. దానికి తీవ్రమైన భంగం కలుగుతుంది.

గ్రామాల్లో భూములు కోల్పోయే వారికిచ్చే పరిహారాన్ని మార్కెట్ విలువపై నాలుగు రెట్లు, పట్టణాల్లో భూమి సేకరించినప్పుడు మార్కెట్ విలువపై రెండు రెట్లు ఇస్తామన్న నిబంధన అస్పష్టంగా ఉన్నదన్న విమర్శలున్నాయి. 2013 భూసేకరణ చట్టం 'నష్ట పరిహారం, ప్రజా ప్రయోజనం' అనే అంశాలను నిర్దిష్టంగా వివరించలేదు. ఆ పదానికిచ్చే నిర్వచనంలో స్పష్టత లోపించింది. నిజంగా రైతుల మేలుకోరి సవరణలు ఏమైనా తీసుకురాదలిస్తే ఇలాంటి అంశాలపై దృష్టి సారించాలి. ఇంత కీలకమైన అంశంపై పార్లమెంటులో ఎలాంటి చర్చకూ తావీయకుండా ఆర్డినెన్స్ తీసుకురాబూనడం మరింత దారుణం. ఎందుకింత తొందర? ఇంతలోనే ఆర్డినెన్స్ తీసుకొచ్చి సాధించ దలుచుకున్న ప్రయోజనం ఏమిటి? భూమిని కేవలం మట్టిగా, ఆస్తిగా మాత్రమే పరిగణిస్తే... అది ప్రజల భావోద్వేగాలతో, వారి సంస్కృతీ, సంప్రదాయాలతో చెలగాటం ఆడడమే అవుతుంది. రైతుకూ, పొలానికీ మధ్య ఉండే అనుబంధాన్ని విస్మరిస్తే ఇలాంటి ఆర్డినెన్స్‌లే పుట్టుకొస్తాయి.

రైతులకు ముందుగానే తగిన చట్టబద్ధమైన భద్రతతో భరోసా కల్పించకుంటే భూములు కోల్పోయే నిర్వాసితుల దుస్థితి ఎప్పుడైనా ఇలాగే ఉంటుంది. రాజధాని పేరిట భూ సేకరణ కోసం ఆంధ్రప్రదేశ్‌లో, ప్రాజెక్టులకు భూసేకరణ కోసం తెలంగాణలోనే కాదు, దేశంలోని అత్యధిక రాష్ట్రాల్లోని అధినేతలు ఈ ఆర్డినెన్స్ కోసం కాచుకుని కూర్చున్నారు. సర్కారు అండతో అప్పనంగా భూములు కాజేయజూస్తున్న కార్పొరేట్ శక్తుల ఆయుధమే కాదు, రైతుల హక్కులపై ఉక్కుపాదం ఈ ఆర్డినెన్స్. రైతుల ప్రయోజనాలకే ఇదంతా... వారికి మరింత మెరుగైన పరిహారం, పునరావాసం కల్పించడమే తమ ధ్యేయమంటున్న ఎన్‌డిఎ సర్కారువన్నీ ఊకదంపుడు మాటలేనని ఆర్డినెన్స్‌లోని నిబంధనలు చూస్తే అర్థమవుతుంది. 'అచ్ఛే దిన్' ఆశలు కల్పించి అందలమెక్కినవారు చివరకు కార్పొరేట్ ప్రపంచానికి వాటిని కొత్త సంవత్సర కానుకగా అందజేయ బోతున్నారు.

ప్రాజెక్టుల కోసం పారిశ్రామిక కారిడార్ల కోసం పెద్ద ఎత్తున భూమిని లాక్కుంటున్నప్పుడు సాధ్యమైనంత వరకూ ఇరుపక్షాలకూ న్యాయం చేయవల్సిన చట్టం ఒకరిని నట్టేటముంచుతున్నప్పుడు ఘర్షణ మరింత తీవ్రమవుతుంది, పని సునాయాసంగా జరిగిపోదు. ఢిల్లీ ముంబై పారిశ్రామిక కారిడార్ ఒక్కదానికే నాలుగు లక్షల హెక్టార్ల భూమి అవసరం ఉన్నది. భారీ కారిడార్లు, మౌలిక వసతుల ప్రాజెక్టులు, డ్యాములు వంటివి పర్యావరణాన్ని నాశనం చేయడంతో పాటు, అత్యధిక సంఖ్యాకులను నిరాశ్రయులను చేయక తప్పదు. అనేక ఏళ్లుగా పోరాటాలతో సాధించుకున్న హక్కులను అవలీలగా పెరికి అవతల పారేసి, కోట్లాది మంది రైతుల జీవితాలతో ముడిపడిన అంశాలన్నింటినీ ప్రజాస్వామ్యబద్ధమైన చర్చ ద్వారా నిర్ణయించవలసింది పోయి ఒకే ఒక్క ఆర్డినెన్స్ ద్వారా కాలరాయడం సముచితం కాదు. దేశంలోని భూమంతటికీ రాజ్యమే అసలు యజమానని... పట్టాలున్నా, మరే ఇతర కాగితాలున్నా దాని ముందు చెల్లుబాటుకావన్న వలస పాలకుల నాటి భావనకు ఈ ఆర్డినెన్స్ ప్రాణ ప్రతిష్ఠ చేస్తున్నది. ఈ చర్యలు వలస నుండి పునర్ వలసకు బాటలు వేస్తున్నాయి. అందువలన ఎన్‌డిఎ సర్కారు ప్రజాగ్రహాన్ని చవిచూడకముందే తన తప్పిదాన్ని గ్రహించి ఈ ఆర్డినెన్స్‌ను విరమించుకుంటే జనం హర్షిస్తారు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# మోడీ 'మన్ కీ బాత్'పై బహిరంగ లేఖ

***ప్రజలకు చేరడానికి ఆకాశవాణి ద్వారా ప్రధాని నరేంద్రమోడీ నిర్వహిస్తున్న 'మన్ కీ బాత్' కార్యక్రమాన్ని ఉద్దేశించి బహిరంగ లేఖ రాస్తున్నారు* నటాషా**

శ్రీ గౌరవనీయులైన ప్రధాన సేవకుడు నరేంద్రదామోదర మోడీకి, నమస్తే!

అయ్యా! ఆల్ ఇండియా రేడియోలో మీ 'మన్ కీ బాత్' ప్రోగ్రాం విన్నాక ఈ ఉత్తరం రాయాలనిపించింది. మరీ ముఖ్యంగా 'తప్పకుండా ఉత్తరం రాయండి. మీరు రాసే సూచనల్ని గంభీరంగా తీసుకుంటాను. నా మనుసు లోని మాటతో మీ మనుసు లోని మాట జోడించబడాలి' అని మీరు పదేపదే చేసే ప్రకటన విన్నాక తప్పకుండా రాయాలని పించింది. అయితే మీకు వచ్చే వందలాది ఉత్తరాల్లో దీన్ని చూడకుండానే ఎక్కడ చెత్తబుట్టలో పడేస్తారేమోననే అనుమానంతో నీకు పోస్టు చేయకుండా తప్పకుండా వేసుకుంటారనే బరోసా కలిగిన ఓ పత్రిక ద్వారా నా మనుసులోని మాట తెలియజేస్తున్నాను. ఇది మీ మనుసులోని మాటతో జత కలుస్తుందో లేదో అనుమానమే కానీ నా బోటి పాఠకుల మనుసుతో మాత్రం తప్పక జత కలుస్తుంది. ఆకాశవాణిని మీ బావజాల ప్రచారానికి ఒక మంచి సాధనంగా ఉపయోగించుకోవడం లోని మీ తెలివి తేటలకు మొదట దన్యవాదాలు చెప్పాలి. ఏ చిన్న అవకాశాన్ని జార విడుచుకోని మీ చాతుర్యానికి ఇదొక ఉదహరణ . కార్పోరేట్ మీడియా అంతా హరహర మోడీ అని ఇరవై నాలుగు గంటలు నీ జపం చేస్తుంటే టీవీలు లేని మాబోటి పేదలం ఆ గోల బారిన పడకుండా హాయిగా వున్నాం. అలాంటి మమ్మల్ని రేడియో ద్వారా మీ మైకం లోకి వల విసరడాన్ని మెచ్చుకోకుండా ఎలా వుండగలం.

మీరు ఎంతటి సున్నిత మనస్కులో, ఎంతటి బావుకులో గుజరాత్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు పెద్దగా తెలియదు గానీ దేశానికి ప్రధాని అయినప్పటి నుండి బాగానే చూస్తున్నాం. నవరసాల్ని ముఖంపై తొణికిసలాడించగల నటసార్వభౌములు మీరు. కడుపులో విషమున్నా కండ్లల్లో కారుణ్యం ప్రదర్శించ గల దిట్టలు. పట్టపగలే పగటి కలలు కనగలరు. ఇతరుల్ని కలల్లో ముంచెత్తి ఆ తర్వాత నిర్దాక్షిణ్యంగా నట్టేట్లో ముంచేయగల సమర్థులు. ఆగస్టు పదిహేను స్వాహాతంత్ర్య దినోత్సవం నాడు ఎర్రకోట బురుజులపై మువ్వన్నెల జెండాను ఎగరేసి దేశ ప్రజలను ఉద్దేశించి మీరిచ్చిన ఉపన్యాసం ప్రారంభంలోని మాటలు వినడంతోనే మాబోటి మద్యతరగతి జీవులం ఎంతో పులకించి పోయాం. 'ప్రధాన మంత్రిగా కాదు. ప్రధాన సేవకునిగా మాట్లాడుతున్నాను' అనగానే మేం నిజంగానే మాకు సేవ చేస్తావేమో అని తెగ మురిసిపోయాం. కానీ మా సంబరం మీ ఉపన్యాసం ముగిసే సరికి తుస్సుమని దిగి పోయింది. ఎర్రకోట బురుజులు సిగ్గుతో తల దించుకునేలా ఢిల్లీ గద్దె సాక్షిగా ప్రపంచ ఘరానా దోపిడీ దారులందరినీ "మేక్ ఇన్ ఇండియా . మేడ్ ఇన్ ఇండియా" అని బహిరంగంగా ఆహ్వానించగల గుండె ధైర్యం నీది. మీ పిలుపులోని అర్థం "లూట్ ఇన్ ఇండియా" అనే కదా, మాదేశం మా ప్రజలు అగ్గువగున్నారు. మీకు చేతనైనంతా దోచుకొమ్మనే కదా. ఆ మాత్రం అర్థం చేసుకోలేనంత మట్టి బుర్రలు కావులెండి మావి. గతంలో మన తాత, ముత్తాతలు ఒక్క ఈస్ట్ ఇండియా కంపెని వానికి అనుమతి ఇచ్చిన పాపానికే రెండొందల ఏండ్లు బానిసలుగా బతకాల్సి వచ్చింది. ఇటేటు రమ్మంటే ఇల్లంతా నాదే అనే రకాలు సామ్రాజ్యవాదులు అనే సంగతి మనకు తెలిసిందేనాయే. ఇప్పుడు ప్రపంచ ఘరానా దోపిడీ కంపెనీలన్నింటినీ మీరు బహిరంగంగా ఆహ్వానిస్తున్న పుణ్యానికి భావితరాలు శాశ్వతంగా బానిసలుగా బతకాల్సిన పరిస్థితి రాబోతున్నది. నిన్నటి దాకా నువ్వు, మీ భారత్ స్వాభిమాన్ మంచ్ సర్వ సేనాని బాబారాందేవ్‌లు చేసిన స్వదేశీ జపాన్ని ఏ అటకెక్కించావ్? ఇప్పుడు విదేశీ జపాన్నీ ఆలపిస్తున్నావ్? నీది కొంగ జపం అనే సంగతి మాత్రం మాకు అర్థమై పోయిందిలే.

మంచి రోజులొస్తయంటే మాకే అనుకుని ఆశపడ్డాం. అది అడియాశే అనే సంగతి అర్థం కావడానికి ఎక్కువ కాలం పట్టలేదు. నిత్యావసర ధరలూ తగ్గలేదు. అవినీతి ఆగలేదు. ఎన్ని లొసుగులున్నా ఎంతో కొంత ఉపాధి దొరికే మన్ రేగా పథకాన్ని కుదించాలంటున్నావ్ . దశాబ్దాలుగా పోరాడి కార్మికులు సాదించుకున్న శ్రామిక చట్టాల్లో సవరణల పేరుతో శ్రామికుల హక్కుల్ని హరించి వేస్తూ పెట్టుబడిదారులకు మేలు చేసే క్లాజుల్ని ప్రవేశపెట్టావ్. ఇదంతా "శ్రమేయవజయతే" అనే జపం కిందనే చలామణి చెయ్యడం మీ మాయల పకీరు తనానికే నిదర్శనం. విదేశీ పట్టుబడి దారుల్ని ఎర్ర తివాచీలు పరిచి స్వాగతిస్తున్నావ్. పి. వి. నర్సింహారావు నుండి మన్ మోహన్ సంగ్ వరకు నూతన ఆర్థిక విధానాల పేరుతో సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ పాలసీల ద్వారా బహు రాష్ట్రీయ కంపెనీల దోపిడీకి తలుపులూ కిటికీలూ తెరిస్తే మీరేమో ఈ గోడలు కూడా అడ్డు ఎందుకనీ ఏకంగా వాటిని కూడా కూల్చేసి గోడలు కూడా లేని ఇల్లుగా మార్చేస్తున్నావ్. ఏం చేసినా నీ రుణం తీర్చుకోలేనంతగా మేలు చేస్తున్నారు గనుకనే కార్పోరేట్ జగమంతా నిన్ను ఇంద్రుడూ, చంద్రుడూ అని ఆకాశానికి ఎత్తి పడుతూ హరహర మోడీ జపం చేస్తున్నారు. నువ్వు ఎవ్వరి ప్రధాన సేవకుడివో? ఎవరికి మంచి రోజులొచ్చాయో? గుర్రం- మైదానంలా స్పష్టంగా అర్థమవుతూనే వుంది. సెక్యులర్ రాజ్యాంగం మీద ప్రమాణం చేసి దేశాన్ని హిందూ రాజ్యంగా మార్చాలనుకుంటున్నావ్. విద్యను శాస్త్రీయం చేయడానికి బదులు కాశాయీకరించ బోతున్నావ్. ఇవే మా మంచి రోజులని నమ్మమంటున్నావ్.

చిన్న విషయాలకే చివుక్కుమనే మీ మనుసు పెద్ద విషయాలపై మిన్నకుంటుంది ఎందుకు?నాకు అర్థంగాక కొన్ని ప్రశ్నలడుగుతాను. కోపం తెచ్చుకోకుండా జవాబు చెప్తావా? మేము రోజూ దొడ్డికి పోయే మలం వంద గ్రాములుంటుందో లేదో! దానితోనే దేశమంతా అపవిత్రమై పోయినంత తెగ బాధపడి పోతున్నావ్. మరుగు దొడ్లు నిర్మించుకోక పోతే ఉద్యోగాలు ఊడబీకేస్తాననీ బెదిరిస్తున్నావ్. మరి నువ్వు మేక్ ఇన్ ఇండియా మేడ్ ఇన్ ఇండియా అని ఆహ్వానిస్తున్న కార్పోరేట్ కంపెనీలు రోజూ టన్నుల కొద్ది విసర్జించే విషపూరితమైన వ్యర్థ పదార్థాల మాటేమిటి? విషవాయువులు, రసాయనాలతో జల,వాయు కాలుష్యం మూలంగా రోగాల బారిన పడుతున్న ప్రజల సంగతేమిటి?గ్రీన్ హౌజ్ వాయువుల వల్ల దెబ్బ తింటున్న పర్యావలణం సంగతేమిటి? డ్రగ్స్ వాడకం గురించి మీ ఆవేదన అర్థం చేసుకోదగినదే. మిమ్మల్ని గెలిపించడం వెనకాల డ్రగ్స్ మాఫియాల హస్తం ఎంత మాత్రం లేదని గుండె మీద చేయి వేసుకుని చెప్పగలవా?

మా దగ్గర సారా రాజులదే రాజ్యం. మా పేదోళ్లుపొద్దంతా కష్టంజేసి సంపాదించిన కూలీ డబ్బులు సామ్రాజుల బొక్కసాల్లో కుప్పలు పడుతున్నాయి. మద్యపానం నిషేదించమని మా మహిళలూ మేమూ పోరాడితే మీ పోలీసులు మమ్మల్నే బొక్కలో తోసి కేసులు పెడుతున్నరాయే. కాస్త మీరైనా నిషేదించి పుణ్యం కట్టుకోండి బాబూ. సారా రాజులంతా మీ ఎన్నికల పెట్టుబడి దారులేనాయే. ఎన్నికలప్పుడు మద్యం ఏరులు పారించకుండా మీ జోలెలో ఓట్లు పడవాయే. అలాంటపుడు మీరు మద్యపానం నిషేదించగలరంటారా?

మహిళలపై అత్యాచారాలు పెరిగి పోవడంపై ఆందోళన వ్యక్తం చేస్తూ మగ పిల్లల పెంపకంలో తల్లిదండ్రుల లోపాన్నే దోషంగా సెలవిచ్చారు. ఇప్పటి దాకా ఎక్కడ తిరిగొచ్చారనీ మగ పిల్లల్ని అడిగే ధైర్యం ఎప్పుడైనా చేశారా? అనీ బాగా ప్రశ్నించారు. సరే. కానీ పిల్లలు బాల్యం నుండి యవ్వనం వరకూ బుద్ధి వికాసం చెందే కాలమంతా ఎక్కువ సమయం పాఠశాలలో మరియు సమాజం సంపర్కంలో గడుపుతారు. ఈనాడున్న విద్యా విధానం పిల్లలకు ఏ విలువల్ని నేర్పుతున్నది? సమాజంలో పెచ్చరిల్లి పోతున్న సామ్రాజ్యవాద విశృంఖల సంస్కృతికి ఎవరు బాధ్యులు? ప్రసార మాధ్యమాలన్నీ ఇరవై నాలుగు గంటలూ మహిళల్ని మనుష్యులుగా కాకుండా మగవాడి కోర్కెలు తీర్చే వినియోగ సరుకులుగా ప్రచారం చేస్తూ నగ్నంగా ,అర్థ నగ్నంగా చూపిస్తూ బుర్రల్ని విషమయం చేస్తుంటే దేశంలో అత్యాచారాలు పెరగకుండా ఎలా ఉంటాయ్?వీటిని అరికట్టడంలో ప్రధాన సేవకుడిగా మీ బాధ్యత ఏమి లేదా?

ప్రపంచ పెట్టుబడి దారుల విశ్వాసం చూరగొనడానికి, వాళ్లపెట్టుబడుల్ని ఆకర్షించడానికి ముందు తరాల వాళ్లుదేశ ఆర్థిక వ్యవస్థ రక్షణ కోసం రూపొందించిన కొన్ని నిబంధనలు,కట్టడులను తొలగించి దేశాన్ని కంచె లేని చేనులా మార్చేస్తున్నావ్. వాళ్ల పెట్టుబడులకు ఏ చిన్న ఆటంకం ఉన్నా మీకు చాలా బాధ కల్గుతున్నది. మరి వాళ్లు స్థాపిస్తున్న ఖదాన్ల వల్ల, భారీ ప్రాజెక్టుల వల్ల ఉపాధి మాట దేవుడెరుగు లక్షలాది పేద, ఆదివాసి, దళిత ప్రజలు తమ బతుకుదెరువు కోల్పోయి బజారు పాలవుతున్నారు. ఈ పెద్ద ప్రాజెక్టులు,ఖదాన్లు వద్దు మొర్రో అని లక్షలాది ప్రజలు ఘోషించినా మీ చెవి మీద పేను పారినట్లు కూడా కాదెందుకు?ఎవరి సమస్యల్ని చూసి మీ మనుసు చలిస్తుందో! ఎలాంటి విషయాలకు మీ హృదయం స్పందిస్తుందో బాగానే అర్థమవుతున్నది.

ఇక విదేశి పెట్టుబడులొస్తే ఉపాధి లభిస్తుందనీ మీరు చెప్పే మాయ మాటలు నమ్మడానికి మేమేమి చెవిలో పూలు పెట్టుకుని లేము. నల్ల తోలు కప్పుకొని తెల్ల భవనంలో కూర్చున్న 'జార్జ్ ఒబామా' తమ దేశంలో హనుమంతుని తోకలా పెరిగి పోతున్న నిరుద్యోగులకే ఉద్యోగాలు చూపించలేనోడు. మన దేశంలో ఏం ఇప్పించగలడు?సబ్ ప్రైమ్ సంక్షోభం నుండి బయటపడలేక తానే గంజిలో ఈగలా కొట్టుకుంటున్నాడు. నల్ల జాతి ప్రజల్ని నిర్దాక్షిణ్యంగా చంపిన తెల్ల పోలీసు అధికారిపై కేసు విచారణకే నిరాకరించే మూర్తీభవించిన వర్ణ వివక్ష గల న్యాయ మూర్తులున్న దేశంలో అధ్యక్ష పీఠంపై తెల్లవాడుంటే నేమి? నల్ల వాడుంటే నేమి? చాయ్ అమ్మే వాడుంటే నేమి? దేశాన్ని అమ్మే వాడుంటే నేమి?వాడి మనుసు,వాడి హృదయం ఎవరి ప్రయోజనాల కోసం స్పందిస్తున్నది?ఎవరి ప్రయోజనాలను శ్వాసిస్తున్నది? అనేది కదా కావాల్సింది.

మీరు నిజంగా మాబోటి వాళ్లప్రధాన సేవకులే అయితే మీలోదేశభక్తి, స్వాభిమానం ఆవగింజంతైనా మిగిలి వుంటే మా కోసం ఇవి చేయగలరేమో ఆలోచించి చూడండి.

1. విదేశి పెట్టుబడిదారులతో చేసుకున్న ఒప్పందాలన్నీ బేషరతుగా రద్దు చేయండి.

2. విదేశీ అప్పులన్నీ రద్దు చేయండి. ఇప్పటిదాక మన దేశాన్ని దోచుకున్న దానితోనే అప్పులన్నీ చెల్లు.

3. దేశంలో విదేశీ కంపేనీలన్నీ స్వాధీనం చేసుకుని ప్రభుత్వపరం చెయ్యండి.

4. జాతీయ పెట్టుబడి దారులకు రాయితీలిచ్చి పరిశ్రమల స్థాపనకై ప్రోత్సహించండి.

5. గ్రామీణ నిరుద్యోగాన్ని పరిష్కరించడానికి ఇప్పటికీ భూస్వాముల, రియల్ ఎస్టేట్ మాఫియాల, దేవాదాయ ట్రస్టుల కింద వున్న లక్షలాది ఎకరాల భూములు ఎలాంటి నష్ట పరిహారం లేకుండా స్వాధీనం చేసుకుని దున్నే వాడికి భూమి ప్రాతిపదికన భూమి లేని పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు పంచాలి.

6. గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయ ఆధారిత పరిశ్రమల్ని స్థాపించాలి.

7. మూతబడ్డ ప్రభుత్వ రంగ పరిశ్రమల్ని తిరిగి ప్రారంభించాలి.

ఇవన్నీ చేయడం మీకేం సాధ్యమవుతుందిలే గానీ ఇప్పటిదాకా మీరు చేస్తున్న పనులన్నీ నల్లేరు మీద బండి నడకలా సాగిపోతున్నందుకు అదంతా నీ సమర్థత వల్లేననీ మురిసిపోకు. ఏ పుట్టలో ఏ పాముందోననీ పామును నమ్మి పాలు పోసే మా ప్రజల అమాయకత్వం, మీ మాయల పకీరు గారడీల్ని అర్థం చేసుకోలేని అసమర్థత మీద నువ్వు రాజ్యం చేస్తున్నావ్. ప్రజలు నిజం తెలుసుకున్న నాడు నీకు పుట్టగతులు కూడా లేకుండా చేయడానికీ ఒక్క క్షణం పట్టదు తస్మాత్ జాగ్రత్త. !

*(రచయిత ఒక ఆకాశవాణి శ్రోత)* వీ

# సామ్రాజ్యవాద స్వచ్ఛ బానిస మోడీ

***గుజరాత్ మారణకాండ తరువాత మోడీని అమెరికాకు అనుమతించని సామ్రాజ్యవాదులు, మోడీ అధికారంలోకి రాగానే ఒబామాను భారత్‌కు ఆహ్వానించడం వెనుక ప్రజల ప్రయోజనం కన్న పెట్టుబడిదారుల ప్రయోజనమే ఉందని అంటున్నారు* సాబిత్**

**2014** ఎన్నికల్లో నరేంద్రమోడీ నాయకత్వంలోని బి.జె.పి (334 సీట్లతో పార్లమెంట్ ఎన్నికల్లో పూర్తిస్థాయి మెజారిటీతో అధికారాన్ని హస్తగతం చేసుకుంది. అప్పటివరకు కొనసాగుతూ వస్తున్న సంకీర్ణ ప్రభుత్వాలకు అడ్డుకట్ట వేస్తూ పూర్తి మెజారిటీతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. 2011 నుండి మూడేళ్లుగా ఒక పథకం ప్రకారం నరేంద్రమోడీని 'వికాసపురుష్'గా 'గుజరాత్ అభివృద్ధి నమూనా'గా ప్రచారం చేస్తూ వచ్చిన కార్పొరేట్ మీడియా, సామ్రాజ్యవాద కంపెనీలు తమ లక్షల కోట్ల పెట్టుబడిని ఒక హిందుత్వ మతోన్మాదైన నరేంద్రమోడీపై పెట్టారు. గుజరాత్‌లో మొత్తం అభివృద్దే ఉందని, కరెంట్‌లేని గ్రామాలు లేవన్నట్లు, చదువుకు దూరంగా పనిచేసుకునే పిల్లలు లేరన్నట్లుగా, పేదరికంలో ప్రజలు లేరన్నట్లు, భూమిలేని కుటుంబమే లేదన్నట్లుగా తమ ప్రచారాన్ని నిర్వహించారు. గుజరాత్ నమూనా ఈ దేశానికే ప్రత్యామ్నాయం అని ప్రచారం చేశారు. దీని ఫలితంగా 'అభివృద్ధి'ని కోరుకునే వారుగా ఉండే విద్యార్థులు, మధ్యతరగతి ప్రజలు ఎన్నుకొనే విధంగా ప్రభావితం చేశారు. మోడీ '3డీ' టెక్నాలజీల పేరుతో సభలకు కోట్లాది రూపాయల ఖర్చు చేశారు. నరేంద్రమోడీ వేషధారణకు ఒక కార్పొరేట్ కంపెనీ రోజుకు 25 లక్షలు ఖర్చుపెట్టింది అంటే మోడీ అవసరం ఆ బహుళజాతి కంపెనీలకు ఎంత ఉందో.

2002 గుజరాత్ మారణకాండ తర్వాత ఇది చాలా దారుణమని మానవ సమాజ చరిత్రలో ఇది మచ్చలాంటి ఘటన అని సామ్రాజ్యవాద కంపెనీలు ప్రకటించాయి. గుజరాత్ నుండి పెట్టుబడులను ఉపసంహరించుకుంటామని కూడా ప్రకటించాయి. అమెరికా తమ దేశానికి మోడీని అనుమతించమని ప్రకటించింది. నేడు అదే అమెరికా మోడీని తమ దేశానికి ఆహ్వానించడం, జనవరి 26న ఒబామా భారత్‌కు అతిథిగా రావడానికి సిద్దమయ్యాడు. అంటే అర్థం చేసుకోవచ్చు సామ్రాజ్యవాదానికి మోడీ అవసరం ఎంత ఉంది అనేది. కాటు వేస్తూ మళ్లీ తనలోనే మిలితం (భాగస్వామ్యం) చేసుకొనే విషసర్పం అయిన హిందూ మతోన్మాదికి, శ్రమను దోచుకుంటూ మనిషిని ఒక సరుకుగా పరాయీకరణకు గురిచేసే అత్యంత దారుణమైన పెట్టుబడిదారీ వ్యవస్థకు అక్రమ పుత్రుడైన మోడీయే తమ దోపిడీ విధానాలను కొనసాగించడానికి అసలు సిసలైన వ్యక్తిగా అవతరించాడు. అచ్చం జర్మనీలోని ఆయుధ తయారీ పెట్టుబడిదారీ కంపెనీలకు హిట్లర్ ఎలాగైతే ఒక గొప్ప నాయకునిగా కనిపించాడో అట్లే నరేంద్రమోడీ సమర్థవంతమైన పాలకుడిగా కనిపించాడు. నరేంద్రమోడీని 'ఎలా ఉన్నారు' అనిఎవరైనా అడిగితే ఎప్పుడూ 'నేను ఆదేశించే స్థితిలోనే ఉన్నాను' అని చెప్తాడంటే అర్థం చేసుకోవచ్చు మోడీ స్వభావంలో ఎంత నియంతృత్వ దోరణి ఉందో, రాముడికి మోడ్రన్ వారసుడిగా ఎలా ఉన్నాడో. మనకు భోదపడుతుంది.

'పెట్టుబడిదారులు పెట్టుబడి పెట్టేది లాభంకోసం మాత్రమే' అన్నట్లు మోడీ మీద పెట్టుబడి పెట్టిన కంపెనీల కూడా కోట్లాది రూపాయల లాభాన్ని చేకూర్చే విధంగా మోడీ తన పాలన కొనసాగిస్తున్నాడు. నరేంద్ర మోడీ ప్రభుత్వం గద్దెనెక్కినప్పటి నుండి తన సామ్రాజ్యవాద అనుకూల, ప్రజావ్యతిరేక విధానాలను నగ్నంగా, నిసిగ్గుగా అమలు చేస్తుంది. మోడీకి 'ప్రజాస్వామ్యం' అనేది నామ మాత్రంగా కూడా పొసగట్లేదు. 'ప్రణాళిక సంఘం' అనే వ్యవస్థను రద్దుచేస్తున్నట్లు అధికార పీఠానెక్కుతూ ప్రకటించాడు. స్టాలిన్ నాయకత్వంలో ప్రణాళిక సంఘాల ద్వారా సోవియట్ రష్యాలో అద్భుతమైన ప్రగతిని కొనసాగిస్తున్న సమయంలో దాన్ని స్పూర్తిగా తీసుకున్న సామ్యవాద ముసుగు ధరించిన దోపిడీదారుల ప్రతినిధైన నెహ్రూ దాన్ని భారతదేశంలో రూపొందించాడు. 1990లో పి.వి. నరసింహారావు ప్రభుత్వం ప్రపంచబ్యాంక్ ఆదేశిత సూత్రాల ప్రభావంతో ప్రణాళిక సంఘం నిరుపయోగంగా, నామమాత్రంగా తయారయ్యింది. అటువంటిది సైతం సోవియట్ స్పూర్తి ఉంది గనుక మోడీకి అది ఇబ్బందికరంగా తలచింది. ప్రణాళిక సంఘం స్థానంలో నీతి అయోగ్ అనే సంస్థను ఏర్పాటు చేశారు. దీని చైర్మన్‌గా ప్రధాని మోడీ వైస్ చైర్మన్‌గా స్వేచ్ఛ వాణిజ్య ఆర్థికవేత్త అరవింద్ పనగడియాను నియమించారు. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ వాణిజ్య సంస్థలలో వివిధ హోదాల్లో పనిచేసిన పనగడియాను నియమించారు అంటే అర్థం చేసుకోవచ్చు. ఈ నీతి ఆయోగ్ దేశాన్ని పెట్టుబడి విషకౌగిట్లో కట్టిపెట్టడానికే అని మోడీ మొదటి క్యాబినెట్ సమావేశంలో పోలవరం పై ఆర్డినెన్స్‌ను జారీచేస్తూ తన ఆదివాసీ వ్యతిరేక వైఖరిని ప్రదర్శించి దీని ద్వారా 3 లక్షల మంది ఆదివాసుల సమాధులతో పాలనను ఆరంభించాడు. బలిచ్చే (యజ్ఞయాగాదులో) సాంప్రదాయం గల హిందూ మతోన్మాదులు, ఆర్య వారసులు ఆదివాసులను అలా బలిచ్చారు అన్నమాట.

మంత్రి పదవులలో తన మార్క్‌ను కొనసాగిస్తూ కనీస విద్యార్హతలు లేని వారికి, విఎచ్‌పి, ఆర్‌ఎస్‌ఎస్ సిద్ధాంత వారసులకు గోద్రా అల్లర్లలో ముద్దాయి అయిన ఉమాభారతి, స్మృతి ఇరానీ, సుష్మా స్వరాజ్, వెంకయ్యనాయుడు, ప్రకాష్ జవదేకర్, ప్రపంచ బ్యాంకు ఏజెంట్లయిన (కార్పొరేట్ అవినీతికి చిహ్నమైన) అరుణ్‌జైట్లీ, వెంకయ్యనాయుడు, సుజనాచౌదరి (టిడిపి) వంటివారు.

నరేంద్రమోడీ ప్రభుత్వం ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ ఆర్థిక సూత్రాలను (విధానాలను) సమర్థవంతంగా అమలు చేయడానికి తాపత్రయపడ్తుంది. మోడీ దేశ ఉత్పత్తిని పెంచుతానని ప్రకటించాడు. ఉత్పత్తిని పెంచడం అనేది ఆహ్వానించదగినదే కానీ, అది ఏవిధంగా అనేది పరిశీలించాల్సి ఉంది. ఇక్కడ ఉత్పత్తిని పెంచడం అంటే ప్రజలకు అవసరమైన ఆహార ఉత్పత్తిని, వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి చేయడమో, ప్రభుత్వరంగ సంస్థల్ని బలోపేతం చేయడమో మోడీ ఉద్దేశం అసలే కాదు. అది పెట్టుబడిదారీ సంస్థల ఉత్పత్తిని పెంచడం. ప్రజల అవసరాలతో సంబంధం లేకుండా, మార్కెట్ కోసం, లాభాన్ని పొందడం కోసమే చేసే ఉత్పత్తి అని అర్థం. అదే విధంగా పెట్టుబడిదారీ కంపెనీలన్ని భారతదేశంలో పెట్టుబడులు పెట్టాలని 'మేక్ ఇన్ ఇండియా' అని నినదించాడు. భారతదేశంలో పెట్టుబడులు పెట్టడానికి అడ్డంగా ఉన్న చట్టాలన్నింటిని సవరిస్తామని, కార్మిక చట్టాలను సవరిస్తామని ప్రకటించాడు. మొత్తంగా ఈ దేశ సంపదను బహుళజాతి కంపెనీలకు, సామ్రాజ్యవాదులకు, పెట్టుబడిదారులకు, కట్టబెట్టడానికి తెగ ఆత్రుత పడుతున్నాడు. కీలక ప్రభుత్వరంగ సంస్థలలో పెట్టుబడులను ఉపసంహరించుకుంటున్నట్లు ప్రకటించాడు. సుదీర్ఘ కాలంగా సేవా రంగాలుగా ఉన్న భీమా, రక్షణ రంగాలలో కూడా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను (ఎఫ్.డి.ఐ) ఆహ్వానిస్తూ, ప్రైవేట్ పరం చేశారు. వివిధ ప్రభుత్వ రంగ సంస్థలలో 100 శాతం ఎఫ్‌డిఐలను ఆహ్వానిస్తూ, ఆర్డినెన్స్‌ను జారీ చేశారు. మోడీ ప్రభుత్వం ఎఫ్‌డిఐలను ఆహ్వానిస్తూ ప్రభుత్వ రంగ సంస్థపై ప్రైవేట్ పెట్టుబడిదారీ సంస్థల గుత్తాధిపత్యాన్ని నిల్పుతున్నది.

అదే విధంగా కోల్ ఇండియాలో 214 బొగ్గు గనులను ప్రైవేట్‌పరం చేస్తూ ఆర్డినెన్స్‌ను జారీ చేసింది. ప్రకృతి సంపద, సహజ వనరులైన లక్షల కోట్ల విలువైన బొగ్గు గనులను ప్రైవేట్‌పరం చేయడానికి తద్వారా ఆ సంపదనంతా విదేశీ పెట్టుబడిదారులకు అప్పచెప్పడానికి ప్రయత్నిస్తుంది. బొగ్గు గనులను ప్రైవేట్‌పరం చేయడం ద్వారా బొగ్గు ధరలపై ప్రభుత్వరంగ సంస్థలు నియంత్రణను కోల్పోతాయి. దీని మూలంగా ఇప్పటికే ఇబ్బడిముబ్బడిగా పెరిగిన కరెంట్ చార్జీలు మరింతగా పెరిగి సామాన్య, పేద ప్రజల నడ్డి విరిచనున్నాయి. ప్రైవేట్ కంపెనీలు పనిని ఎక్కువగా యంత్రాల సహాయంతో నిర్వహిస్తాయి. లాభాల కోసమే ఉత్పత్తి చేసే పెట్టుబడిదారీ సంస్థలు పర్మనెంట్ కార్మికుల సంఖ్యను తగ్గించి వారి స్థానంలో కాంట్రాక్టు కార్మికులను నియమిస్తూ వారి అదనపు శ్రమను దోపిడీ చేయనున్నారు. అదే విధంగా ఆర్డినెన్స్ ద్వారా కార్మిక చట్టాలను సైతం కాల రాయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. కార్మికులీ వందలాది సంవత్సరాల పాటు సాగిన సుదీర్ఘ పోరాటాలు చేసి, ప్రభుత్వాల మెడలు వంచి తమ హక్కులను సాధించుకున్నారు. ఆ హక్కులను సైతం కాలరాసి దోపిడీదారులకు లబ్ధి చేకూర్చడానికి ప్రయత్నిస్తోంది. బొగ్గు గనులను ప్రైవేట్‌పరం చేసే ఆర్డినెన్స్‌ను రాజ్యసభలో ప్రవేశపెట్టగా అది వీగిపోయింది. దానిని క్యాబినెట్ ఆర్డినెన్స్‌గా తీసుక వచ్చింది. దానిపై (ప్రెసిడెంట్) రాష్ట్రపతి సైతం ఆయోద ముద్రవేశారు.

ఎవరికోసం ఆగేది లేదు అంటూ మోడీ ప్రభుత్వం ఆర్డినెన్స్‌ల ద్వారా చట్టాలను సవరిస్తుంది. భూ సేకరణకు సైతం ఆర్డినెన్స్‌ను జారీ చేసింది. 70 శాతం భూ యజమానుల ఆమోదం తప్పనిసరి అనే క్లాజును తొలగించారు. నష్టపరిహారం రెండింతలు అంద జేస్తామని తెలియ చేశారు. చట్టంలోని షరతులవలన 20 లక్షల కోట్ల విలువైన పెట్టుబడులు ఆగిపోయాయని, దాన్ని వేగంగా సవరించేందుకే ఆర్డినెన్స్ తీసుకు వస్తున్నాం అని ప్రకటించారు. అంటే ప్రజల ఆమోదంతో సంబంధం లేకుండా, వాళ్ల ప్రయోజనాలు ఏ మాత్రం పట్టకుండా ప్రభుత్వం ఎక్కడైనా భూమిని ప్రజల నుంచి లాక్కోవచ్చు. దేశ సంపదను లూఠీ చేస్తూ విధ్వంసకర అభివృద్ధి నమూనాను కొనసాగించడానికి యథేచ్ఛగా దోపిడిని అనుమతినివ్వడమే ఖనిజాలను వేలం వేయడానికి ఆర్డినెన్స్‌ను తీసుకవచ్చారు. ఫలితంగా ప్రైవేట్ పెట్టుబడులను విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆకర్షించడానికి, తాజా సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవడానికి పరిపాలన పరమైన జాప్యాలను నివారించడానికి వీలు కలుగుతుందని చెబుతున్నారు. దేశంలో ఖనిజ సంపదనంతా విదేశీ పెట్టుబడిదారీ సంస్థలకు, గుత్త పెట్టుబడిదారులకు, సామ్రాజ్యవాదులకు కట్టబెట్టడానికి బిజెపి ప్రభుత్వం విశ్వ ప్రయత్నాలు చేస్తూ తన సామ్రాజ్యవాదానికి ఊడిగం చేసే స్వభావాన్ని చాటుకుంటోంది.

మైనింగ్ చట్టాలను సవరిస్తూ ఆర్డినెన్స్‌ను జారీ చేశారు. ఇటీవల జార్ఖండ్ ఎన్నికల ప్రచార సమయంలో నరేంద్రమోడీ మావోయిస్టులు తమ భుజాల పై తుపాకులు కాదు నాగళ్లు మోయాలని ప్రచారం చేశారు. ఒక వైపు రైతులకు ఉన్న భూమి మొత్తాన్ని సెజ్ ప్రాజెక్టులు, పవర్ ప్లాంట్లు, మైనింగ్ అణు విద్యుత్ కేంద్రాల పేరు మీద గుంజుకుంటూ నాగళ్లను మోయమంటున్నారు. రాజనాథ్ సింగ్ నక్సలైట్ల సమస్యను తీవ్రంగా పరిగణిస్తామని, చర్చలు చేసే ప్రసక్తే లేదని ప్రకటిస్తున్నారు. అణచివేత, కోవర్టు ఆపరేషన్‌లు, ఎన్‌కౌంటర్ హత్యల ద్వారా మావోయిజాన్ని తుదముట్టిస్తామంటున్నారు. ప్రజా పోరాటాల్ని, మావో ఆలోచనా విధానాన్ని వందమంది హిట్లర్లు, నరేంద్రమోడీలు కలసి వచ్చిన అణచివేయలేరు అన్నది సత్యం. వర్గాలు ఉన్నంత కాలం వర్గపోరాటం తప్పక జరుగుతుంది.

అక్టోబర్ రెండు గాంధీ జయంతిని పురస్కరించుకొని, నరేంద్రమోడీ 'స్వచ్ఛ భారత్'కు పిలుపునిచ్చారు. మంత్రులు, మేధావులు, అధికారులు అంతా చీపుర్లు పట్టుకొని ఊడుస్తున్నారు. తమ ఇండ్లలో ఎవరి పనిని వారు చక్కబెట్టుకోలేని వారు స్వచ్ఛ భారత్ అంటూ రోడ్ల మీదకు వస్తున్నారు. పర్యావరణం, శుభ్రత స్వచ్ఛత గురించి మాట్లాడుతున్న మోడీ రష్యాతో 11 అణు రియాక్టర్ల తయారీ కొరకు ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. లక్షల కోట్ల రూపాయలు పెట్టి ఉత్పత్తి చేసే అణు విద్యుత్తు మానవాళికి ఎంతో ప్రమాదకరమైనది. కొన్ని కిలోమీటర్ల పాటు భూమిని, భూగర్భ జలాలను, సముద్రాన్ని కాలుష్యానికి గురి చేస్తుంది. లక్షలాది మంది ప్రజలు, వందలాది గ్రామాలు నిర్వాసిత్వానికి గురవుతాయి. సముద్రంలో జీవించే ఎన్నో చేపలు, జలచరాలు మరణిస్తాయి. సముద్రం మీదే ఆధారపడి జీవించే మత్స్యకారుల జీవనం విధ్వంసానికి గురికానుంది. మానవాళికి ఎంతో హాని చేసే అణుధార్మిక పదార్థాలను అది విడుదల చేస్తుంది. వినాశకరమైన, పర్యావరణ విధ్వంసాన్ని సృష్టించే ప్రాజెక్టులను నిర్మిస్తూ మరో పక్క స్వచ్ఛ భారత్ అంటూ నినదించడం, మోడీ ఏ మాత్రం స్వచ్ఛత లేని నీచ రాజకీయానికి నిదర్శనం.

రామ రాజ్యాన్ని స్థాపిస్థామని చెప్పే బిజెపి పాలకులు తమ పాలన (మొదటి) ప్రారంభం అయిన నాటి నుండి 'హిందు మతోన్మాద విష సంస్కృతిని ప్రజలలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. సుష్మాస్వరాజ్ భగవద్గీతను జాతీయ గ్రంథంగా ప్రకటించాలి అని అంటున్నారు. వి.హెచ్.పి ప్రవీణ్‌తోగాడియా, ఆర్ఎస్ఎస్, భజరంగ్‌దళ్ శక్తులేకాక బిజెపి కేంద్ర మంత్రి సాధ్వీ నిరంజన్ జ్యోతి భారత్‌లో పుట్టిన వారంతా హిందువులేనని, వారినంతా వేరే మతాల్లో ప్రలోభపెట్టి మార్చారని, వారు తిరిగి హిందు మతంలోకి మారాలని 'ఘర్‌వాపసీ' పేరుతో ఒక క్యాంపెయిన్‌ను నడుపుతున్నారు. ఘర్‌వాపసీ – ఇంటికి తిరిగిరండి పేరుతో ఇతర మతాలపై విద్వేషాన్ని రెచ్చగొడుతున్నారు. లవ్ జిహాది పేరుతో ముస్లిం యువకులు హిందు యువతుల్ని ఆకర్షించి పెళ్లి చేసుకుంటున్నారని సంఘ్‌పరివార్ శక్తులు తమ విష ప్రచారాన్ని కొనసాగిస్తున్నాయి. మత మార్పిడిని నిషేదిస్తూ చట్టాన్ని తీసుకవస్తామని కూడా చెపుతున్నారు. ఈ మొత్తం పరిణామాలతో (బి.జె.పి) నరేంద్ర మోడీ ప్రభుత్వ పాలన ముస్లింలను, క్రిస్టియన్, మైనార్టీని, దళితుల్ని తీవ్ర భయభ్రాంతులకు గురిచేస్తుంది. గుజరాత్ మారణకాండ, ముజఫర్ నగర్ నెత్తుటి సంతకాలతో పీఠమెక్కిన బ్రాహ్మణీయ హిందు మతోన్మాద మోడీ ప్రభుత్వం ఇంకా అటువంటి నెత్తురుటేర్లను పారించడానికి ఒక చేత అసమానతను, మరో చేత హింసను ప్రభోదించే మను ధర్మాన్ని , భగవద్గీతను పవిత్ర గ్రంథాలుగా మోస్తూపోతూ వాటి విష విలయాన్ని సమాజంపై ఏర్పర్చడానికి విద్యారంగాన్ని సైతం కాషాయికరించడానికి పూనుకుంటుంది. ఈ బ్రాహ్మణీయ మను వారసత్వ సంస్కరణలకు వ్యతిరేకంగా విద్యారంగంలో పెద్ద ఉద్యమాన్నే నిర్వహించవలసి ఉంది.

మొత్తంగా నరేంద్రమోడీ ప్రభుత్వం దేశ సంపదను విదేశీ కంపెనీలకు కట్టబెట్టే చర్యలో భాగంగా తన సామ్రాజ్యవాద బానిస తత్వాన్ని చాటు కుంటుంది. ప్రైవేట్ పెట్టుబడిదారీ సంస్థలకు నరేంద్ర మోడీ ప్రభుత్వం పెద్ద పీట వేయడానికి, దాని కొరకు ఆర్డినెన్స్‌లు తీసుకరావడానికి అమెరికన్ సామ్రాజ్యవాదానికి చాలా దగ్గర సంబంధం ఉంది. అమెరికాలో ఆర్థిక మాంద్యం మూలంగా పెట్టుబడిదారీ సంస్థలన్నీ అక్కడ ఉత్పత్తి (ధరలను) వ్యయాన్ని భరించలేక, వేరే దేశాలకు పెట్టుబడులన్ని తరలించాయి. ఉత్పత్తి వ్యయం తక్కువగా, కార్మికుని శ్రమను (తక్కువగా) చౌకగా లభించే, అన్నిరకాల సబ్సిడీలు, మినహాయింపులు, టాక్స్ బెనిఫిట్స్ ఇచ్చే భారత్ లాంటి దేశాలకు పెట్టుబడులను తరలించారు. అమెరికాలో పెట్టుబడులు లేకుంటే ప్రజలకు ఉద్యోగాలు ఉండవు. ఉద్యోగాలు ఉండకపోతే ప్రజలు సరుకుల్ని కొనలేరు. సరుకులు మారకం కాకుంటే మాంద్యం అలాగే ఉండిపోతుంది. కావున భారతదేశం వలె ఎక్కడైతే ఉత్పత్తి సాధనాలైన భూమి, ముడిసరుకు, మానవ శ్రమ చౌకగా లభిస్తాయో అక్కడ పెట్టుబడిదారీ సంస్థలు పెట్టుబడులు పెడుతాయి. ఆ పెట్టుబడిదారీ కంపెనీలన్నింటికీ భారత్ వంటి దేశంలో అనుమతు లను ఇప్పించడం, అమెరికాలో ఆర్థిక మాంద్యం నుండి బయటపడడం, ఇది అమెరికా స్వార్థం.

ఈ మొత్తంలో భాగంగానే జనవరి 26న 'గణతంత్ర దినోత్సవం' ప్రత్యేక అతిథిగా ఒబామా భారత్‌కు రావడం. ప్రపంచం మొత్తం మీద ప్రజా పోరాటాలపై రక్తపుటేరులను పారిస్తున్నది అమెరికన్ సామ్రాజ్య వాదం. అరబ్ దేశాలలో 'తీవ్రవాదంతో పోరు' అనే పేరు మీద లక్షలాది కోట్ల విలువైన చమురును అమెరికా దోచుకుంటుంది. లక్షలాది మంది ప్రజలపై హత్యాకాండలకు పాల్పడుతుంది. డాలర్ల రక్తపిపాసి, పీడిత ప్రజల శత్రువు అయిన అమెరికన్ సామ్రాజ్యవాద ప్రతినిధైన ఒబామా భారత్‌కు రావడం అంటే భారతదేశంలో గల సహజ, ఖనిజ వనరులను, ప్రజా సంపదను బహుళజాతి కంపెనీల కోసం, పెట్టుబడిదారుల కోసం తరలించుకు పోయే కుట్రలో భాగమే. భారత రాజ్యాంగాన్ని సామ్రాజ్యవాదుల పాదాల చెంతన నిల్పడానికి ప్రయత్నిస్తున్న హిందూ మతోన్మాద, బ్రాహ్మణీయ మోడీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం ఉంది. భారతదేశంలో గల లక్షలాది కోట్ల విలువైన బాక్సైట్, డోలమైట్, లాట్రైట్ వంటి ఎన్నో అపారమైన ఖనిజాలను సామ్రాజ్యవాద దోపిడి పరం చేయడానికి మోడీ ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. ఈ సంపద అంతటినీ తమ పాదాల కింద గల ఆదివాసి సమాజాన్ని నిర్వాసితులను చేయనుంది. ఈ దేశ సంపదను తరలించుకపోవడానికి ఆదివాసులను, వారికి రక్షణగా ఉన్న మావోయిస్టు పార్టీపై దాడికి దిగుతోంది.

65 ఏళ్లుగా ప్రజలకు ఎటువంటి స్వేచ్ఛను, సమానత్వాన్ని స్వతంత్ర్యాన్ని కల్పించలేక ప్రజలకు అవిద్యను, పేదరికాన్ని, నిరుద్యోగాన్ని, ఆకలి చావుల్ని, ఆత్మహత్యల్ని కల్పించి కేవలం దోపిడి దారులకే దోపిడీ స్వేచ్ఛ నిచ్చిన 'రిపబ్లిక్ డే' ను 'బ్లాక్ డే'గా పాటించాల్సిన అవసరం ఉంది. ఆదివాసులు, దళితులు, మైనారిటీలు, విద్యార్థులు, బుద్ధిజీవులు, ప్రగతిశీల వాదులు, మేధావులు అందరూ కలసి ఐక్యంగా భారత అర్ధ భూస్వామ్య – అర్థవలస దళారీ, నిరంకుశ పెట్టుబడిదారీ దోపిడి పాలకవర్గాల మెడలు వంచేంత వరకు పోరాడాల్సిన అవసరం ఉంది. పీడిత ప్రజల మౌలిక సమస్యలు కేవలం నూతన ప్రజాస్వామిక విప్లవంతో మాత్రమే పరిష్కారం అవుతాయి. అటువంటి నూతన సమాజాన్ని నిర్మించేంతవరకు ప్రజలంతా ఐక్యంగా పోరాడాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- ❖ **ముంచుకొస్తున్న మోడీ మతోన్మాద ముప్పు - గడ్డం వెంకటరాజం**
- ❖ **ఆదివాసుల రాజ్యాంగం - చట్టాలు - తుంపాల శ్రీరామమూర్తి**
- ❖ **నరహంతకులే నేతలై దిగాలు పడుతున్న దేశం - డా. నూకతోటి రవికుమార్**
- ❖ **జర్మనీతో శాంతి సంధి కోసం లెనిన్ చేసిన పోరాటం - ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

# భగవద్గీతలో జాతీయ భావం ఉన్నదా?

***భారతదేశంలో వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను, అంటరానితనాన్ని పెంచి పోషిస్తూ, ఆధిపత్యం కోసం హింసను ప్రేరేపించిన భగవద్గీత జాతీయ గ్రంథం ఎలా అవుతుందని అంటున్నారు*** **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

జాతీయం అనే శబ్దానికి 'ఒక జాతికి సంబంధమైనది' అనే భావం నిఘంటువు నిర్దేశిస్తుంది. మరో అర్థం 'దేశీయమైనది'గా స్పష్ట పరుస్తుంది. జాతి అనగా 'పుట్టుక, వర్ణం, కులం, వర్గం' అంటూ వ్యాఖ్యానించింది. భారతీయ సమాజం మొత్తానికి పై పదాలలో ఏ ఒక్కదానిని ఏక కాలంలో అనువర్తించడానికి ఏ కోశానా అవకాశమే లేదు. జాతీయ భావం అంటే 'స్వదేశం పట్ల, దేశ సాంస్కృతిక ఐక్యత పట్ల ఉండే అభిమానం' అంటూ వెల్లడవుతుంది. భారతీయ పౌరులలో ఇప్పటికిప్పుడే జాతీయ భావానికి కొరత ఏర్పడినదా? భగవద్గీతను జాతీయ గ్రంథంగా ఆమోదించడం వలన ఆ లోటును అమాంతం పూడ్చేయవచ్చా? జాతికి, జాతీయతకూ వివిధ భాష్యాలు ప్రకటితమవుతున్న పూర్వరంగంలో వివిధ మతాలు నెలకొన్న భారతదేశంలో ఒక హిందూ మతానికే చెందిన భగవద్గీతను జాతీయ గ్రంథంగా ఆమోదించాలనడం అర్థవంతమైన కోరిక అవుతుందా?

ఒక హిందుత్వవాది దేశ పాలనా పగ్గాలు చేపట్టడంతో హిందూ మతోన్మాద శక్తులు దేశ వ్యాప్తంగా విజృంభించాయి. హిందూ మత మౌఢ్య వికృత రూపం ఎలా ఉంటుందో ప్రజల ముందు తెరలు తెరలుగా ఆవిష్కృతమవుతుంది. నరేంద్రమోడీ ప్రధానిగా బలమైన భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం హిందూత్వ శక్తుల మూఢత్వాన్ని బలోపేతం చేసింది. వామపక్ష శాఖలు హిందూ మతోన్మాద ప్రమాదాన్ని ప్రస్తావించే నేపథ్యంలో కమ్యూనిస్టులు ఎప్పుడూ ఏదో ఒక మిషతో ఎవరినో ఒకరిని సతాయిస్తుంటారని కొట్టి పారేసే వారికి ఇటీవల చోటు చేసుకున్న పలు సంఘటనలు కనువిప్పు కలిగించి ఉంటాయి. క్రితంలో హిందూ మతోన్మాదం చాలా మందికి అర్థమయ్యేది కాదు. కారణం వారికి మద్దతిచ్చే పాలకులు అధికారాన్ని చేపట్టకపోవడమే! నరేంద్రమోడీ అధికారాన్ని హస్తగతం చేసుకున్నప్పటి నుండి ఆయనకు పాలనా భాగస్వామ్యం వహిస్తున్న కేంద్ర మంత్రులు, ఆ పార్టీ పార్లమెంట్ సభ్యులు చేస్తున్న ప్రకటనలు హిందూత్వ ఆరాచక స్వభావ స్వరూపాలను వెల్లడి చేస్తున్నాయి. వీరి అనైతిక వ్యాఖ్యల పూర్వరంగంలో విఎచ్‌పి, ఆర్ఎస్ఎస్, సంఘ్‌పరివార్, భజరంగ్‌దళ్, శివసేన, అఖిల భారత హిందూ మహాసభ వంటి మత సంస్థలు మరింత రెచ్చిపోతున్నాయి. సాధు సన్యాసులు, మఠాధిపతులు, పీఠాధిపతులు తమ తమ వ్యాఖ్యలతో ఈ దేశంలో అలజడి సృష్టించే ప్రయత్నాలు మొదలయ్యాయి. పూటకో ప్రకటన, రోజుకో ప్రేలాపనతో వ్యవస్థల మధ్య, మతాల మధ్య వేడి సృష్టిస్తున్నారు. బహుశా నరేంద్రమోడీ వీరి ప్రకటనలపై తీవ్రంగా స్పందించకపోవడం, ఖండించకపోవడం వంటి మెతకపోకడవల్లనే హిందూ మత వాదులు ముందుకూ, మను ముందుకూ వెళుతూ సమాజాన్ని భయంలోకి తీసుకుపోతున్నారు.

ఇటీవలి పరిణామాలను నెమరువేసుకున్నప్పుడు భగవద్గీతను జాతీయ గ్రంథంగా ఆమోదించాలని ఒకరు, బిజెపికి ఓట్లు వేయని వారు అక్రమ సంతానమని మరొకరు, నరేంద్రమోడీని ఆమోదించని వారు పాకిస్తాన్ వెళ్లిపోవాలని ఇంకొకరు, అహింసా సిద్ధాంతానికి ప్రతీకై, దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టిన మహాత్ముని క్రూరంగా హతమార్చిన హంతకుడు నాథూరాం గాడ్సే దేశ భక్తుడని మరొకరు. గాడ్సేకి దేశంలోని వివిధ ప్రాంతాలలో తాము నిర్మించదలచిన దేవాలయాలకు ప్రభుత్వాలు స్థల కేటాయింపులు జరపాలని వేరొకరు, కరెన్సీ నోట్లపై గాంధీజీ చిత్రాన్ని తొలగించాలని, జాతిపితగా ఉచ్ఛరించకూడదని మరొకరు ఉచ్ఛాన్ని మరిచి ఎవరికి తోచినరీతిలో వారు పేలిపోతున్నారు. విశాఖ శారద పీఠాధిపతి స్వరూప నందేంద్ర భారతీ స్వామి ఏకంగా భారతదేశాన్ని హిందూ రాజ్యంగా అర్జెంటుగా మార్చి వేయాలంటున్నాడు. నరేంద్రమోడీ గట్టిగా నోరు చేసుకోకపోవడం వల్లనే ఈ మతమౌఢ్యుల అనైతిక వ్యాఖ్యానాలు అంతరాయం లేకుండా కొనసాగుతున్నాయని దార్శనికుల అభిప్రాయం.

ఘనత వహించిన బిజెపి కేంద్ర ప్రజా ప్రతినిధుల వ్యాఖ్యానాలు గుర్తు చేసుకున్నప్పుడు మొదటగా జ్ఞప్తికి వచ్చేది విదేశీ వ్యవహారాల మంత్రిని సుష్మా స్వరాజ్ ఉవాచపై మాట్లాడుకోవాలి. ఆమె చెప్పేదేంటంటే హిందూ మతానికి పూజనీయ గ్రంథమైన భగవద్గీతను జాతీయ గ్రంథంగా ఆమోదించాలని.

మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనాయః స్త్రీయో వైశ్యాస్తదా శుద్రహః ప్రియాతి పరాంగతిమ్. తొమ్మిదో అధ్యాయం – రాజ విద్యా రాజ గుహ్యాయోగము – శ్లో. 32 – భగవద్గీత ఈ శ్లోకంలో శ్రీ కృష్ణుడు చెప్పొచ్చేదేమంటే ' ఓ అర్జునా! పాపజన్ములైనట్టి స్త్రీ, వైశ్య, శూద్రులు, చండాలురు నన్ను శరణు పొంది పరమగతిని పొందుదురు'. సుష్మా స్వరాజ్ ఈ శ్లోకం భావం ఎరిగి ఉండకపోవచ్చు. పుట్టుకతోనే స్త్రీలు, వైశ్యులు, శూద్రులు పాపులని చెప్పడంతోనే భారతీయ సమాజంలోని అత్యధిక శాతం ప్రజలను భగవద్గీత దూషిస్తున్నట్లు స్పష్టమవుతుంది.

జన్మణా జయతే శూద్రంః ఖర్మణ్యేణక్షత్రియా, బ్రహ్మజ్ఞానే సబ్రాహ్మణః అనే వేద/ఉపనిషత్ వర్ణ ధర్మాన్ని ధ్వంసం చేసి జాతిని మరిన్ని వర్ణాలుగా విభజించింది శ్రీకృష్ణుని భగవద్గీత. భగవద్గీతకు ముందు వ్యక్తిత్వ ఆచరణ, జ్ఞానాన్ని ఉత్తమ గుణాల ఆధారంగా, శీల ప్రధానంగా వర్ణాలను ఆపాదిస్తే భగవద్గీత పుట్టుకతో వర్ణాలను కల్పించి భారత మానవ సమాజాన్ని కోలుకోలేకుండా చేసింది.

చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగశః

నాలుగో అధ్యాయం - జ్ఞానకర్మ సన్యాసయోగం - శ్లో.13 - భగవద్గీత.

ఈ శ్లోకంలో శ్రీకృష్ణుడు చెప్పినదేమిటంటే 'బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణముల వారిని వారి గుణకర్మలననుసరించి వేర్వేరుగా సృష్టించితిని' అంటూ ఉంటంకించాడు.

వాస్తవానికి భగవద్గీతలోని ఈ రెండు శ్లోకాలు భారత జన సమూహాన్ని వర్ణాల పేరుతో ముక్కలు ముక్కలుగా విభజించి కులాలతో నిచ్చెన మెట్ల సమాజం స్థిరపడి శాఖోపశాఖలై ఒక వట వృక్షంగా విస్తరించడానికి బీజం వేశాయి. మానవ సమాజాన్ని విభాగాలుగా, ముఠాలుగా చేసి ఒకరిపై ఒకరు ద్వేషభావం పెంచుకునేందుకు చాలానే చేశాయనడానికి సందేహించాల్సిన అవసరం లేదు. వేద కాలానికి ముందు జన్మించిన అనంతరం శీలాన్ని, జ్ఞానాన్ని బట్టి వర్ణం లభిస్తే, భగవద్గీత వర్ణ విభాగం జననానికి ముందే నిర్ణయించింది. ఈ సిద్ధాంతమే భారతదేశ విచ్ఛిన్నానికి, అనైక్యతకు, మనిషికీ మనిషికీ మధ్య అడ్డుగోడకు ప్రతీకగా నిలిచింది.

కాగా భగవద్గీతను పూర్తిగా అర్థం చేసుకున్నవారెవరు? ఎవరికి ఒక పట్టాన అవగతమైంది? అదో బ్రహ్మ పదార్థం అర్థమైతే శ్రీకృష్ణుని భగవద్గీత వివిధ వ్యాఖ్యాతలు ఇన్నిన్ని వ్యాఖ్యానాలు పరిపరి విధాలుగా ఎందుకు చేస్తారు. వాస్తవానికి ఎవరికోసమైతే శ్రీకృష్ణుడు భవద్గీత చెప్పాడో ఆ అర్జునునికే అవగాహన కాలేదు. ఒకానొక సందర్భంలో అర్జునుడే శ్రీకృష్ణునితో ఇలా అంటాడు. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధం మోహయా సేవయే/తదేకం వద నిశ్చిత్యయేన శ్రేయోహమాప్నుయామ్. మూడవ అధ్యాయం - కర్మయోగం - శ్లో 2 - భగవద్గీత.

ఈ శ్లోక భావమేమంటే 'కలగా పులగపు నీమాటలతో నాబుద్ధి భ్రమకులోనగునట్లు చేయుచున్నావు కనుక నాకు శ్రేయస్కరమైన ఒక మార్గమును నిశ్చయముగా తెల్పుము' అని విశదమౌతుంది.

అర్జునుని ఈ సంశయాత్మక భావన తరువాత మూడవ అధ్యాయంతో పాటు పద్దెనిమిదో అధ్యాయము వరకూ 16 అధ్యాయములు చెప్పిన శ్రీకృష్ణుడు విశ్వరూప దర్శనం కూడా ఇచ్చి భగవద్గీతకు బలం చేకూర్చాడు. అయినా అర్జునునికి బోధపడలేదు. ఎట్లాగంటే! మహాభారత కురుక్షేత్రం సంగ్రామంలో కౌరవులచే సంహరింపబడిన తన కుమారుడు అభిమన్యుని పార్థివ దేహాన్ని దర్శించి బోరున విలపించే అర్జునుని గాంచిన శ్రీకృష్ణుడు 'బావా కాలాన్ని సుప్త చేతనావస్థలో ఉంచి 18 అధ్యాయముల గీత బోధను చేసి సుఖ దుఃఖములకు, రాగద్వేశములకు అతీతంగా ఉండమని హితబోధ చేశానే, నీకు అర్థమైట్లుగా తోచడం లేదు' అన్నప్పుడు! కృష్ణా 'నాకు నిజంగానే నీవు చెప్పిన భగవద్గీత అర్థం కాలేదని' సమాధానం చెపుతాడు. ఆ సందర్భంగా శ్రీకృష్ణుడు తిరిగి ఉత్తర గీత బోధనకు ఉపక్రమిస్తాడు. అర్జునుడికే తలకెక్కని, ఏ విధంగా ఉపయోగపడని భగవద్గీతను జాతి మొత్తానికి రుద్దాలని సుష్మా స్వరాజ్ కోరడం విడ్డూరం, అనుచితం, శోచనీయం.

అయినా మనది మతాతీత ప్రజాస్వామ్య లౌకిక వ్యవస్థ. ఈ దేశంలో అనేక మతాలున్నాయి. ఒక్కో మతానికి ఒక్కో పవిత్ర గ్రంథం ఉంది. హిందూ మతంతో పాటుగా, ఇస్లాం, బౌద్ధం, క్రైస్తవం, జైనం, సిక్కు మతాలు ప్రధానంగా మన దేశంలో అందరికీ తెలిసిన మతాలు. ఇవి కాకుండా పారసీ, జుడాయిజం, జురాస్ట్రియానిజం లాంటి చిన్న చితకా మతాలు కూడా ఉన్నాయి. హిందువులకు భగవద్గీత ఎట్లా పవిత్ర గ్రంథమో ఇస్లాంకు ఖురాన్, క్రైస్తవానికి బైబిల్, బౌద్ధానికి త్రిపిటకము, సిక్కు మతానికి గురుగ్రంథ సాహెబ్, జైనానికి కల్పసూత్ర ఆరాధ్య గ్రంథాలున్నాయి. భారతదేశంలో హిందువులు అధిక సంఖ్యాకులు కావచ్చు. అంత మాత్రాన భగవద్గీతను అన్ని మతాలవారి నెత్తిమీదికి ఎత్తాలనుకోవడం ఉన్మాదానికి తలుపులు తెరవడమే అవుతుంది. ఎవరి మత గ్రంథం వారికి పూజనీయం కాదా? ఈ ప్రకారం అన్ని మతాల వారు కోరితే శాంతియుతంగా కొనసాగుతున్న భారత సమాజంలో అలజడులు, ఘర్షణలు చెలరేగి మత గొడవలకు దారితీయదా? విజ్ఞులైనవారు ఈ దిశగానే ఆలోచిస్తారు.

నిజానికి హిందూ, బౌద్ధ, జైన, సిక్కు మతాలు మనదేశంలోనే ఆవిర్భవించాయి. క్రితం ఉన్న హిందూ మతాన్ని దాటి ఈ మతాలు వ్యాప్తి చెంది ప్రజలకు చేరువకావడానికి ముఖ్య కారణం మెరుగైన సిద్ధాంతం, ఆమోదయోగ్యమైన ప్రతి పాదనలు నెలకొని ఉండడమే. బౌద్ధం మనదేశం ఎల్లలు దాటి అనేక ప్రపంచ దేశాలకు చేరి పెద్ద వటవృక్షంగా రూపుదిద్దుకుంది. అయితే బౌద్ధం, జైనం వలన బీటలువారి నేల బారుకు చేరిన తమ అగ్రవర్ణ ఆధిపత్యాన్ని, కోల్పోయిన ప్రాభవాన్ని పొంది, తిరిగి తమ నిరంతర దోపిడీని కొనసాగించడానికే బ్రాహ్మణ వర్గాలు మరలా భగవద్గీతను చేపట్టి ముందుకు సాగారు, సాగుతున్నారు. వర్ణాశ్రమ ధర్మాన్ని, కుల సమాజాన్ని భగవద్గీత కాపాడడమేనన్నది ఇందుకు విశ్వసించ దగిన కారణమన్నది సుస్పష్టం. నిచ్చెన మెట్ల సమాజానికి అది వెన్నుదన్నుగా నిలవడమేనన్నది మరువరాని వాస్తవం.

భగవద్గీతను చెప్పిన శ్రీకృష్ణుడేమన్నా ధర్మాలను పాటించాడా? అంటే! అది కూడా సంశయాత్మకమే. అప్పటికి అమలయ్యే కొన్ని ధర్మాలను ధ్వంసం చేసినవాడే. నైతిక విలువల పతనానికి, శుష్కించిన రాజకీయ వ్యవస్థకూ పరాకాష్ఠ శ్రీకృష్ణుడు. ఆనాటి విలువల విధ్వంస రచనకు కొనసాగింపే దిగజారిన నేటి రాజకీయ వ్యవస్థ. ఎందుకంటే విజయం ప్రాతిపదికన మహాభారత కురుక్షేత్ర యుద్ధంలో పాండవులను నడిపించిన ఘనుడు. తను ఆశించిన కార్యాలన్నీ తనను అభిమానించి ఆశ్రయించిన పాండవులచే సాధించుకుని ఆత్మానందం పొందినవాడు. ఆనాటి మహాభారత యుద్ధం మాదిరిగానే నేటి ఎన్నికల వ్యవస్థ నడుస్తుంది. కౌరవులు బుద్ధిహీనులు కాదని ఎవరూ అనరు. నీతిమాలిన చర్యలకు, అక్రమాలకు పాల్పడి ఉండవచ్చు. అభిమన్యుని అధర్మంగా యుద్ధంలో మట్టు పెట్టారు. అయితే శ్రీకృష్ణుని సలహాలతో పాండవులేమన్న తక్కువ తిన్నారా? భీష్మ, ద్రోణ, శల్య, కర్ణ, సుయోధన, ఘటోత్కచ, బర్బరీక అక్రమ సంహారాల వెనుక శ్రీకృష్ణుని మర్మం, ప్రోత్సాహం లేవని ఎవరైనా చెపుతారా? పాండవుల అధర్మ యుద్ధమం తటికీ శ్రీకృష్ణుడే మూలకం, కీలకం. మహా యోధుడైన కర్ణుని తమవైపుకు మలుపుకునేందుకు తను స్వయంగా నడిపిన రాయబార సన్నివేశాన్ని తలుచుకుంటే ముక్కున వేలుపడుతుంది. 'మొత్తం కురు సామ్రాజ్యానికి చక్రవర్తి అవుతావని, ద్రౌపధి ఆరో భర్తగా స్వీకరిస్తుందని' చెప్పిన శ్రీకృష్ణుని వైనాన్ని ఎట్లా వ్యాఖ్యానించాలో అర్థం కాదు. అంతకు క్రితం కుంతీ మాతను కర్ణుని వద్దకు పంపి మాతృ ప్రేమని ఎరగా పెట్టించి అర్జునుని మినహా మిగతా నలుగురు పాండవ సోదరుల పట్ల కర్ణుని వివశుని చేయించిన అంశం

# ప్రపంచీకరణ - మతోన్మాదం

*మతపరమైన అర్థంలో ఆవిర్భవించని 'హిందూ' అనే పదాన్ని వాడుతూ నేటి సంఘ్‌పరివార్ శక్తులు తమ స్వార్థ రాజకీయాల ప్రయోజనాల కోసం మనుషుల మధ్య మతోన్మాదం సృష్టిస్తున్నాయని అంటున్నారు* **షేక్ కరీముల్లా**

గత మూడు దశాబ్దాల కాలంగా మతతత్వవాదం ప్రమాదకరమైన స్థాయికి చేరింది. ఇది నేడు మరింత కోరలు చాచి భారతీయ లౌకిక తత్వానికి సవాలు విసురుతూ ఉంది. భారత జాతీయోద్యమం అందించిన లౌకిక ప్రజాస్వామ్య భావన, వేల సంవత్సరాల మన ప్రజా సంస్కృతిలో లౌకిక విధానం చెక్కు చెదరకుండా కొనసాగుతుంది. ఇది ప్రజలకు శ్రేయస్కరమైనది, ప్రజాస్వామికమైనది కనుక లౌకిక విధానం భారత రాజ్యాంగంలో పొందుపరిచారు. 1976లో 42వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని చేసి రాజ్యాంగ ప్రవేశికలో లౌకిక (సెక్యులర్) అనే పదాన్ని పొందుపరిచారు. రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులలో 25 నుంచి 28 వరకు గల అధికరణలు మన లౌకిక తత్వాన్ని ధ్రువ పరుస్తున్నాయి. లౌకిక రాజ్యం అంటే మత ప్రమేయం లేని ప్రజాస్వామిక రాజ్యం అని అర్థం. అంటే రాజ్యం అన్ని మతాలను ఒకే దృష్టితో చూస్తుంది. ఎటువంటి వివక్షతలు ప్రదర్శించదు. పాలన మత సంబంధమైనదిగా ఉండరాదు. మత రహితంగా ఉండాలి.

**హిందూ పద అర్థం - వివరణ**

ఈ జంబూ ద్వీపంలో వేలాది సంవత్సరాలుగా అనేక దేశాలుండేవి. ఆంగ్లేయుల పాలనలో మన దేశం పేరు ఇండియాగా ఆవిర్భవించింది. ఈ ఇండియాలో నివసించే ప్రజలే భారతీయులు లేదా హిందువులు. ఈ హిందూ అనే పదమే 'విదేశీ' పదం. ఇది మతపరమైన అర్థంలో ఆవిర్భవించలేదు. సింధూనది పరివాహ ప్రాంతంలో ప్రవేశించిన అరబ్బులు అక్కడి వారిని హిందువులు అన్నారు. వారు సింధూ అని (ఉచ్చరణ) పలుకలేక 'హిందూ' అని పిలిచారు. ఈ పదం క్రి.శ. 5వ శతాబ్దంలో ఆవిర్భవించింది. ఈ హిందూ దేశం భిన్న సంస్కృతుల సమ్మేళనం. పలు మతాలవారున్నారు. ముస్లింలు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు, పారశీలు ఉన్నారు. ఈ దేశంలో వేలాది సంస్కృతులు కూడా ఉన్నాయి. వాటికి పేర్లు లేవు. అవి వివిధ ఆచారాల, సాంప్రదాయాల, విశ్వాసాల రూపాలలో ఉన్నాయి. వాటిని మతాలుగా ప్రజలు ఏనాడూ భావించలేదు. వాస్తవానికి భారత ప్రాచీన, మధ్యయుగ దశలలో మతతత్వ గుర్తింపు లేదు. ఒకప్పుడు మనం మిగతా ప్రపంచానికి మత సామరస్యాన్ని, రాజకీయాలను, కళలను, విజ్ఞాన శాస్త్రాలను నేర్పుతూ ఉండేవాళ్లం. సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ, అహింస, అనే విలువలు అందించాం. ఇంత సుభిక్షమైన చరిత్ర, నాగరికత గల మనదేశంలో సమానత్వ భావనల మీద, మన సాంస్కృతిక వైవిధ్యం మీద ఆధిపత్య భావాజాలాన్ని బలవంతంగా రుద్దుతున్న ఘటనలు, ఈ దేశంలోని సౌభ్రాతృత్వ భావనను, భారత లౌకిక జాతీయ వాదాన్ని నిట్టనిలువున చీలుస్తున్న ఘటనలు ఈ రోజు జరుగుతున్నాయి.

**ప్రమాదంలో భారత లౌకిక తత్వం**

ఒక స్వయం సేవకుడు మోడీ అధికారంలోకి వచ్చిన నాటి నుంచి

---

శ్రీకృష్ణుని ఏ స్థాయిలో నిలుపుతుందో చెప్పలేం. బతికినంత కాలం అవమానాలతో కుంగిన ఆయన మానానికి అయనను వదిలి సంగ్రామ సమయంలో కర్ణునితో రాయబారాలు నడపడం ఏ జాతీయతావాదానికి కొలబద్దో అర్థం చేసుకోలేం.

పైన చెప్పుకున్నవన్నీ రాజకీయ, యుద్ధ క్రీడలైతే ఆచారాలను మంట గలిపి పెద్దల పట్ల అనుచిత భావనతో ప్రవర్తించాడు శ్రీకృష్ణుడు. సుయోధనునితో నిశ్చితార్థం ముగిసిన సుభద్రను అర్జునునితో వివాహం జరిపించాడు. కన్య ఇష్ట ప్రకారం పరిణయం జరగడం ఆమోదయోగ్యమే. సుభద్ర కోరిన ప్రకారం వివాహం అర్జునునితో జరిగింది. దానిని ఎవరూ కాదనరు. ఆ విషయం ఎరిగిన శ్రీకృష్ణుడు నిశ్చితార్థం వరకూ వెళ్లనీయడమే అపవిత్రం. తనకంటే అగ్రజుడైన బల రాముడికి తెలియకుండా సుభద్రార్జునుల వివాహమొనర్చడమే సాంప్రదాయానికి గొడ్డలి పెట్టు. కుటుంబ పెద్దలకు ఎరుక కాకుండా చాటుగా కార్యక్రమాలు చక్కబెట్టడం జాతీయ వాదమేనా?

మహా యుద్ధ కాంక్ష పరుడు, రాజ్య కాంక్ష పరుడు శ్రీకృష్ణుడు. పాండవులచే రెండు పర్యాయాలు యాగం చేయించిన వాడు. అందులో ఒకటి ఇంద్రప్రస్థం కేంద్రంగా నిర్వహించిన రాజసూయయాగం. రెండవది మహా భారత కురుక్షేత్ర సంగ్రామానంతరం నడిపిన రాజసూయయాగం. పాండవులంతా కురుక్షేత్ర సంగ్రామంలో ఆప్తులను, బంధువులను, సంతానాన్ని, సైన్యాన్ని కోల్పోయి దైన్యంగా కుంగిపోయి ఏ విధంగా పశ్చాత్తాప పడాలో అర్థంగాక బాధలో ఉన్న సందర్భంలో వారిని ప్రోత్సహించి అశ్వమేధం చేయించాడు. రెండు యాగాల ముఖ్య భూమిక యుద్ధమే. పర రాజ్యాలపై జైత్రయాత్రే తలపంచిన రాజులను సామంతులుగా ప్రకటించడం, లొంగిరాని వారిపై యుద్ధం నెరపి వారి రాజ్యాన్ని కబళించి తమ రాజ్యంలో కలుపుకోవడమే ఈ యాగాలతో పాండవులు నడిపిన ప్రక్రియ. యుద్ధమంటే రక్తపుటేరులు పారడం, జన హననమేకదా? పరాయి రాజ్యాలపై అకారణ యుద్ధాలలో జాతీయత ఉందా? ఇన్ని యుద్ధాలకు మూలమైన శ్రీకృష్ణుడు ఉపదేశించిన భగవద్గీత జాతీయగ్రంథమెట్లా అవుతుంది?

*(రచయిత అధ్యక్షులు, పల్నాడు రచయితల సంఘం)* వీ

ఈ ఆరు మాసాలలో జరుగుతున్న వరుస సంఘటనలు లౌకిక వాదానికి ప్రమాద ఘంటికలుగా చెప్పవచ్చు. దేశంలో హిందూ సంస్కృతిని పునరుద్ధరిస్తామని, 12వ శతాబ్దంలో రాజపుత్ర రాజు పృధ్వీరాజ్ చౌహాన్ ఢిల్లీ సింహాసనాన్ని కోల్పోయిన తరువాత ఇప్పుడు 800 ఏళ్ల తరువాత మళ్లీ హిందువులు ఢిల్లీలో అధికారంలోకి వచ్చారని కేంద్రంలో బిజెపి గద్దెనెక్కడాన్ని ప్రస్తావిస్తూ విహెచ్‌పి నేత అశోక్ సింఘాల్ అన్నారు. 'ఈ మధ్యలో పాలించిన వారు ఎవరో ఈ చరిత్ర పండితుడే (స్కాలర్) చెప్పాలి' ఇంకను బిజెపి ఎంపిలు, మంత్రులు చేస్తున్న వ్యాఖ్యలు, మాట్లాడుతున్న మాటలు భారత లౌకికతత్వానికి సవాల్ విసురుతున్నాయి. ఎన్నికల సమయంలో మోడీ అంటే ఇష్టంలేని వారు పాకిస్థాన్‌కు వెళ్లి పోడంటూ వ్యాఖ్యలు చేసిన గిరిరాజ్‌సింగ్ తరువాత కేంద్రంలో మంత్రి అయ్యారు. ఒక కేంద్ర మంత్రి నిరంజన్‌జ్యోతి ఢిల్లీలో పాలించాల్సింది రాముడి సంతానమా? అక్రమ సంతానమా? తేల్చుకోవాలంటూ ఎన్నికల ప్రచారంతో ఓటర్లకు పిలుపునిచ్చారు. మరో ఎంపి సాక్షిమహరాజ్ గాంధీజీని హత్య చేసిన హంతకుడు నాధురాం గాడ్సే దేశ భక్తుడని సంభోదించాడు. ఈ వ్యాఖ్యపై పార్లమెంట్‌లో ప్రతిపక్షాల నుంచి తీవ్ర నిరసన వ్యక్తమవగా గాడ్సే పొరపాటున ఏమైనా చేసి ఉండొచ్చు గాని, దేశ ద్రోహి మాత్రం కాదంటూ సమర్థించాడు. జాతిపితగా ఈవేళ ప్రజల గౌరవం పొందిన గాంధీజీని కాల్చి చంపడం ఈయన దృష్టిలో నేరం కాదు. కేవలం పొరపాటు మాత్రమే. అయోధ్యలో సాధ్యమైనంత త్వరగా రామ మందిరం నిర్మించాలని ఈ దేశ పౌరులు కోరుకుంటు న్నారని యుపి గవర్నర్ రామ్‌నాయక్ ప్రకటన ఆశ్చర్యకరం. కోర్టు పరిధిలో ఉన్న ఒక వివాదాస్పద సున్నిత అంశాన్ని రాజ్యాంగ పదవి లోనున్న రామ్‌నాయక్ వ్యాఖ్య రాజ్యాంగ ఉల్లంఘన అవుతుంది. మోడీ భారతదేశాన్ని హిందూ దేశంగా మార్చేస్తారని గోవా మంత్రి దీపాంకర్ ధవాలికర్ వ్యాఖ్య కూడా రాజ్యాంగ ఉల్లంఘనే. విదేశాంగ మంత్రి సుష్మా స్వరాజ్ భగవద్గీతను జాతీయ గ్రంథంగా ప్రకటించాలని పిలుపు నిచ్చింది. ప్రధాని మోడీ విదేశీ నేతలకు భగవద్గీతను బహుకరిస్తున్నారని, దానికి సాధికారత కలిగించాలని మాట్లాడినది. ఈ వరుస సంఘటనలు దేశ లౌకిక వాదం ప్రమాదంలో పడినదనడానికి సంకేతాలు.

**మత మార్పిళ్లు – ఘర్ వాపసి**

లౌకిక వాద స్పృహకు గొడ్డలి పెట్టు ఈ మత మార్పిళ్లు. ఇది సంఘ్‌పరివార్ శక్తులు ప్రజల మధ్య చిచ్చుపెట్టి, మత విద్వేషాలు రెచ్చగొట్టి దేశాన్ని అతలాకుతలం చేసే చర్య 2014 డిసెంబర్ 10న ఆగ్రాలో జరిగిన బలవంతపు మత మార్పిడి, 2014 డిసెంబర్ 25 అలిఘడ్‌లో 5000 మంది ముస్లింలు, క్రైస్తవులను 'ఘర్‌వాపసి' అనే తప్పుడు నినాదంతో మత మార్పిడులకు పాల్పడ్డారు. ప్రలోభాలు ఎరవేసి ముస్లింలకు రు. 5 లక్షలు, క్రైస్తవులకు 2 లక్షలతో ప్రలోభపెట్టి మత మార్పిళ్ల కార్యక్రమాలు కొనసాగిస్తున్నట్లు ధర్మజాగరణ్ మంచ్ బాహాటంగా ప్రకటిస్తుంది. అలాగే గుజరాత్‌లోని వల్సాద్ పట్టణానికి దగ్గరలో ఓ గిరిజన తండాలోని వంద క్రైస్తవ కుటుంబాలను గంపగుత్తగా హిందూ మతంలోకి మార్పిడి జరిగింది. ఐతే ఇది మత మార్పిడులు కావని, తొలుత హిందువులుగా ఉన్న వీరు తర్వాత క్రైస్తవం స్వీకరించారని వారు తిరిగి హిందూ మతంలోకి మారడాన్ని మత మార్పిడిలు అనకూడదని హిందూ సంస్థలు భాష్యం చెపుతున్నాయి. ఇలాంటి మత మార్పిడులను 'ఘర్ – వాపసి' (సొంత ఇంటికి తిరిగి రావడం) గానే చూడాలంటూ శోచనీయం. ఇలా బలవంతపు మత మార్పిడులకు పాల్పడుతూ మరోవైపు మత మార్పిడులకు వ్యతిరేకంగా బిల్లు తీసుకొస్తామని బిజెపి మాట్లాడడం 'దొంగే దొంగ, దొంగ' అన్న చందంగా ఉన్నది. ఎన్నికలలో 'సబ్‌కా సాద్ – సబ్‌కా వికాస్' అంటూ ఊదరగొట్టిన బిజెపి దీనిని గాలికి వదిలి ఈ చర్యలతో ఐక్యంగా ఉన్న ప్రజలలో చిచ్చుపెట్టి దేశాన్ని రావణ కాష్టంలా మార్చాలని చూస్తుంది. భారత లౌకిక విధానానికి విఘాతం కలిగించే ఈ చర్యలను లౌకిక వాదులు పౌర సమాజం ఖండించాలి. ఎక్కడికక్కడ ఈ మతోన్మాద చర్యలను ఎదుర్కొని, ఎండగట్టి దేశాన్ని ఈ మతోన్మాదుల నుండి రక్షించుకోవాలి. లేకుంటే భారీ మూల్యం చెల్లించాల్సి ఉంటుంది. ఇప్పటికే దీని తాలుకు చేదు అనుభవాలు మనకున్నాయి.

**మతం – ఆర్థిక దోపిడికి సాధనం**

ఈ సంఘటనలను మతం చట్రంలో నుంచి చూస్తే సమాధానం ఎప్పటికీ దొరకదు. పరిష్కారం లభించదు. ఇవాళ మన ముందున్న సవాళ్లకు సమాధానాలను వెతకాలంటే ఒక వ్యవస్థీకృత పరిశోధన చట్రం అవసరం. ప్రపంచ చారిత్రక దృక్పథంతో ఒక బలమైన అవగాహన మనకుండాలి. దీనికి గాను ప్రజా మేధావి, ప్రజల మనిషి డా. బాలగోపాల్ పరిశోధన, కృషి, ఆయన చూపిన మార్గం మనకు ఎంతో ఉపయోగపడుతుంది. ఏ మతాన్నయిన నిశితంగా పరిశీలిస్తే మతం ఒక దోపిడి పీడన సాధనంగా పాలకులకు లాభం చేకూర్చిందనేది చారిత్రక వాస్తవం. చరిత్రలోకి వెళ్లి దీని తాలూకు మూలాలు చూడాల్సి ఉంటుంది. పూర్తిగా మతం దోపిడి శక్తుల చేతుల్లో దోపిడికి సాధనంగా ఉపయోగపడుతుంది. అందుకే కారల్ మార్క్స్ 'మతం ప్రజల పాలిట మత్తు మందు' అని వ్యాఖ్యానించాడు. ఏ రాజ్యానికైన దోపిడి రాజ్యాంగం కొనసాగాలంటే దోపిడికి గురయ్యేవారు అనైక్యంగా, బలహీనంగా, అజ్ఞానంగా, మూఢ విశ్వాసాలతో, పరస్పర కలహాలతో ప్రజలు ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. మనదేశంలో రాజకీయాలన్నీ జాతి, మతాల పునాదుల మీద ఏర్పడి ఉన్నాయని స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వాలనే ప్రజాస్వామిక విలువలను, సామాజిక న్యాయాన్ని పాతాళంలోకి నెడుతున్నాయని మనకు తెలుసు. రాజకీయ ప్రయోజనాల కోసం మతాన్ని దుర్వినియోగపరచిన సంఘటన ప్రపంచంలో మొదటి సారిగా అమెరికాలో 19వ శతాబ్దంలో జరిగింది. తర్వాత యూరప్‌లో కూడా నాజీ నియంతలు జాతి సిద్ధాంతం పేరిట దారుణ హత్యాకాండకు పాల్పడ్డారు. ఈ చర్యలను సామ్రాజ్యవాద విస్తరణ, ఆర్థిక దోపిడిలో భాగంగానే చూడాల్సి ఉంటుంది.

ఇక 1885లో భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావం అనంతరం భారతదేశంలో మతతత్వ రాజకీయాలు (హిందూ – ముస్లిం) మొదటి సారిగా రంగం మీదకు వచ్చాయి. పరస్పర వ్యతిరేకమైన రెండు మతతత్వ సంస్థలు ఆవిర్భవించాయి. ఒకటి ఇస్లాం మత పునాదిపై ముస్లిం లీగ్ (1906), రెండవది హిందూ మత పునాదిపై ఏర్పడిన హిందూ మహాసభ (1907), ఆర్ఎస్ఎస్ (1925) ల నిర్మాణం. ముస్లిం మతతత్వానికి ముస్లిం లీగ్ ప్రాతినిధ్యం వహించింది. అలాగే హిందూ మహాసభ, ఆర్ఎస్ఎస్, కాంగ్రెస్‌లోని ఒక వర్గం కూడా హిందూ మతతత్వ రాజకీయాల పక్షాన పనిచేశాయి. ముస్లిం లీగ్ ఎప్పుడూ ముస్లింలలోని

ధనిక వర్గాలకు మాత్రమే ప్రతినిధిగా ఉన్నది. ఈ ధనికులు దేశ విభజన అనంతరం పాకిస్థాన్‌లో స్థిరపడ్డారు. అయితే ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ హకీం అజ్మల్‌ఖాన్, డా. అన్సారి, మౌలానా అబ్దుల్‌కలాం, ఆజాద్ వంటి తదితర ముస్లిం మేధావులు మాత్రం లౌకికవాద భారతీయ హిందూ – ముస్లిం ఐక్యతతో స్వాతంత్ర్యం కోసం పోరాడాలన్న విశ్వాసంతో పనిచేశారు. దేశ విభజనానంతరం భారతదేశంలోనే మిగిలి పోయిన అత్యధిక శాతం ముస్లింలు, పేదవాళ్లు, భూమిలేని వాళ్లు, చేతి వృత్తుల వాళ్లు ఈ దేశం మీద ప్రేమ ఉన్న లౌకికవాదులు. వీరు అల్ప సంఖ్యాక వర్గంగా, రెండవ తరగతి పౌరులుగా బతుకుతూ కూడా దేశ విభజనకు కారకులన్న నిందను భరిస్తున్న అభాగ్యులు ఈ దేశ ముస్లిం ప్రజలు. మరోవైపు నాజీల నుండి, హిట్లర్ నియంతృత్వం నుండి ప్రేరణ పొందిన ఆర్‌ఎస్‌ఎస్ ప్రారంభంలో దీని మద్దతు దారులందరూ భూస్వాములు, వ్యాపారవేత్తలు, బ్రాహ్మణ తదితర ధనిక వర్గాలు ఈ సంస్థ జాతీయోద్యమంలో ఏ పాత్ర పోషించలేదు. పైగా క్విట్ ఇండియా (1942) ఉద్యమాన్ని బహిష్కరించింది, వ్యతిరేకించింది కూడా వాస్తవం ఇది కాగా దేశ నిర్మాణంలో తను ప్రధాన పాత్ర పోషిస్తున్నట్లుగా సంఘ్ పరివార్ చెప్పుకుంటుంది. బిజెపి అధికారంలో ఉన్న రాష్ట్రాలలోని చరిత్ర పాఠ్య పుస్తకాలలో ఎన్నో వక్రీకరణలు చేర్చారు. భారత జాతీయోద్యమం లో హిందూత్వ శక్తులు గొప్పపాత్ర పోషించాయని హెడ్గేవార్‌ను బ్రిటిష్ ప్రభుత్వం జైల్లో పెట్టిందని అబద్ధాలు రాశారు. నిజానికి హెడ్గేవార్ సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నది చాలా తక్కువ కాలం. ఆ సమయంలో కొద్దికాలంపాటు జైల్లో ఉన్నాడే తప్ప ఆ తర్వాత ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న జాతీయోద్యమంలో ఆర్‌ఎస్‌ఎస్ పాల్గొనలేదు. అంటే బ్రిటిష్ సామ్రాజ్య వాదుల ఆర్థిక దోపిడినీ, పీడనను ఈ అపర దేశభక్తులు ఎక్కడ వ్యతిరేకించలేదనేది గమనార్హం. హెడ్గేవార్ 1931 నుంచి ఉద్యమంతో సంబంధాలు తెంచుకున్నాడని లాలా లజపతిరాయ్ కూడా నిర్ధారించాడు. జాతీయోద్యమానికి దూరంగా ఉండడమనేది సరైన చర్యయే అని గోవాల్కర్ సిద్ధాంతీకరించాడు. ఈ దృక్పథంతో సంఘ్‌పరివార్ శక్తులు బ్రిటిష్ వాళ్లను వ్యతిరేకించలేదు. ఆర్‌ఎస్‌ఎస్ జాతీయవాదం పని అంతా ముస్లింలను వ్యతిరేకించడం, ముస్లింలను సమర్థిస్తున్నారంటూ జాతీయ నాయకులను తిట్టడం మాత్రమే. ఈ పైత్యం బాగా నెత్తికెక్కించుకున్న నాథూరాం వినాయక్ గాడ్సే చివరకు గాంధీజీని పొట్టనపెట్టుకున్నాడు (1948). నేడు ఈ గాంధీ హంతకునికి గుడి కట్టేందుకు యుపి రాష్ట్రం మీరట్‌లోని శారదా రోడ్డులో హిందూ మహాసభ భూమి పూజ చేయడం సంచలనమైనది. ఈ వికృత చర్యపై స్థానిక మెజిస్ట్రేట్ విచారణకు ఆదేశించినట్లు వార్తలు వచ్చాయి. బ్రిటిష్ వాళ్లమీద సాయుధ తిరుగు బాటు చేసిన నావికులను కూడా ఆర్‌ఎస్‌ఎస్ తప్పుపట్టింది. అంటే వీరి దృష్టిలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాటం అన్నది వినాశకరం, అభివృద్ధి నిరోధకం. ఈ పరంపర నేటికీ కొనసాగుతుంది. మోడీ దూకుడుగా కొనసాగిస్తున్న ప్రపంచీకరణ ఆర్థిక విధానాలను ఈ సంస్థ ఎక్కడా కూడా వ్యతిరేకించిన పాపాన పోలేదు. పైన వివరించిన విధంగా రెండు మతాలకు చెందిన ఈ మతతత్వ సంస్థలు ఏనాడూ బ్రిటిష్ విధానాలను వ్యతిరేకించలేదు. అందువల్ల ఆనాడు వాటి కార్యకలాపాలకు బ్రిటిష్ వారి నుంచి ఎటువంటి ఇబ్బందులు ఎదురవలేదు. దీన్ని ఆసరగా వాడుకున్న బ్రిటిష్‌వారు 'విభజించు – పాలించు' విధానం కొనసాగించి పూర్తి లబ్ధి పొందారు. హిందూ, ముస్లింలలోని ఉన్నత వర్గాలలో పెరిగిన విభేదాలను బ్రిటిష్ ప్రభుత్వం తన సామ్రాజ్యవాద దోపిడి ప్రయోజనాలకు వాడుకున్నది. సామాన్య ప్రజలు బలైనారు. ఇది గత చరిత్ర ఇక వర్తమానం చూద్దాం.

ఏ రాజ్యానికైనా తన ఆర్థిక దోపిడి నిరంతరం కొనసాగడానికి ఒక మత్తు లాంటి భావాజాలం అవసరం. ఆ మత్తు మతం అని చరిత్ర నిరూపించింది. ఈ వెలుగులో ప్రపంచీకరణకు – మతోన్మాదానికి మధ్య గల పరస్పర సంబంధాన్ని పరిశీలిద్దాం.

**ప్రపంచీకరణ – మతోన్మాదం – పరస్పర సంబంధం**

ఉత్తర భారతదేశంలో 1980 చివర ఒక్కసారిగా పెల్లుబికిన హిందూత్వం 1990లో, 2000లలో తన క్రూరమైన ప్రస్థానాన్ని సాగిస్తూ క్రమంగా దేశం మొత్తం విస్తరించింది. అయితే 1990 దశకంలో దేశం పూర్తి స్థాయిలో ప్రపంచీకరణ ఊబిలోకి ప్రవేశించడానికి హిందూత్వం పెచ్చరిల్లడానికి (1992 బాబ్రి సంఘటనతో) మధ్యగల సంబంధాన్ని మనం పట్టి చూస్తే ఇక్కడ దొంగ దొరికిపోతాడు. ప్రపంచీకరణ కారణంగా విపరీతంగా పెరిగిపోతున్న దారిద్ర్యం, పేదరికం, నిరుద్యోగం, ఆకలి, రైతుల ఆత్మహత్యలు ప్రజలకు వ్యవస్థపై దీనికి మూలమైన ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పౌర ఉద్యమాలు, పోరాటాలు ఉద్భవించి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలు ఏర్పడే పరిస్థితులు వస్తాయి. ఈ పరిస్థితులు రాకుండా దీనిని నిలువరించడానికే హిందూత్వ శక్తులు అతి సున్నిత అంశమైన మతోన్మాదాన్ని రెచ్చగొట్టి రక్తపాతం సృష్టిస్తున్నాయి. తద్వారా ప్రజల ఆలోచనా దృక్పథాన్ని పక్కదారి పట్టించవచ్చు. దోపిడికి, పీడనకు గురయ్యే అశేష ప్రజానీకాన్ని అనైక్యంగా, బలహీనంగా మూఢ విశ్వాసాలతో పరస్పర కలహాలతో ఉండేటట్లు చేసి తమ పబ్బం గడుపుకోవడంతో పాటు దేశ ప్రజలను, వనరులను దేశీ, విదేశీ కార్పొరేట్ మహుళజాతి సంస్థలకు దోచిపెట్టవచ్చు. ఈ కుట్ర దేశంలో యథేచ్ఛగా కొనసాగడంలో భాగమే, నేటి ఈ హిందూ మతోన్మాద చర్యలు. దీనికి అమెరికా సామ్రాజ్యవాదం తన స్వార్థం కోసం భారతదేశంలో హిందూ మతోన్మాదానికి మద్దతునిచ్చి ఇక్కడ హిందూ ఫాసిజాన్ని నెలకొల్ప ప్రయత్నిస్తుంది. ప్రపంచమంతా మతం మత్తులో మునిగిపోతే సామ్రాజ్య వాదం తన దోపిడిని యథేచ్ఛగా కొనసాగించగలదు. ఇందుకు మత రాజ్యం ఏర్పడాలి. నియంతల పాలన కావాలి. దీనికి గాను అమెరికా ఆర్‌ఎస్‌ఎస్‌కు మిలియన్ల డాలర్ల ఆర్థిక సాయం అందిస్తున్నది. ఈ విషయాన్ని బిజు మాథ్యూ తన పరిశోధన ద్వారా బయటపెట్టారు. 'ది ప్రోటీన్ ఫార్మ్స్ ఆఫ్ యాంకీ హిందూత్వ' (అమెరికా హిందూత్వపు పౌష్టిక రూపాలు) అనే పుస్తకంలో, ఆయనే రాసిన మరో రచన 'టాక్సీ కాబ్స్ ఆండ్ కాపిటలిజం ఇన్ న్యూయార్క్' (కార్నెల్ యూనివర్సిటీ ప్రచురణ 2008)లలో ఈ విషయాలను చక్కగా వివరించారు. ఈ చట్రంలో నుంచి హిందూత్వాన్ని సైద్ధాంతికంగా విశ్లేషణ చేసుకుంటే విషయం క్షుణ్ణంగా బోధపడుతుంది. ఈ అవగాహనలో నుంచి రాబోయే దశాబ్దాలలో జరిగే పరిణామాలను అంచనా వేసుకుని వామపక్ష లౌకిక కార్యకర్తలు, మేధావులు, పౌరసమాజం ఈ అంశాలను అర్థం చేసుకోవాలి, పరిశీలించాలి. ముందు ముందు రాబోయే పెను సవాళ్లను ఎదుర్కొనేందుకు ఇది అత్యవసరం. తద్వారా హిందూత్వను ధీటుగా ఎదుర్కొని సుందర భారతావనిని నిర్మించాలి.

*(రచయిత ఉపాధ్యాయుడు)* వీ

# ఘర్ వాపసీ ఎవరి కోసం? ఎందుకోసం?

*భిన్న మతాలూ, సంస్కృతులూ ఉన్న భారతదేశంలో ఘర్‌వాపసీ పేరుతో ఆధిపత్య హిందూ మత సంస్థలు చరిత్ర పొడుగునా మైనారిటీ మతస్తులను బలవంతంగా మతమార్పిడి చేస్తూ అభద్రతకు గురిచేస్తున్నాయని అంటున్నారు* **బి. రామకృష్ణ**

**2014** డిసెంబర్ 10న ఆగ్రాలో ఘర్‌వాపసీ పేరుతో హిందూ మతంలోకి మత మార్పిడిలను జరిపిన సంఘటన దేశవ్యాప్త దృష్టిని ఆకర్షించింది. దీన్ని వ్యతిరేకించిన వారి నోళ్లు మూయించేందుకు మత మార్పిడిలను నిషేధిస్తూ రాజ్యాంగ సవరణ, చట్టాలు తీసుకురావాలని డిమాండ్ చేస్తున్నారు. బలవంతపు మత మార్పిడిలను నిషేధిస్తూ గతంలో మధ్యప్రదేశ్, ఒడిశా, అరుణాచల్ ప్రదేశ్, గుజరాత్, తమిళనాడులలో చట్టం చేశారు. తమిళనాడులో 2002లో జయలలిత ప్రభుత్వం చేసిన ఈ చట్టాన్ని 2004 మే 18న ఆర్డినెన్స్ ద్వారా రద్దు చేసింది. భారత రాజ్యాంగంలోని 25వ ఆర్టికల్ ప్రకారం మనసారా, ఆత్మసాక్షిగా నమ్మే విశ్వాసాలను, మత ప్రచారాలకు సంపూర్ణ స్వాతంత్ర్యమున్నది. దేశ ప్రజలందరికీ సరిసమానంగా తాము విశ్వసించే మతాన్ని, మతాచారాలను అనుభవించే స్వేచ్ఛ ఉన్నది. ఈ రాజ్యాంగ నిబంధన అంతర్లీనంగా బలవంతపు మత మార్పిడిలను వ్యతిరేకిస్తున్నదనేది స్పష్టమే. దీనికోసం ప్రత్యేకమైన చట్టాలేమి అవసరమేలేదనేది స్పష్టమే.

అధికార బలంతో, డబ్బుల ఆశచూపో, లేదా తదితర ప్రలోభాలతో హిందువులను ఆకర్షించి మత మార్పిడిలకు పాల్పడ్డారని చెపుతూ ఈ మార్పిడిలను నిషేధించాలని కొంత కాలంగా వాదిస్తున్నారు. నేడు ధర్మ జాగరణ సమితి (డిజెఎస్) అవే పునాదుల మీద మత మార్పిడిలను చేస్తున్నది. రేషన్ కార్డులు, ఆధార్ కార్డులు, డబ్బులు ఆశచూపి డిజెఎస్ వారు ఘర్ వాపసీని నిర్వహిస్తున్నారు. దీనికోసం అవసరమైన డబ్బులకు సంబంధించి ముస్లింలకైతే ఒక రేటు, క్రిస్టియన్లకైతే మరో రేటును నిర్ణయించారు. మత మార్పిడిలకు కావాల్సిన డబ్బులను విరాళాలుగా సేకరించుట కోసం ప్రచురించిన కరపత్రంలో ఉత్తరప్రదేశ్, బిహార్‌లలో ముస్లింలను మార్చడానికి ఒక లక్ష, క్రిస్టియన్లను మార్చడానికి మూడు లక్షలు అవసరమవుతాయని పేర్కొన్నారు. క్రిస్టియన్ సమాజానికి చర్చీలు, ఇతర సంబంధిత సంస్థలు మెరుగైన ఆర్థిక సహకారాన్ని అందిస్తున్నాయి. అలాంటి మెరుగైన పరిస్థితి ముస్లింలకు లేదని రాశారు.

ఇలాంటి మతమార్పిడిలను 'శుద్ధి కార్యక్రమం' పేరుతో అఖిల భారత హిందూ మహసభ 1920ల నుండే చేపట్టింది. 1923లో అఖిల భారత శుద్ధి సభను ప్రారంభించి ఆర్య సమాజ్ మద్దతుతో శుద్ధి కార్యక్రమాన్ని సాగించారు. 2021 చివరి వరకు దేశంలో ఏ ఒక్క ముస్లిం కాని, క్రిస్టియన్ కాని లేకుండా చేయడం, స్వచ్ఛమైన నిర్మాణాత్మకమైన భారత్‌ను తయారు చేయడం తమ లక్ష్యమని ధర్మ జాగరణ సమితి నాయకుడు రాజేశ్వర్‌సింగ్ సోలంకి ప్రకటించాడు. ఇతర మతస్థుల వారిని లేకుండా చేయడమంటే వారిని దేశం నుండి వెళ్లగొట్టడం కాదని, చెపుతాడు. వారంతా తెలుసుకోవాల్సింది ఏమంటే అసలు వారంతా హిందువులేనని వారు హిందూ విలువలకు, విధానాలకు కట్టుబడి ఉండాలని చెపుతాడు. పరోక్షంగా వారందరినీ హిందువులుగా మారుస్తామని చెప్పడమన్నమాట.

ఈ దేశంలోని క్రిస్టియన్లు, ముస్లింలందరూ కూడా మొదట్లో హిందువులేనని అంతే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా అరేబియా, ఆఫ్రికా, యూరప్ అంతా హిందువులేనని ఒకప్పుడు 700 కోట్లున్న హిందువులు నేడు 100 కోట్లకు కుదించబడ్డారని విశ్వహిందూ పరిషత్ నాయకుడు ప్రవీణ్ తొగాడియా ఎన్నో సభల్లో ప్రకటిస్తుంటాడు. బంగ్లాదేశ్‌లో హిందువుల సంఖ్య 30 శాతం నుండి 10 శాతానికి, పాకిస్తాన్‌లో 10 శాతం నుండి 1 శాతానికి తగ్గిపోయిందని కాకి లెక్కలు చెపుతుంటాడు. ఇవే పరిస్థితి కశ్మీర్, కేరళలో వస్తున్నాయని దీన్ని అడ్డుకోవాలని పిలుపునిస్తుంటాడు.

ప్రస్తుతం కేంద్రంలో అధికారం తమ చేతుల్లో ఉందని హిందూత్వ భావజాల విస్తరణకు ఇదే సరైన సమయమని భావిస్తున్నాయి. కాబట్టి ఘర్‌వాపసీ వంటి కార్యక్రమాలు బహిరంగంగానో, చాపకింద నీరులాగానో చేపట్టే దానిని వేగిరం చేస్తున్నాయి. ఆగ్ర మత మార్పిడి ఘటనలో వచ్చిన వ్యతిరేకతను దృష్టిలో పెట్టుకుని ఇక నుండి ప్రచార ఆర్భాటాలు లేకుండా నిర్వహించాలని భావిస్తున్నారు. గత పదిహేనేళ్లుగా నాలుగు లక్షల మందిని తిరిగి హిందూ మతంలోకి తెచ్చామని డిజెఎస్ నాయకుడు మీడియాతో చెప్పాడు. ఒక్క ఉత్తరప్రదేశ్ నుండే ఒకలక్ష మందిని మార్చామని చెప్పాడు. రాజస్థాన్‌లో పెద్ద సంఖ్యలో ముస్లింలు, మహారాష్ట్రలో వేలాది మంది క్రిస్టియన్లు హిందూ మతంలోకి వచ్చారని చెప్పాడు. ఈ మత మార్పిడిలకు సంబంధించి సిద్ధాంతపరమైన వేళ్లు హిందూ మహాసభ, ఆర్ఎస్ఎస్‌లలో ఉన్నాయి.

1920లలో హెగ్డేవార్ నాగ్‌పూర్‌లో ప్రారంభించాడు. దీని వెనుక బి.ఎస్. మూంజె ఆలోచనలు, సహకారాలు ఉన్నాయి. నియంతగా ప్రసిద్ధి గాంచిన ముస్సోలిని అనుసరించిన ఫాసిజం పట్ల గౌరవాదరణలతో ఉన్న బి.ఎస్. మూంజె 1931లో ఇటలీ వెళ్లి ముస్సోలిని కలిశాడు. ముస్సోలినితో తాను జరిపిన సంభాషణ వివరాలను తన డైరీలో రాసుకున్నాడు. అతడు స్థాపించిన ఫాసిస్టు సంస్థ బలిల్లాను మెచ్చుకున్నాడు. దానిపట్ల ఎంతో ఆసక్తిని ప్రదర్శించాడు. అలాంటి దాన్నే తాను మొదలు పెట్టానని ముస్సోలినితో బి.ఎస్. మూంజె చెప్పాడు. ఆ సంస్థే ఆర్ఎస్ఎస్. ఈ సంస్థ ఆధ్వర్యంలోనే హిందువులను సైనికీకరణ చేయాలని బలంగా విశ్వసించాడు. 1920 నుండి 1940ల కాలంలో తమ సంస్థాగతంగా హిందూత్వ సంస్థలు ముస్సోలిని రాతలను, భావాలను, ప్రచారంలో పెట్టి అనుసరించాయి. అందులో భాగంగానే పిల్లలను, యువకులను చేరదీసి మాస్‌డ్రిల్ వంటి వ్యాయామాలు, కర్రసాము, కత్తిసాము, ప్రత్యేక యూనిఫారమ్‌లతో మార్షల్ ఆర్ట్స్‌లలో శిక్షణ ఇవ్వడం మొదలు పెట్టారు. హెగ్డేవార్ మొదలు పెట్టిన ఈ కార్యకలాపాలను మహారాష్ట్ర అంతటా విస్తరింపచేస్తానని బి.ఎస్. మూంజె తన డైరీలో రాసుకున్నాడు. ముస్లింల పట్ల ద్వేష భావాన్ని పెంపొందిస్తూ

యువకులకు సైనిక శిక్షణ ఇవ్వడం ఆర్‌ఎస్‌ఎస్ సమర్ధవంతంగా నేటికీ కొనసాగిస్తూనే ఉన్నది.

ఆర్యజాతి గొప్పదని దాన్ని నిర్మించడానికి ఆర్యేతరులందరిని నిర్మూలిస్తామని, యూదు జాతిని అంతమొందించేందుకు మాటల్లో చెప్పలేని, క్రూరమైన, కిరాతకమైన జాతి హనన చర్యలను హిట్లర్ చేపట్టాడు. మూకుమ్మడిగా వందలాది మందిని గదుల్లో ఉంచి అందులోకి విషవాయువులను పంపి చంపడం, మూకుమ్మడిగా గోతుల్లో వేసి సజీవంగానే వారిని పూడ్చి చంపడం వంటి మరెన్నో అమానుషమైన చర్యలు చేపట్టాడు. హిట్లర్ పాటించిన నాజీయిజం చర్యలను అనుసరించడం సరైనదేనని హిందూ మహాసభ భావించింది. హిట్లర్ అనుసరించిన విధానాలతో సావర్కర్ నాయకత్వంలోని హిందూ మహాసభ విపరీతంగా ప్రభావితమైంది. భారతదేశంలో ముస్లింల పట్ల కూడా ఈ చర్యలు అవసరమేనని భావించారు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిగిన స్వాతంత్ర్య పోరాట కాలంలో ఆర్‌ఎస్‌ఎస్ కాని, హిందూ మహాసభలు కాని బ్రిటిష్ పాలకుల కంటే కూడా ముస్లింలను శత్రువులుగా, ప్రమాదకారులుగా చూశారు. హిందూ జాతి అనే భావనను బలంగా ముందుకు తేవడం, ముస్లింలను టార్గెట్ చేస్తూ హిందూత్వ శక్తులను సైనికీకరణ చేయడమనే లక్ష్యంతో హిందూత్వ శక్తులు ఆ కాలం నుండి నేటికీ పనిచేస్తున్నాయి. హిందూత్వ శక్తులు ముస్సోలిని, హిట్లర్‌ల దుర్మార్గమైన విధానాలను ఆలోచనలో తమ ఆచరణలో ముందుకు తీసుకుపోతున్నారు. ఈ నియంతలు ప్రపంచానికి, సమాజానికి ఎంత నష్టం చేశారో చరిత్ర చదివిన వారెవరైనా తెలుసుకోవచ్చు.

హెగ్దేవార్ తరువాత రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్‌ఎస్‌ఎస్)లో ప్రముఖ స్థానాన్ని గోల్వాల్కర్ ఆక్రమించాడు. గోల్వాల్కర్ మదన్ మోహన్ మాలవ్య స్థాపించి, నడిపించినా బెనారస్ హిందూ యూనివర్సిటీ (బిహెచ్‌యు)లో జీవశాస్త్రంలో పట్టభద్రుడైనాడు. ఆ తరువాత ఆ యూనివర్సిటీలోనే జంతుశాస్త్ర ఉపన్యాసకుడైనాడు. 1931లో హెగ్దేవార్ బిహెచ్‌యును సందర్శించిన సందర్భంలో గోల్వాల్కర్ ఆర్‌ఎస్‌ఎస్‌లో సభ్యుడైనాడు. తరువాత కాలంలో దాని సిద్ధాంత కర్తగా ఎదిగాడు. ఇక్కడ మదన్ మోహన్ మాలవ్యకు భారతరత్న బిరుదును ఇచ్చిన సందర్భంలో ఆయన గురించి కొంచెం చెప్పుకుందాం. ఇతడు హరిద్వార్‌లో 1887లో స్థాపించబడిన నాటినుండి భారత ధర్మ మహా మండలితో కలిసి పనిచేశాడు. 1910లో ఈ సంస్థను ప్రమాదకరమైనదిగా బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించడంతో దీనినుండి దూరంగా ఉన్నట్లున్నాడు కాని అప్పుడప్పుడు ఆ సంస్థ సమావేశాల్లో పాల్గొనేవాడు. 1880లో ప్రారంభించిన నాటినుండి ప్రయాగ హిందూ సమాజ్ అనే మిలిటెంట్ సంస్థలో చురుగ్గా పాల్గొన్నాడు. హిందూ పాఠశాలలను, విద్యా సంస్థలను నెలకొల్పాలని హిందీని జాతీయ అధికార భాషగా చేయాలని జాతీయ స్థాయిలో హిందూ జాతికి గుర్తింపు తేవడం వంటి కార్యక్రమాల్లో పాలు పంచుకున్నాడు. ఆ క్రమంలో బిహెచ్‌యును స్థాపించాడు. అది 1916 నుండి అధికారికంగా పనిచేయడం మొదలుపెట్టింది. 1919 నుండి 1939 వరకు బెనారస్ హిందూ యూనివర్సిటీకి మాలవ్య వైస్ ఛాన్స్‌లర్‌గా పనిచేశాడు. 1923లో హిందూ మహాసభకు అధ్యక్షుడిగా అయ్యాడు. క్షేత్ర స్థాయిలో హిందూ సంస్థలను స్థాపించడం, వాటిని విస్తరింపచేయడం, శుద్ధి కార్యక్రమాలు (నేటి ఘర్‌వాపసీ వంటివి) వంటివి చేశాడు. బిహెచ్‌యులో ఆర్‌ఎస్‌ఎస్ కార్యక్రమాలు సజావుగా జరగడానికి కావల్సిన పరిస్థితులను కల్పించాడు. బెనారస్ హిందూ యూనివర్సిటీ విద్యార్థులకు శారీరక వ్యాయామ శిక్షణ, సైనిక శిక్షణ ఇవ్వడంలో ప్రముఖ పాత్రను నిర్వహించింది. ఈ నేపథ్యంలో మొన్న డిసెంబర్‌లో నరేంద్రమోడీ ప్రభుత్వం మదన్ మోహన్ మాలవ్యకు భారతరత్న అవార్డును ఎందుకిచ్చిందో అర్థం చేసుకోవచ్చు.

హిందుస్థాన్‌లో ఉన్న విదేశీ జాతుల హిందూ సంస్కృతిని, భాషను అలవర్చుకోవాలి. హిందూ మతం పట్ల భయ భక్తులతో, గౌరవ భావంతో, భక్తి శ్రద్ధలతో ఉంటూ హిందూ జాతిని, దాని సంస్కృతిని కీర్తిస్తుండడంతో పాటు, తమ ప్రత్యేక అస్తిత్వ గుర్తింపులను కోల్పోయి హిందూ జాతిలో కలిసిపోవడమో లేదా హిందూ దేశంలో తక్కువ స్థాయి వారిగా గుర్తించబడుతూ కనీస హక్కులను కూడా నోచుకోకుండా బతకాలనే వాదనను 1939లో గోల్వాల్కర్ ముందుకు తెచ్చాడు. ఆ తరువాత ఇదే గోల్వాల్కర్ 1966లో 'బంచ్ ఆఫ్ థాట్' అనే పుస్తకాన్ని తెచ్చాడు. అందులో అతని ఆలోచనలను ఇలా రాశాడు. గుప్పెడు మంది ముస్లింలు శత్రువులుగా దండెత్తి ఈ దేశంలోకి వచ్చారు. కొన్ని విదేశీ క్రిస్టియన్ మిషనరీలు దేశంలోకి ప్రవేశించాయి. ఇలా వచ్చిన ముస్లింలు, క్రిస్టియన్లు కేవలం వారుగా మాత్రమే ఇంత పెద్ద మొత్తం జనాభాలుగా పెరగడం జరగదు. అది స్థానిక ప్రజలను మత మార్పిడిలు చేయడం ద్వారానే సాధ్యమైంది. హిందూ మతం నుండి కొంతమందిని ముస్లింలుగా, క్రిస్టియన్లుగా మార్చారు. మిగిలినవారు హిందువులుగా ఉండిపోయారు. ఇలా ఇతర మతాల్లోకి వెళ్లి ఒంటరిగా, సంతోషాలు లేకుండా ఉంటూ మత బానిసత్వంతో బాధపడుతున్న వారిని తిరిగి పూర్వ స్థానం (అన్‌సెస్ట్రల్ హోమ్)లోకి రమ్మని పిలవాలి. నిజాయితీగా స్వేచ్ఛను ప్రేమించే మనుషులుగా, అన్ని రకాల బానిసత్వాలను, ఆధిపత్యాలను వదిలి వారి పూర్వపు భక్తి పూర్వక జాతీయ జీవితాన్ని (నేషనల్ లైఫ్) గడపడానికి నిరర్థకమైన జీవితం గడుపుతున్న మన సమాజపు పూర్వ పుత్రులను ఆహ్వానించాలి. వారు తిరిగి వచ్చిన సందర్భాలను గొప్ప దీపావళి సంబరాలుగా చేసుకోవాలి. ఇలా వెనక్కి వచ్చిన దుస్తులు, సంప్రదాయాలు, పెళ్లి వేడుకలు, అంతిమ సంస్కారాలు వంటి ఇతర హిందూ జీవన విధానాలను పాటించాలి. వాటిచేత గుర్తించబడాలి. అని కోరుకుంటాడు గోల్వాల్కర్. ఇలాంటి వాదనలనే వి.డి. సావర్కర్ 1923లో ముందుకు తెచ్చాడు. వీరి ఆలోచనలు ప్రస్తుతం ఆర్‌ఎస్‌ఎస్‌కు ప్రాణప్రదం.

హిందూ మతం తప్ప మరే ఇతర మతాలు, జాతులు, వర్గాలు, సంస్కృతులు ఈ దేశంలో ఉండడానికి వీలులేదని, ఉండాలంటే కచ్చితంగా అందరూ హిందూత్వాన్ని పాటించాల్సిందేననే నిరంకుశ ధోరణులతో, వ్యూహాలతో హిందూత్వ శక్తులు పనిచేస్తున్నాయి. హెగ్దేవార్, గోల్వాల్కర్, సావర్కర్‌ల విచ్ఛిన్నకర, ప్రమాదకర, వినాశకర ఆలోచనలతో, కనుసన్నల్లో నడుస్తున్న హిందూత్వ శక్తుల అమ్ముల పొది నుంచి విసరబడిన బాణమే ఈ ఘర్‌వాపసీ.

ఆర్‌ఎస్‌ఎస్ దాని సిద్ధాంత శక్తులు హెగ్దేవార్, బి.ఎస్. మూంజె, సావర్కర్, గోల్వాల్కర్ తదితరులు అంత గొప్పగా కీర్తించే హిందూ మత విశ్వాసాలు, ఆచరణల్లో ఏమున్నది. అవి నిజంగా ప్రజల్లో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను, సమానత్వాలను నింపడానికి పనికొస్తుందా? వీటికి అంబేద్కర్ ఎప్పుడో సమాధానాలు చెప్పాడు. నిచ్చెన మెట్ల కుల వ్యవస్థను పాటించే హిందూ మతం, కర్మ సిద్ధాంతాన్ని మనసా వాచ కర్మణే నమ్మే హిందూత్వం సమాజంలోని అసమానతలు సహజమేనని, ఎవరి తలరాతలను బట్టి వారి వారి పనులు నిర్ణయించబడతాయని, విధిని ఎవరూ అధిగమించలేరని చెపుతున్నది. హిందూ మతంలోని

అపవ్రతలను మనిషిని మనిషిగా గుర్తించలేని క్రూరమైన ఆచారాలను, జీవన పద్ధతులను అంబేద్కర్ తీవ్రంగా నిరసించాడు. దానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఉద్యమించాడు. అంబేద్కర్ కంటే ముందు మహారాష్ట్రలో జోతిబాపూలే హిందూ మతాన్ని, బ్రాహ్మణిజాన్ని సవాల్ చేశాడు. అంబేద్కర్ విస్తృత అధ్యయనం, పరిశోధనలు చేసి భారతదేశంలో హిందూ మత దుర్మార్గాలపైన విస్తారమైన రచనలు చేశాడు. 'నేను అంటరానివానిగా పుట్టడం నా తప్పు కాదు. కాని నేను హిందువుగా మాత్రం మరణించను' అని ధైర్యంగా ప్రకటించి 1954 అక్టోబర్ 14న బౌద్ధాన్ని స్వీకరించాడు. అంబేద్కర్ రచనల్లో అధిక భాగం హిందూ మత దాష్టీకాలను చూడవచ్చు. ఈ మతం ఒక్కో కులానికి ఒక్కో పనివిధానాలను, న్యాయన్యాయాలను సమర్థించింది. అంటరాని తనమనే అమానుషాన్ని పాటిస్తూ వచ్చింది. పుట్టినప్పటి నుండి ఎప్పుడెప్పుడు ఎవరెవరు ఏమి చేయాలో ముందే నిర్దేశించి పెట్టింది. అగ్రకులాల వారు కిందిస్థాయి అవమానకర, అగౌరవకర పనులను చేయకుండా కేవలం కింది కులాలవారే చేసేలా అదీ కూడా పూర్వజన్మ ఫలితమని సమర్థిస్తూ నీచమైన వాదనలను ముందుకు తెచ్చింది. ఏ మాలో, మాదిగో, చాకలో, మంగలో, పాకీపని చేసేవారో పూజారి అయ్యే పరిస్థితి ఉంటుందా? అది నేటికి సాధ్యం కాని విషయమే. వీటన్నింటిని పూలే, అంబేద్కర్, పెరియర్ తదితరులు చీల్చి చెండాడారు. వీరి ప్రశ్నలకు, హిందూత్వ శక్తులు ఏమి సమాధానం చెప్పలేకపోతున్నాయి. కాని ఘర్‌వాపసీ పేరుతో మత విద్వేషాలను రెచ్చగొడుతూ దేశంలోని మైనారిటీ మతస్థులను, జాతులను, అభద్రత భావంలోకి నెట్టేస్తున్నారు.

హిందూ మతంలో శూద్రులుగా, అతి శూద్రులుగా, అంటరాని వారుగా, జ్ఞానానికి, సమానత్వానికి, విద్యకు, గౌరవప్రదమైన జీవితానికి దూరం చేయబడి బానిసత్వంలో, ఆత్మగౌరవంలేని కడు హీనమైన, దయనీయమైన బతుకులీడుస్తున్న వారికి ఇస్లాం కాని, క్రైస్తవం కాని ఎంతో ఆసరాను, స్వాంతనను, గౌరవాన్ని ఇచ్చాయి. ఒక రకంగా చెప్పాలంటే వారికి హిందూ మత భల్లూక పట్టు నుండి, ధృతరాష్ట్ర కౌగిలి నుండి, ఈ మతాలు వారికి స్వేచ్ఛనిచ్చాయి. హిందూ మతంలోని వారందరూ ఏనాడు ఒకటిగా పరిగణించబడలేదు. రకరకాలుగా, ఉపకులాలుగా విభజింపబడి ఉన్నారు. దుర్భరమైన అన్యాయాలను, అరాచకాలను, సాంఘిక వివక్షతలను భరించలేని కొందరు, నిమ్న కులాలవారు ఇతర మతాల్లోకి వెళ్లారు. ఘర్‌వాపసీ కార్యక్రమం ద్వారా తిరిగి మత మార్పిడి చేసిన వారిని ఏ స్థాయిల్లో, ఏ మూలాల్లో ఫిక్స్ చేస్తారు? వేటిలోనైతే అవమానకరంగా, అగౌరవకరంగా చూడబడ్డారో ఆ పూర్వపు కులాల్లోకి పంపిస్తారా? లేక హిందూ మతంలోని గొప్పగా చూడబడే బ్రాహ్మణులుగా చెలామణి చేస్తారా? వారికి ఏ హోదానిస్తారు? ఏ గౌరవ ప్రదమైన కులంలోకి పంపిస్తారు? ఏ బ్రాహ్మణుడైనా వీరిని తమతో సమానంగా అక్కున చేర్చుకుంటారా? తేలాల్సి ఉన్నది. ఏ మతమైనా నమ్మకాల, విశ్వాసాల పునాదులపైనే నిర్మించబడ్డాయి. ప్రకృతిని, దాని నియమాలను అర్థం చేసుకోవడానికి కేవలం నమ్మకాలు, విశ్వాసాలు పనికి రావు. కచ్చితమై శాస్త్రీయ ఆధారాలు, రుజువులు అవసరమవుతాయి. విశ్వాసాలు వేరు, యాధృచ్ఛికతలు వేరు, వాస్తవాలు వేరు. సార్వత్రిక సత్యాలు వేరు. ప్రపంచ చరిత్రలో మత విశ్వాసాలను సవాల్ చేస్తూ శాస్త్రీయ ఆధారాలతో, ప్రయోగ రుజువులతో సత్యాలను చెప్పిన, నిరూపించిన ఎందరో శాస్త్ర వేత్తలను చంపిన సందర్భాలెన్నో ఉన్నాయి. మతాలు బయటకు ఎంతగా సహసం, ఓపిక, విశ్వ కళ్యాణం, సమానత్వం, మంచితనం, నిరాడంబరత అని చెప్పినప్పటికీ శాస్త్రవేత్తలను ప్రశ్నించిన గొంతుకలను నిర్దాక్షిణ్యంగా చంపడం, అంతమొందించడం ద్వారా వాటి క్రూరత్వంను బయట పెట్టుకున్నాయి. మతాల విస్తరణలు, మత ఘర్షణలు, మత మారణహోమాలు, మత మార్పిడిలు, బలవంతపు మత మార్పిడిలు జరుగుతున్న నేపథ్యంలో కొన్ని ప్రశ్నలు తలెత్తక మానవు. అసలు మతాలు లేకుండా మనిషి లేడా? మతంతోనే మనిషి పుట్టాడా? మనిషి చేత మతాలు సృష్టించబడ్డాయా? మతాలచే మనుషులు సృష్టించబడ్డారా? ఏ మతమైన దైవాన్ని దైవ ఆధిపత్యాన్ని, అంగీకరిస్తాయి కదా! ఆ దైవం దృష్టిలో మనుషులందరూ సమానమే కదా మతాల భావన. వివిధ మతాల ప్రకారం ఒక్కో మతానికి ఒక్కో దేవుడున్నాడా? అంత దైవమయమే దైవాధీనమే అయినప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అసమానతలు, అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు, నేరాలు, హత్యలు, అత్యాచారాలు మొదలగునవి అన్నీ కూడా ఆ దైవం అధీనంలోనే, ఆజ్ఞలతోనే జరుగుతున్నాయని అనుకోవాల్సి వస్తుంది. అలాంటప్పుడు ఆ దైవం ఎంత క్రూరమైనదో మరి.

ఒక్కో దైవం ఒక్కో ఆచారాలను సృష్టించాడా? భిన్న ఆచారాలను, జాతుల, మతాల మధ్య కొట్లాటలు పెట్టి ఆనందిస్తున్నాడా? అసలు మనుషుల బుర్రల్లో చెడు స్వభావాన్ని ఎందుకు కలిగిస్తున్నట్లు? ఒకరిని హింసించి, బాధించి, వేధించి, అవమానించి తమ సుఖాల కోసం మరొకరిని బలితీసుకోవడం అనే దుష్టతలంపులను ఎందుకు ఎక్కిస్తున్నట్లు? ఇవి అమాయక ప్రశ్నల్లాగే అనిపించవచ్చు. కాని ఈ సందర్భంలోనే కాదు ఎప్పుడైనా అడగవల్సిన ప్రశ్నలే. ఈ నేపథ్యంలో మనుషులను దైవం సృష్టించిందా? లేదా దైవంను మనుషులే సృష్టించారా? అని అడగవల్సి ఉన్నది.

సమాజంలో చెడును సృష్టించడమెందుకు? దానిచేత ఎందరినో హింసించడమెందుకు? దాన్ని తిరిగి అంతమొందించేందుకు మరికొందరిని సృష్టించడమెందుకు? ఈ నాటకమంతా ఆడడమెందుకు? ఈ నాటకంలో ఎందరో అమాయకులు బలవ్వడం దేనికి? ఇంతలా దుర్మార్గాలను ప్రోత్సహించి, దుర్మార్గులను, అవినీతి పరులను సృష్టించిన దైవం దుర్మార్గులకు, దుష్టులకు ప్రతినిధిగా మిగిలిపోతున్నదని ఎవరైనా అంటే వివిధ మతావలంబకులకు, దైవ విశ్వాసులకు కోపం వస్తుందేమో. తమ విశ్వాసాలను, తమ దైవాన్ని కించపరుస్తున్నారని తమ దైవాన్ని రక్షించుకోవడం కోసం ఆయుధాలు చేపట్టి ఇలా అన్నవారిని తుదముట్టిస్తారు కావచ్చు. తాము నమ్మే, తమను రక్షించే దైవాన్ని రక్షించుకునేందుకు వీరావేశాలతో బయలుదేరతారు కాబోలు. ఈ సందర్భంలో మరో ప్రశ్న వస్తుంది. మనుషులను దైవం రక్షిస్తుందా? దైవాన్ని మనుషులు రక్షిస్తారా?

ఇటీవల విడుదలైన హిందీ సినిమా పికెలో గ్రహాంతర వాసి పాత్ర ఏ మనిషిపైనా ఏమైనా మత ముద్రలున్నాయా? ఉంటాయా? అని తన బట్టలనూడదీస్తూ మిగతా అందరిని అలాగే చూపమని అడుగుతాడు. ఆసుపత్రిలోని శిశువుల శరీరాలను టార్చివేసి పరిశీలిస్తాడు. ఎందుకని అంటే వారి శరీరాలపై ఏమైన మత ముద్రలన్నాయేమో చూస్తున్నానని అంటాడు. తమ ధర్మాన్ని, దేవున్ని రక్షించుకుంటామని అన్న వాడని, అసలు నీ శక్తెంత? ఈ విశ్వాన్ని సృష్టించిన దైవాన్ని రక్షించగలవా? అనే ప్రశ్నతో అతని నోరు మూయిస్తాడు. అయాయకుడిలా ఇలాంటి అనేక ప్రశ్నలను గ్రహాంతర వాసి పాత్రలో వేయించి తీసిన చిత్రంపైన హిందూత్వ శక్తులు దాడులు చేశాయి. దాన్ని నిషేధించమని డిమాండ్ చేశాయి. ఈ సినిమా గురించి సెన్సార్ బోర్డు సభ్యులపై వత్తిడిని ప్రభుత్వ

# బడ్జెట్ అంటే ఏమిటి?

*రాబోయే రెండు నెలల్లో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ప్రవేశపెట్టనున్న బడ్జెట్లను ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తున్నారు*

**వి. హనుమంతరావు**

బడ్జెట్ల సీజన్ వచ్చేసింది. ప్రజలంతా ఏం పన్నులు వేస్తారోనని భయపడే సీజన్ కూడా ఇదే. విభజన ముందు ఆంధ్రప్రదేశ్‌లో ఈ భయం ఉండేదికాదు. ఎందుచేతనంటే సంవత్సరం పొడవునా ఎపుడుపడితే అప్పుడు పన్నులు వేయడం అలవాటు. పన్నులు విధించేది ప్రజలకు సౌకర్యాలు కలగజేయడానికని చట్టం చెబుతుంది. కాని ప్రపంచ బ్యాంకు పుణ్యమా అంటూ అవే సైకర్యాల కల్పనకోసం యూసర్ ఛార్జీల పేరుతో ఏడా పెడా వడ్డించడం ప్రారంభమైంది. ఇవికాక పార్లమెంటులో కేంద్ర బడ్జెట్‌లో వడ్డింపులు మనది హిందూ దేశమని బిజెపి పాలకులు అంటున్నారు కాని పన్నుల భారతం అంటే సరిగ్గానప్పుతుంది. ఇలా ఇటు రాష్ట్రం, అటు కేంద్రం వడ్డీస్తూ పోతున్నాయంటే ప్రజలుగా మన చేతకాని తనం అనే చెప్పాలి. స్వతంత్ర పోరాటంలో మనతాతలు, తండ్రులు పన్నులు చెల్లించబోమంటూ పన్ను నిరాకరణ ఉద్యమాలను నడిపి జైళ్ల కెళ్లారు. మనమేమో ఎందుకు లెండి. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది.

బడ్జెట్ అంటే చాలా మందికి ఎలర్జీ. దాని నిండా ఏవేవో గణాంకాలు, శాతాలు, కూడికలు, తీసివేతలు ఉంటాయి. ఏమీ అర్థం కావు. నాకు అలాగే అనిపించేది. మరికొంత మందికి ప్రభుత్వం తప్పుడు లెక్కలిస్తుంది, అలాంటి లెక్కల ఆధారంగా వ్యాసాలు రాయడమేమిటి ప్రజలను తప్పుదారి పట్టిస్తాయని అంటారు. కాని ఆ అంకెలను అర్థం చేసుకోగలిగితే మన తలరాత ఎలా ఉండబోతుందో అర్థమైపోతుంది. అసలు బడ్జెట్ అంటే ఏమిటి? ఉదాహరణకు మీ ఇంటో మీ అమ్మాయికి వివాహం చేయాలి. ఎంత ఖర్చుచేయాలి. మీ దగ్గర డబ్బు చాలదు. ఏం చేయాలి. ఎవరి వద్ద అప్పు తేవాలి? ఏ ఖర్చు తగ్గించాలి అంటూ లెక్కలు వేసుకొంటూ రాలేదా? బడ్జెట్ అంటే అంతే. ఇది మీ వ్యక్తిగత బడ్జెట్, ప్రభుత్వం మొత్తం రాష్ట్రానికి, దేశానికి ఎంత ఆదాయం, ఎంత ఖర్చు, లేటూ, మిగులూ అని లెక్కలువేస్తుంది. అదే బడ్జెట్. కొంచెం వివరాల్లోకి పోదాం.

ఈ ద్రవ్య వ్యవహారాలను అర్థం చేసుకోవాల్సినపుడు వచ్చే సంవత్సరంలో ఎంత ఆదాయం, ఎంత ఖర్చు అని లెక్కలు వేస్తుంది. ఆదాయంలో రెండు ప్రధాన పద్దులను ఖర్చులో మూడు ప్రధాన పద్దులను లెక్కవేస్తారు. ఆదాయంలో రెవెన్యూ రాబడి, మూలధన రాబడి అని విభజిస్తారు. రెవెన్యూ రాబడి కింద కేంద్ర పన్నుల్లో వాటా, సొంత

---

తెచ్చినందుకు నిరసనగా కొందరు సభ్యులు రాజీనామా కూడా చేశారు. అయితే ఈ సినిమా కోట్ల రూపాయల వసూళ్లను చేసి నిర్మాతకు కాసుల వర్షం కురిపించిందన్నది వేరే విషయమనుకోండి.

విహెచ్‌పి లాంటి సంస్థల అధినేతలు ఈ దేశమే కాదు మొత్తం ప్రపంచ ప్రజలంతా హిందువులేననే స్థాయికి వెళ్లారు. దీనికి ప్రతిగా మజ్లిస్ పార్టీ (ఎంఐఎం) నాయకుడు అసదుద్దీన్ ఓవైసి పుట్టిన ప్రతిబిడ్డా ముస్లింగానే పుడతాడని అంటాడు. ఇలా ప్రతి మతం అంటూ పోతుంటే ఎవరు ఏ మతమో ఎవరు నిర్ణయించాలి? ఓ భగవాన్ నీవెక్కడ అని పికె సినిమాలో అమీర్‌ఖాన్ వెతికినట్లుగా వెతుక్కోవాలేమో? అమీర్‌ఖాన్‌కు ఆ భగవాన్ దొరకనట్లుగానే ఎవరికీ చిక్కకుండా ఉంటాడేమో? మా మతంలో చేరండని ఒకరు, మా మతంలో చేరండని మరొకరు ప్రబోధిస్తున్నారు. మత మార్పిడిలను నయానో, నజరానాలతోనో, దౌర్జన్యాలతోనో, భయ భ్రాంతులకు గురిచేసి ప్రోత్సహిస్తున్నారు. గత ఎన్నో దశాబ్దాలుగా మత విద్వేష రాజకీయాలను పెంచి పోషించి దేశ వ్యాప్తంగా రథయాత్రలు జరిపి మతకల్లోలాలను సృష్టించి, ఏ చిన్న ఘర్షణనైనా మతం రంగు పులిమి పెద్దదిచేసి రాజకీయ లబ్ధిని పొందుతూ వస్తున్నది బిజెపి. 1999 – 2004ల కాలంలో వాజ్‌పేయి ప్రధానిగా ఎన్‌డిఎ పేరుమీద బిజెపి ప్రభుత్వం నడిపింది. 2014లో పూర్తి స్వతంత్ర మెజారిటీతో నరేంద్రమోడీ ప్రధానిగా బిజెపి అధికారంలోకి వచ్చింది. ప్రస్తుతం సంఘ్‌పరివార్ ప్రభుత్వం అధికారంలో ఉన్నది. ఇక దాని ఎజెండాను అమలు చేయడానికి రాజకీయాధికార అవకాశం వచ్చింది. హిందూ – ముస్లింలు కలిసి మెలసి ఉండాలని (మనస్ఫూర్తిగానో, మొక్కుబడిగానో ఏదైతే నేమి) అన్న గాంధీని సహించలేదు హిందూత్వ శక్తులు. భారతదేశంలో ఎంతో పేరు ప్రఖ్యాతలున్న గాంధీని, గాడ్సే రూపంలో హత్య చేశారు. అప్పటి ప్రధాని నెహ్రూకు 1948 ఫిబ్రవరి 27న అప్పటి హోం మంత్రి పటేల్, గాంధీ హత్యకు సంబంధించి వివరాలతో ఉత్తరం రాశాడు. ఇంటలిజెన్స్ బ్యూరో డైరెక్టర్ పిళ్లైతో మాట్లాడిన విషయాలను చెపుతూ, ప్రధాన నిందితులు ఇచ్చిన వివరణాత్మక స్టేట్‌మెంట్లలో గాంధీ హత్యకు కారణం హిందూ మహాసభలోని తీవ్రవాద సెక్షన్ అని దానికి వి.డి. సావర్కర్ నేతృత్వంలో కుట్రచేసి అమలు చేయబడిందని తెలియ వచ్చిందని వివరించాడు. ఇటువంటి హిందూత్వ శక్తుల అజెండాతోనే ఘర్‌వాపసీ కార్యక్రమం నడుస్తున్నది. గోల్వాల్కర్, సావర్కర్‌ల వినాశకర భావాలను, ఈ దేశంలో హిందువులు తప్ప మరే మతస్థులు ముస్లింలు, క్రైస్తవులు అలాగే కమ్యూనిస్టులు ఉండడానికి వీలులేదనే ఎజెండాతో నడుస్తున్నది. ఇంతలా వినాశకరమైన భావజాలాన్ని వ్యాపింప చేస్తూ, విద్వేషాలను రెచ్చగొట్టి నాజీ, ఫాసిజాన్ని నెలకొల్పాలనుకుంటున్న హిందూత్వ శక్తులను భావజాల పరులుగా, రాజకీయంగా ఏకాకులను చేయడానికి ప్రజాస్వామిక శక్తుల ఐక్యత, కార్యాచరణ నేడెంతో అవసరం.

*(రచయిత ఉపాధ్యాయుడు)* వీ

పన్నుల రాబడి, పన్నేతర రాబడి, సహాయ గ్రాంట్లు అనే నాలుగు ఉప పద్దులుంటాయి. మూలధన రాబడి కింద బహిరంగ మార్కెట్ రుణాలు, తాత్కాలిక రుణాలు, కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు, ఇతర రుణాలు వగైరా ఎనిమిది ఉప పద్దులుంటాయి. అయితే ఈ పన్నులు ఎన్ని, ఏవేవి ఉండాలో నిర్దిష్టమైన సూత్రాలు గాని, ప్రాతిపదికలు గాని ఏమీలేవు. అయితే సాధారణంగా ద్రవ్య విధానానికి సంబంధించిన సైద్ధాంతిక అవగాహన ప్రకారం రెవెన్యూ రాబడి అంటే ఏ ఏటి కాయేదు తాత్కాలికంగా వచ్చేది గాను, మూలధన రాబడి దీర్ఘకాలికమైన దానిగాను గుర్తించడం జరుగుతుంది. కాని ఈ సైద్ధాంతిక అవగాహన కూడా ఈ మధ్య కాలంలో కచ్చితంగా అమలులోకి రావడంలేదు.

ఇక వ్యయం కింద ఉండే మూడు ప్రధాన పద్దులు ప్రణాళికా వ్యయం, ప్రణాళికేతర వ్యయం, మూలధనం చెల్లింపులు అనేవి. అయితే మోడీ ప్రభుత్వం ప్రణాళికనే రద్దుచేసింది. దాని స్థానే వచ్చిన నూతన విధానం ఇంకా నిర్దిష్టమైన స్వరూపం తీసుకోలేదు. ఈ మౌలికమైన, సరళమైన ఆదాయ వ్యయాలను సంక్లిష్టంగా మార్చి రెవెన్యూ లోటు, ద్రవ్య లూటు, ప్రాథమిక లోటు, బడ్జెట్ లోటు వంటి వేర్వేరు భావనలను సృష్టించి లోటు పరిణామాన్ని మసిపూసి మారుడుకాయ చేయడానికికే ఈ గందరగోళం ఉపయోగపడుతుంది. అలాగే ఉన్నా ద్రవ్య వ్యవహారాలను అర్థం చేసుకోవడానికి ఈ భావనల మీద ప్రభుత్వం బడ్జెట్ గణాంలు ఇచ్చే అంకెల మీద ఆధారపడక తప్పదని గ్రహించాలి.

ద్రవ్య వ్యవహారాల గురించి, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య విషయాల్లో సాగుతున్న పరిణామాల గురించి విశ్లేషించబోయే ముందు రాష్ట్ర స్థూల ఉత్పత్తి రాష్ట్ర నికర ఉత్పత్తి, తలసరి ఆదాయం వంటి భావనలను పరిశీలించాలి. జాతీయదాయం జాతీయోత్పత్తి, రాష్ట్ర నికర ఉత్పతి, తలసరి ఆదాయం వంటి విషయాలను గురించి అర్థం చేసుకోవాలి. జాతీయాదాయం, జాతీయోత్పత్తి అనే దేశానికంతా వర్తించే భావనలను రాష్ట్రానికి వర్తింపచేసి రాష్ట్ర స్థూల ఉత్పత్తి (జిఎస్‌డిపి) అనే భావనను, దానిలో పునారావృతమైన పద్దులను, విలువల చేర్పులను తొలగించి రాష్ట్ర నికర ఉత్పత్తి (ఎన్ఎస్‌డిపి) అనే భావనను తయారు చేశారు. ఈ నికర ఉత్పత్తిని జన సంఖ్యతో భాగించినప్పుడు వచ్చే అంకెను తలసరి ఆదాయం అంటారు.

ఒక సంవత్సర కాలంలో ఒక రాష్ట్రంలో జరిగిన అన్ని కార్యకలాపాలలో ఉత్పత్తి అయిన సరకుల సేవల విలువల మొత్తాన్ని స్థూల ఉత్పత్తి అనవచ్చు. అయితే ప్రతీ సరుకులోను, సేవలలోను, మరెన్నో సేవలలోను మరెన్నో సేవలు, సరుకులు, సేవలు నిక్షప్తమై ఉంటాయి. అటువంటప్పుడు వాటి విలువలు లెక్కింపులో పునరుక్తికి గాని విస్మరణకు గాని అవకాశం ఉంటుంది. అంతేకాక రాష్ట్రాలకు మధ్య సరకుల సేవల రవాణాకు, వినిమయానికి ఎంతో అవకాశముంది. అది కూడా స్థూల ఉత్పత్తి లెక్కింపులో ప్రభావం చూపుతుంది. మరొక విషయం ప్రతీ సంవత్సరం ఉత్పత్తి మొత్తం అదే స్థాయిలో ఉంటుంది కాని ధరల పెరుగుదల వల్ల ఉత్పత్తి మొత్తం విలువ పెరుగుతుంది. అందువల్ల జిడిపి పెరుగుతుంది. కాని వాస్తవంలో పెరగదు. ఈ అంకెలు మొత్తం ఆర్థిక వ్యవస్థను పరిగణలోకి తీసుకొని అసమానతలను అస్పష్టం చేసి సగటు అంచనాలకు వస్తాయని, అందువల్ల కొన్ని వేల మంది సంపన్నుల ఆస్తులను, కొన్ని కోట్ల మంది ఆస్తిలేని నిరుపేదల ఆస్తులను ఒకేగాటన కట్టి మొత్తం సమాజం స్థూల ఆదాయంగా ప్రకటించి, తలసరి ఆదాయాన్ని లెక్కవేస్తాయి. అందువల్ల ఏ ఆదాయం లేని నిరుపేదల సగటు ఆదాయం వాస్తవంలో పెరగకపోయినా, భావనాత్మకంగా పెరుగుదల చూపిస్తుంది. ఇటువంటి భావనాత్మక పెరుగుదలల ఆధారంగా గుండు గుత్త మొత్తం అంకెల ద్వారా పెరుగుదల రేట్లను లెక్కకట్టినప్పుడు కూడా విశ్వసనీయత తగ్గుతుంది. ఒక ఆర్థిక వ్యవస్థ ప్రగతిని ఇటువంటి అభివృద్ధి రేటుతో గుర్తించడం జరుగుతుంది కాని ఆ అభివృద్ధి రేట్లు నిజంగా అట్టడుగు ప్రజానీకం జీవిత ప్రమాణాలకు సూచికలు కాజాలవు. ఈ అంకెల గారడిలను, భావనల అవాస్తవికతను అవిశ్వసనీయతను దృష్టిలో ఉంచుకొంటూనే, అంతకన్నా సవ్యమైన అంకెలు, భావనలు, సఖ్యాత్మక వ్యక్తీకరణలు లేకపోవడంవల్లే వాటి మీదనే ఆధారపడి ద్రవ్య వ్యవహారాలను విశ్వసించాల్సి ఉంది.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ విషయానికి వస్తే మొట్ట మొదటి ఆదాయం కింద రెండు ప్రధాన పద్దులుంటాయి. వాటిలో మొదటిదైన రెవెన్యూ రాబడి కింద కేంద్ర పన్నుల్లో వాటా, సొంతపన్ను రాబడి, పన్నేతర రాబడి, సహాయక గ్రాంట్లు అనే నాలుగు ఉప పద్దులుంటాయి. కేంద్ర పన్నుల్లో రాష్ట్రాల వాటా అనేది భారత రాజ్యాంగపు ఫెడరల్ వ్యవస్థలో నిర్మాణంలో భాగం. అయిదేళ్లకు ఒకసారి కేంద్ర ప్రభుత్వం నిఆయమించే ఆర్థిక సంఘం సిఫార్సుల మేరకు రాష్ట్రాలకు ఎంత వాటా ఇవ్వాలనేది నిర్ణయిస్తుంది. కేంద్ర ప్రభుత్వం ప్రధానంగా ఆదాయ పన్ను, సెంట్రల్ ఎక్సైజ్ సుంకాలు, కార్పొరేట్ పన్నుల మొదలయిన పన్నులు వసూలు చేస్తుంది. ఈ పన్నులన్నిటిలోనూ రాష్ట్రాకు వాటా ఉంటుంది. ఇక నాలుగో ఉప పద్దు అయిన సహాయక గ్రాంటులు కూడా రాష్ట్రానికి కేంద్రం నుంచి అందేవే. ఈ సహాయ గ్రాంట్లు ప్రధానంగా ప్రణాళికేతర గ్రాంట్లు, కేంద్ర ప్రణాళిక అమలుకు గ్రాంట్లు, కేంద్ర ప్రతిపాదిత ప్రణాళిక పథకాలకు గ్రాంట్లు అనేవి నాలుగు రకాలుగా ఉంటాయి. ప్రణాళికా సంఘం రద్దుతో, కేంద్రం నుంచి వచ్చే నిధుల్లో ఎటువంటి మార్పులొస్తాయో వేచి చూడాలి. అంతేకాక కేంద్రం నిధుల కొరతతో కుస్తీ పడుతున్న పరిస్థితులు కూడా రాష్ట్రాలకు వచ్చే ఆదాయం ప్రభావితం అయ్యే అవకాశం ఉంది. అమెరికా నుంచి వచ్చే ఒత్తిళ్లు ఉండనే ఉన్నాయి. సహాయ గ్రాంట్లు కేంద్రం ఇష్టా రాజ్యంగాను, దయా దాక్షిణ్యాల మీద నడుస్తున్నాయి.

రాష్ట్రం విధించే పన్నులో పన్నేతర రాబడి అనే పద్దు రాష్ట్ర ప్రభుత్వం పోగుచేసుకొన్న సొంత ఆదాయ వనరులకు, సృష్టించుకొన్న ఆస్తులకు సూచిక. పన్నేతర ఆదాయం ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వం సృష్టించుకొన్న ఆస్తులు, పన్నేతర ఆదాయం తగ్గిందంటే ఆస్తుల సృష్టిలో ప్రభుత్వం వైఫల్యాన్ని సూచిస్తుంది. ఈ వైఫల్యం పెరగడం మీద దృష్టి సారించకపోతే, ఆదాయ వనరుల సృష్టికోసం పన్నులు పెంచడం, సామాన్యుడు మరింత భారాన్ని మోయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. పన్నేతర రాబడిని విడదీసి విశ్లేషిస్తే ప్రభుత్వం ఇచ్చే రుణాల మీద వడ్డీలు, ప్రభుత్వం వివిధ పరిశ్రమల్లో పెట్టిన పెట్టుబడులపై లాభాలు, డివిడెండ్లు ఉంటాయి. అలాగే సాధారణ సర్వీసులు అంటే పబ్లిక్ సర్వీస్ కమీషన్, పోలీసు, జైల్లు, స్టేషనరీ ముద్రణ, పబ్లిక్ వడ్డీ, ఇతర పరిపాలనా సర్వీసులు, విరాలాలు, వసూళ్ల లాంటి వాటి నుంచి వచ్చే రాబడి ఉంటాయి. అదే విధంగా సాంఘిక సర్వీసులు అంటే విద్య, క్రీడలు,

కళలు, సంస్కృతి, విద్య, వైద్యం, ప్రజారోగ్యం, కుటుంబ సంక్షేమం, నీటి సరఫరా, పారిశుధ్య, గృహ నిర్మాణం, పట్టణాభివృద్ధి, సమాచారం, కార్మిక ఉద్యోగ వసతి, సాంఘిక బాధ్యత, సంక్షేమం లాంటి సాంఘిక సేవా రంగాల నుంచి వచ్చే రాబడి. నాల్గవ ఉప పద్దు అయిన ఆర్థిక సర్వీసుల కింద పశు సంరక్షణ, పందుల సం....? పాడి పరిశ్రమాభివృద్ధి, మత్స్య పరిశ్రమ, అడవుల సంరక్షణ, వన్య ప్రాణుల, సహకారం, ఇతర వ్యవసాయ కార్యక్రమాలు, భారీ, మధ్యతరహా చిన్న నీటితరహా పారుదల, విద్యుచ్ఛక్తి, గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలు, ఓడరేవులు, ఏర్పాటు కారణంగా మొదలైన వాటి నుంచి వచ్చే రాబడి ఉంటుంది. సాధారణంగా పన్నేతర రాబడి కింద ఉండే అన్ని పద్దులూ ఈ కార్యక్రమాల నుంచి రాబడి తగ్గుతుండడంతో, ఈ సేవలన్నింటి మీద యూజర్ ఛార్జీలు వసూలు చేయాలని ప్రపంచ బ్యాంకు సూచించిన మేరకు రాష్ట్ర ప్రభుత్వం ఆ ఛార్జీలు వేయడం, ప్రతి సంవత్సరం కొత్త కొత్త యూజర్ ఛార్జీలు వసూలు చేస్తోంది. అంటే సామాన్యుల మీద మరిన్ని భారాలు మోపడమే.

### వ్యయం

ఇక వ్యయానికి వస్తే ఈ వ్యయం రెండు రకాలుగా ఉంటుంది. దీన్ని కూడా రెమెన్యూ వ్యయం, మూలధన వ్యయం అనే ఉందు పద్దుల కింద చూపిస్తారు. రెవెన్యూ వ్యయాన్ని ఉత్పాదక (అభివృద్ధి) వ్యయం, అనుత్పాదక వ్యయం అని విభజించే సాంప్రదాయం కూడా ఉంది. అభివృద్ధి కార్యక్రమాలపై పెట్టే ఖర్చునూ భౌతిక వనరుల రూపంలోని మూలధనాన్ని పెంపొందించడానికి చేసే ఖర్చును వ్యవసాయం, నీటి పారుదల, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి మొదలైన వాటి రూపంలో భౌతిక మూలధనాన్ని పెంపొందించే ఖర్చును విద్య వైద్య ప్రజారోగ్యం, క్రీడలు, పారిశుధ్యం వంటి వాటి రూపంలో మానవ వనరులను అభివృద్ధి చేయడానికి చేసే ఖర్చును ఉత్పాదక వ్యయంలో చూపడం ఆనవాయితి. అనుత్పాదక వ్యయం, అభివృద్ధేతర వ్యయం అనే పద్దు కింద రుణాలు తిరిగి చెల్లింపులు , పరిపాలనా సేవలు, పన్ను వసూళ్ల వ్యయం, ఇతర ఖర్చులు అనే నాలుగు పద్దులుంటాయి.

సాధారణంగా ప్రభుత్వ వ్యయాల్లో కొన్ని వ్యయాలు ఈ నిర్వచనాలకు లొంగవు. ఒక వ్యయాన్ని ఉత్పాదక వ్యయంగా చూపడానికి ఎన్ని అవకాశాలున్నాయో, అనుత్పాదక వ్యయం అనడానికి అన్ని అవకాశాలున్నాయి. ఈ గందర గోళం ఎలా ఉన్నా, ఈ విభజన పద్దులు స్థూలంగా ఆర్థిక వ్యవస్థలోని ద్రవ్య సంబంద పరిణామాలను అర్థం చేసుకోవడానికి పనికొస్తాయి. విద్య, వైద్యం లాంటి సామాన్య మానవుని కనీస అవసరాల గురించి కేటాయింపులు బారెడు, అవి కూడా అందకుండా పోతున్న విషయం ఆనాడు, ఈనాడు ఉందని ద్రాక్షగానే ఉండి పోయాయి. గత 15 రోజులుగా స్వైన్ ఫ్లూ గురించి ఎంత నిర్లక్ష్యం చేశారంటే, ఒక మంత్రిని ఆ శాఖ నుంచి తప్పించాల్సి వచ్చిన పరిస్థితి ఏర్పడింది. పదుల మంది చనిపోయారు. విద్య గురించి చెప్పాలంటే అయిదారు క్లాసు బాల బాలికలు రెండో తరగతి పుస్తకం కూడా చదవలేక పోతున్నారని గత వారంలో పత్రికల్లో వార్తలొచ్చాయి. సామాజిక సేవలన్నీ పేదలకు అందుబాటు.....?

వ్యవసాయం నీటి పారుదల గురించిన బడ్జెట్ కేటాయింపుల గురించిన కేటాయింపుల గురించి గణాంకాలు విశ్లేషించుకొన్నపుడు కొన్ని విషయాలు గమనంలో ఉంచుకోవాలి. 1. ఈ పద్దుకు కేటాయంచిన సొమ్మంతా కేవలం పంట పండించడానికి చేసిన కేటాయింపు మాత్రమే కాదు, పశు సంరక్షణ మత్స్య శాఖా, సహకారం, పందులు, కోళ్లు, కొక్కిరాయలు, అడవులు, తిండి గింజలు, వ్యారపంటలు, ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు, వ్యవసాయ టెక్నాలజీ, పాడి పరిశ్రమ ఇలా ఎన్నో ఉప పద్దులుంటాయి. వ్యవసాయ రంగానికి ముఖ్యావసరం వ్యవసాయ రుణాలు. ఈ రుణాల సంగతి చెప్పాలంటే అమ్మ పుట్టిల్లు మేనమామకు చెప్పినట్లవుతుంది. వ్యవసాయానికి బ్యాంకులిచ్చే రుణాల్లో సింహభాగం ధన వంతులైన రైతులే కాజేస్తారు. వ్యవసాయ యాంత్రీకరణ పేరుతో లక్షల రూపాయల రుణాలు తీసుకొంటారు. కొత్త ప్రభుత్వం రుణమాఫీ పథకం కింద మాఫీ చేస్తే లాభపడేది వీరే. చిన్న, సన్నకారు రైతులకు బడ్జెట్ కేటాయింపుల్లో ఎంగిలి చెయ్యి విదిలించినంత మాత్రమే ముడుతుంది. రిజర్వు బ్యాంకు వార్షిక నివేదికల్లో ఏయే స్థాయి రైతులకు ఎంత మంది రైతులకు ఎంతెంత రుణం ముట్టింది అనే గణాంకాలు ఉంటాయి.

నీటి పారుదలకు కేటాయింపులు భారిగానే కనపడతాయి. అయినా కేటాయింపులు ఎంత అరకొరగా ఉంటాయంటే సంవత్సరాలు, దశాబ్దాలు గడిచినా నిర్మాణం జరుగుతూనే ఉన్నాయి. చెరువులు తవ్వడానికి కూడా ప్రపంచ బ్యాంకు నుంచి రుణం తెచ్చుకోవాల్సిన పరిస్థితి. నాగార్జున సాగర్ నిర్మాణానికి పైసా అప్పుతేకుండా నిర్మించగలిగాం కాని పూడికలు తీయడానికి ప్రపంచ బ్యాంకు ముందు చేయి సాచాల్సి వచ్చింది. ఈ విదేశీ రుణాల గురించి అమెరికా నాయకులు ఏమని అన్నారో చూడండి.

'అభివృద్ధి చెందుతున్న దేశాలకు చేస్తున్న సహాయంలో చాలా కొద్ది మొత్తం మాత్రమే ఆ దేశాల్లో ఉండిపోతుంది. సహాయం చేసిన మొత్తం సమారుగా అంత ధనవంతమైన దేశాలకు తిరిగి ఇచ్చేస్తుంది. ప్రపంచ బ్యాంకు మనీ మార్కెట్లను మొత్తంగా చూసి ఏ దేశంలో మిగుళ్లున్నాయి, వీటినెలా ఆకర్షించాలి అని ప్రపంచ బ్యాంకులో ఉన్న మనం చూస్తుండాలి.'

– మెక్‌నమారా, అమెరికన్ మాజీ సెక్రెటరీ

'సహాయం మాటున నిలువుదోపిడీ అమెరికాలో 20 లక్షల ఉద్యోగాలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు చేసే ఎగుమతుల మీదా ఆధారపడి ఉన్నాయి. ... సహాయాన్ని అందించే అంతర్జాతీయ ఆర్థిక సంస్థలకు అమెరికా ఇచ్చే ప్రతీ దాలరు, ఆ సహాయాన్ని అందుకొన్న దేశాలు అమెరికా ఉత్పత్తులు సేవలు కొనుక్కోవడానికి రెండు డాలర్లు ఖర్చు చేస్తాయి. కేవలం ప్రపంచ బ్యాంకుకు అమెరికా అందించే ప్రతీ దాలరుకు తిరిగి అమెరికాకు తొమ్మిదిన్నర దాలర్లు తిరిగి అమెరికాకు తొమ్మిదిన్నర దాలర్లు కాంట్రాక్టులు కొనుగోళ్ల, వడ్డీ చెల్లింపులు, ఆపరేషన్ ఖర్చుల రూపంలో అమెరికా ఆదాయంలోకి వచ్చి చేరుతుంది.

– టైమ్స్ పత్రిక

ఇదీ క్లుప్తంగా బడ్జెట్ కథా కమామిషు.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# పారిశ్రామిక విధానం - తెలంగాణ ప్రయోజనాలు

*తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన కొత్త పారిశ్రామిక విధాన ప్రకటన తెలంగాణ ప్రజల ఆకాంక్షలకు, ఉద్యమ ఆశలకు అనుగుణంగా ఉందో లేదో చర్చిస్తున్నారు* **ఎడ్ల పోచయ్య**

తెలంగాణ శాసనసభలో నవంబర్ 27న తెలంగాణ స్టేట్ ఇండస్ట్రియల్ ప్రాజెక్ట్ అప్రూవల్ అండ్ సెల్ఫ్ సర్టిఫికేషన్ సిస్టం (టిఎస్-ఐపాస్) బిల్లును ముఖ్యమంత్రి కె చంద్రశేఖర రావు ప్రవేశపెట్టగా సభ ఏకగ్రీవంగా ఆమోదించడంతో అది చట్టంగా మారింది. దాదాపు ఆరు నెలలుగా తెలంగాణ ప్రభుత్వం చెపుతూవస్తున్న కొత్త పారిశ్రామిక విధానం ఉనికిలోకి వచ్చింది. పారిశ్రామిక సంస్థల అనుమతులకు సంబంధించి 27 సెక్షన్లతో తయారయిన ఈ చట్టంతోపాటు, ప్రభుత్వం ఇరవై ఒక్క పేజీల సవివరమైన ఇండస్ట్రియల్ పాలసీ ఫ్రేమ్‌వర్క్ ఫర్ స్టేట్ ఆఫ్ తెలంగాణ 2014 అనే పారిశ్రామిక విధాన ప్రకటనను కూడ విడుదల చేసింది.

రాష్ట్రంలోకి పెట్టుబడులను ఆకర్షించడానికి, రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టదలచిన పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు అన్ని అనుమతులూ ఒక్కచోటనే 30 రోజులలోగా ఇవ్వాలని నిర్దేశించడానికి ఈ విధానం తయారయిందని ప్రభుత్వం చెపుతున్నది. ఎవరైనా పారిశ్రామికవేత్త తన ప్రతిపాదన విషయంలో ఆలస్యం జరిగిందని చూపితే సంబంధిత అధికారులమీద జరిమానాలు విధిస్తామని కూడ ఈ విధానం ప్రకటించింది. పారిశ్రామికవేత్తలకు నిర్ణీతవ్యవధిలో అనుమతులు ఇవ్వడం మాత్రమే గాక వారు ఏ ఆటంకాలు లేకుండా పరిశ్రమలు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వ సహకారం కూడ అందుతుంది. రాష్ట్రంలో సాగుకు లాయకుగాని ఇరవై లక్షల ఎకరాల భూమిని గుర్తించామనీ, రెండు లక్షల డెబ్బై ఐదు వేల ఎకరాల భూమిని పరిశ్రమల కోసం కేటాయిస్తున్నామని, ఇప్పటికే తెలంగాణ స్టేట్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్ (టిఎస్ఐఐసి) కి ఇరవైవేల ఎకరాలు అప్పగించామని ప్రభుత్వం ప్రకటించింది. ఈ విధానం కింద భారీ పరిశ్రమలను ఆమోదించేందుకు చీఫ్ సెక్రటరీ అధ్యక్షతన తెలంగాణ స్టేట్ వైడ్ ఇన్వెస్ట్ మెంట్ ఫెసిలిటేషన్ బోర్డ్ (టి-స్విఫ్ట్) (తెలంగాణ రాష్ట్ర వ్యాప్త మదుపు సానుకూల వ్యవస్థ) ను ఏర్పాటు చేస్తున్నామనీ, ఈ టి-స్విఫ్ట్ బోర్డ్ నిర్ణయాలను ఇతరశాఖలన్నీ ఆమోదించవలసి ఉంటుందనీ, ఇదే తరహాలో జిల్లా స్థాయి కమిటీలను కూడ ఏర్పాటు చేస్తామనీ ప్రభుత్వం ప్రకటించింది.

చిన్న, మధ్య తరహా పరిశ్రమలకు ప్రాధాన్యత, మహిళా పారిశ్రామిక వేత్తలకు ప్రత్యేక సహాయం, దళిత, ఆదివాసి పారిశ్రామిక వేత్తలకు ప్రత్యేక మద్దతు కోసం తెలంగాణ స్టేట్ ప్రోగ్రాం ఫర్ రాపిడ్ ఇన్‌క్యుబేషన్ ఆఫ్ దళిత్ ఎంటర్‌ప్రైజెస్ (టిఎస్ ప్రైడ్) కార్యక్రమం, సాంప్రదాయిక కళలకు, చేతివృత్తులకు సహాయం కోసం తెలంగాణ స్టేట్ హాండిక్రాఫ్ట్స్ అండ్ ఆర్టిజాన్స్ రివైవల్ విత్ టెక్నాలజీ (టిఎస్ హార్ట్) కార్యక్రమం, నైపుణ్యాల అభివృద్ధి శిక్షణ కోసం తెలంగాణ స్టేట్ యాక్సిలరేటెడ్ ఎస్ఎస్ఐ స్కిల్స్ ట్రెయినింగ్ (టి అసిస్ట్) కార్యక్రమం వంటి ప్రణాళికలు కూడ ఈ విధానంలో ఉన్నాయి.

తెలంగాణ స్టేట్ ఇండస్ట్రియల్ డెవలప్ మెంట్ అండ్ ఎంట్రప్రెన్యూర్ అడ్వాన్స్‌మెంట్ (టి ఐడియా) కింద తెలంగాణలో పరిశ్రమలు పెట్టదలచినవారికి స్టాంప్ డ్యూటీ రద్దు, భూమి ఖరీదులో రాయితీ, భూ బదలాయింపు పన్ను మినహాయింపు, విద్యుత్ ఖర్చు రద్దు, మదుపు సబ్సిడీ వంటి అనేక రాయితీలు ప్రకటించారు. ఆ పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు బ్రాండ్ తెలంగాణను మార్కెటింగ్ చేసిపెట్టే బాధ్యత, భూమి, మౌలిక సౌకర్యాలు, రవాణా సదుపాయాలు, నీరు, విద్యుచ్ఛక్తి అందించే బాధ్యత కూడ ప్రభుత్వం తీసుకుంటుందని ఈ విధానం ప్రకటించింది.

మొదటి దశలో హైదరాబాదు నుంచి బెంగళూరు, నాగపూర్, వరంగల్ మార్గాలలో, రెండో దశలో హైదరాబాదు నుంచి మంచిర్యాల, నల్లగొండ, ఖమ్మం మార్గాలలో పారిశ్రామిక కారిడార్లు ఏర్పాటు చేస్తామని ఈ విధానం ప్రకటించింది. జిల్లాల వారీగా ఏయే పరిశ్రమలకు ప్రాధాన్యత ఇస్తామో చెపుతూ, నిజామాబాదులో ఖనిజాలు, సిమెంటు, ఫుడ్ ప్రాసెసింగ్, ఆదిలాబాదులో సిమెంటు, కాగితం, కరీంనగర్‌లో ఎరువులు, విద్యుచ్ఛక్తి, సిమెంటు, వస్త్రాలు, వరంగల్‌లో ఖనిజాలు, ఫుడ్‌ప్రాసెసింగ్, వస్త్రాలు, తోళ్లు, ఖమ్మంలో ఖనిజాలు, విద్యుచ్ఛక్తి, గ్రనైట్, లోహాలు, కాగితం, మహబూబ్‌నగర్‌లో వస్త్రాలు, ఖనిజాలు, ఔషధాలు, వినియోగ వస్తువులు, రంగారెడ్డిలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీ, ఔషధాలు, ఫుడ్ ప్రాసెసింగ్, డిఫెన్స్, ఏరోస్పేస్, మెదక్‌లో రసాయనాలు, ఇంజనీరింగ్, ఆటోమొబైల్స్, ఔషధాల పరిశ్రమలను ప్రాధాన్యతా రంగాలుగా గుర్తిస్తామని ప్రకటించింది.

అవన్నీ దీర్ఘకాలిక ప్రణాళికలు కాగా, ప్రత్యేకించి 2014-15 ఆర్థిక సంవత్సరంలో తీసుకోనున్న చర్యలలో ఫార్మాసిటీ, కెమికల్ సిటీ మౌలిక సౌకర్యాల ఏర్పాటు, హైదరాబాద్ - వరంగల్ పారిశ్రామిక కారిడార్ అభివృద్ధి, వరంగల్‌ను వస్త్ర పరిశ్రమ కేంద్రంగా మార్చే లక్ష్యంతో ఒక టెక్స్‌టైల్ పార్క్ ఏర్పాటు, ఫుడ్ ప్రాసెసింగ్, విత్తన ఉత్పత్తి చర్యలు, మదుపు, సహాయ సంస్థ ఏర్పాటు, దళిత పారిశ్రామికవేత్తలకు ప్రత్యక్ష రుణసహాయం, పారిశ్రామిక ఉత్పాదకాలపై, ఉత్పత్తులపై అంతర్రాష్ట్ర విలువ ఆధారిత పన్ను హేతుబద్ధీకరణ, కార్మిక చట్టాలతో సహా కాలంచెల్లిన అన్ని పారిశ్రామిక రంగ నిబంధనల సమీక్ష, సవరణ వంటివి కూడ చేర్చారు.

ఇటువంటి పారిశ్రామిక విధానం, ప్రణాళికలు, రాయితీలు, మినహాయింపులు కొత్తవేమీ కాదు. భారత పాలకవర్గాలు 1950ల నుంచీ కూడ ఇదే విధంగా ప్రజలకు, కార్మికులకు అనుకూలమైన

అంశాలు కొన్ని, పెట్టుబడిదారులకు అనుకూలమైన అంశాలు అంతకన్న ఎక్కువ కలగలిపిన పారిశ్రామిక విధానాలను ప్రకటిస్తూనే వస్తున్నాయి. చివరికి ఆచరణలోకి వచ్చేసరికి ఆ విధానాలలోని ప్రజానుకూల అంశాలను పక్కనపెట్టడమూ, పెట్టుబడిదారులకు అనుకూలమైన అంశాలను చెప్పినదానికన్న ఎక్కువ అమలు చేయడమూ ఆనవాయితీ అయిపోయింది. 1980ల తర్వాత, మరీ ముఖ్యంగా 1992 తర్వాత బహిరంగంగానే పెట్టుబడిని, విదేశీ పెట్టుబడిని ఆహ్వానిస్తూ, కనీసమైన ప్రజానుకూల విధానాలను ప్రకటించడం కూడ తగ్గిపోయింది. ఆ క్రమంలోనే విభిన్న రాజకీయ పార్టీల పాలనలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలు పెట్టుబడులను ఆకర్షించే లక్ష్యంతో రాయితీలు, మినహాయింపులు ఇవ్వడం, అదనపు సౌకర్యాలు కల్పించడంలో పోటీ పడడం మొదలు పెట్టాయి. ఈ పోటీ వల్ల నిజంగా లాభపడినది ఆయా రాష్ట్రాల ఖజానాలూ కాదు, రాష్ట్ర ప్రజలూ కాదు. లాభం కోసమే ఎక్కడికైనా వెళ్లదలచుకున్న పెట్టుబడిదారులకు మరిన్ని లాభాలు చేకూర్చడానికే ఈ పోటీ ఉపయోగపడింది. రాయితీలు, మినహాయింపులు, సౌకర్యాల కల్పన వల్ల రాష్ట్ర ఖజానాకు రావలసిన కనీస పన్నుల ఆదాయాన్ని, ఇతర ఆదాయాలను ప్రభుత్వాలు తామే వదులుకున్నాయి. ఈ కొత్త పరిశ్రమలు సాధారణంగా హైటెక్ పరిశ్రమలు కావడం వల్ల ఉద్యోగ కల్పన కూడ పెద్దగా జరగలేదు. అంటే ప్రజల వనరులూ పోయాయి, ప్రభుత్వ ఖజానా నిండలేదు. ప్రజలకు మేలూ జరగలేదు. తెలంగాణ ఉద్యమ ఆకాంక్షలలో ప్రధానమైనవి తమ వనరుల మీద తమకే అధికారం ఉండాలనేది, ఆర్థిక పుష్టి కలిగి స్వపరిపాలన సాగించగలిగే ప్రభుత్వం రావాలనేది, ఉద్యోగకల్పన పెద్ద ఎత్తున జరగాలనేది. అంటే దేశంలోనూ, ఇతర రాష్ట్రాలలోనూ అమలవుతున్న పారిశ్రామిక విధానం కన్న భిన్నమైన పారిశ్రామిక విధానాన్ని తెలంగాణ సమాజం ఆశించింది. ఈ మూడు ప్రయోజనాలూ నెరవేర్చే పారిశ్రామిక విధానం కావాలని స్పష్టంగానో, అస్పష్టంగానో భావించింది. ఆ విధానం మౌలికంగా భిన్నమైనదో, విప్లవకరమైనదో కావాలని కూడ కాదు, తెలంగాణ ప్రజలకు మేలుచేసే, తెలంగాణ ప్రయోజనాలను నెరవేర్చే పారిశ్రామిక విధానం అయితేచాలు.

దురదృష్టవశాత్తూ, తెలంగాణ ప్రభుత్వం ప్రకటించిన కొత్త పారిశ్రామిక విధానం తెలంగాణ ప్రయోజనాల కన్న పెట్టుబడిదారుల ప్రయోజనాలకే పెద్దపీట వేస్తున్నది. పెట్టుబడిదారుల ప్రయోజనాలు నెరవేరే క్రమంలో ఉప ఉత్పత్తిగానైనా తెలంగాణ ప్రజల ప్రయోజనాలు నెరవేరితే చాలునని అల్ప సంతోషం ప్రకటించడానికైనా ఈ విధానం అమలు తీరు వీలు కలిగిస్తుందా అనుమానమే.

ఈ పారిశ్రామిక విధాన ప్రకటన చాల అవసరమైన, కీలకమైన అంశాల దగ్గరనే ప్రారంభమైంది. 'యువతకు ఉద్యోగ కల్పన, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రోత్సాహం, లభ్యమయ్యే వనరులను అత్యంత సమర్థంగా వినియోగించుకోవడం ద్వారా వృద్ధి అవకాశాలను ఇతోధికంగా పెంచడం, ప్రజల సామర్థ్యాలనూ నైపుణ్యాలనూ వినియోగించుకోవడం, ప్రతి కుటుంబానికీ సౌభాగ్యం కల్పించడం' వంటి ఎన్నో ఆశలను తెలంగాణ ప్రజలు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం మీద పెట్టుకున్నారని ఈ పత్రం సరిగానే గుర్తించింది. ఈ 'తెలంగాణ ప్రజల స్వప్నాలనూ ఆకాంక్షలనూ పారిశ్రామికీకరణ మాత్రమే తీర్చగలద'నే సూచన చేసింది. నిజానికి ఈ ఆకాంక్షల సాధనకు వ్యవసాయాభివృద్ధి, గ్రామీణాభివృద్ధి, స్వయంఉపాధి కల్పన, వ్యవసాయాధార పరిశ్రమలు, వికేంద్రీకృత అభివృద్ధి వంటి ఎన్నో మార్గాలుండగా పారిశ్రామికాభివృద్ధి మాత్రమే ఏకైక మార్గంగా చూపడం ఒక ప్రత్యేకమైన అభివృద్ధి నమూనా. ఆ అభివృద్ధి నమూనాను ఎంచుకున్నందువల్లనే, ఈ విధానం ఆదిలోనే 'పారిశ్రామికాభివృద్ధికి పెద్ద ఎత్తున ప్రైవేట్ రంగపు భాగస్వామ్యం అవసరం' అనే తప్పుడు నిర్ణయానికి వచ్చింది. సరిగ్గా తెలంగాణ ప్రజలు వ్యతిరేకించిన, చంద్రబాబు నాయుడు తలకెత్తుకున్న అభివృద్ధి నమూనా అదే. ఆ నమూనా వల్లనే, ఈ పారిశ్రామిక విధానంలో ఆ తర్వాత ప్రకటించిన ప్రతిపాదనలు, పథకాలు, ప్రోత్సాహకాలు, రాయితీలు తెలంగాణ ప్రజల ఆశలకూ లక్ష్యాలకూ దూరంగా వెళ్లక తప్పలేదు.

ఆరు దశాబ్దాల పాటు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణ ప్రజలు అనుభవించిన వివక్ష, అన్యాయాల వల్ల గాని, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే తమ భవిష్యత్తు బాగుపడుతుందనే ఆకాంక్షల వల్ల గాని, ఉద్యమక్రమంలో విస్తరించిన చైతన్యం వల్ల గాని, రూపొందిన నినాదాల వల్ల గాని తెలంగాణలో కొంత వైవిధ్యపూరితమైన పారిశ్రామిక విధానం రూపొందడానికి అవకాశం ఉంటుందని కొందరైనా అనుకున్నారు. తెలంగాణ ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ అమలవుతున్న భారతదేశంలో అంతర్భాగమే గనుక తెలంగాణలో పూర్తి భిన్నమైన, మౌలికంగా వేరయిన విధానాలకు అవకాశం లేదు. కాని ఉద్యమనేపథ్యం వల్ల, ప్రజా ఆకాంక్షల వల్ల కొంతైనా తేడా ఉండే విధానాలకు అవకాశం ఉండవచ్చుననుకున్నారు. తెలంగాణలో ఉన్న సహజ వనరుల వినియోగం తెలంగాణ ప్రయోజనాలకు అనుగుణంగా జరగాలని, జరుగుతుందని ఆశించారు. ఆరు దశాబ్దాలలో జరిగినట్టుగా స్థానిక ప్రజలను పక్కనపెట్టి పెట్టుబడిదారుల ప్రయోజనాలు నెరవేర్చేలా ఉండగూడదని అనుకున్నారు. ఒకవేళ పెట్టుబడిదారుల ప్రయోజనాలు నెరవేర్చినా, పాత అనుభవం వల్ల మొత్తంగా పెట్టుబడిదారుల మీద, ప్రత్యేకించి కోస్తా, రాయలసీమ పెట్టుబడిదారుల మీద పరిమితులు, తెలంగాణ పెట్టుబడిదారులు పుట్టి పెరగడానికి అవకాశాలు ఉంటాయను కున్నారు. కాని విచారకంగా కొత్త పారిశ్రామిక విధానం గత చరిత్ర నుంచి ఏ పాఠాలూ తీసుకున్నట్టు కనబడడం లేదు. తెలంగాణ వనరుల వినియోగం గురించి మాత్రమే మాట్లాడింది గాని ఆ వినియోగంతో తెలంగాణ ప్రజల ప్రయోజనాలు ఎట్లా నెరవేర్చవచ్చునో మాట్లాడలేదు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో జరిగిన అస్తవ్యస్త పారిశ్రామికాభివృద్ధి వల్ల రెండు తరాలు తమ న్యాయమైన హక్కు అయిన ఉద్యోగాలు పోగొట్టుకున్నాయి గనుక ప్రస్తుత తెలంగాణలో పారిశ్రామిక విధానం తెలంగాణ భూమిపుత్రుల ఉద్యోగ కల్పనను ప్రధాన లక్ష్యంగా పెట్టుకుంటుందని తెలంగాణ సమాజం ఆశించింది. కాని పారిశ్రామిక విధాన ప్రకటనలో మొదటి పేరాలో ఉద్దేశాలు చెప్పిన దగ్గర మినహాయిస్తే మరెక్కడా ఉద్యోగకల్పన ప్రస్తావన లేదు. పరిశ్రమలు, వ్యాపారాలు పెట్టదలచుకున్నవారి మీద ఉద్యోగకల్పనా షరతులు విధిస్తామనే మాటే లేదు. విధానప్రకటనలో కీలక పరిశ్రమలుగా గుర్తించినవాటిలో చాల వరకు శ్రమ ఆధారిత పరిశ్రమలు కావు, పెట్టుబడి ఆధారిత పరిశ్రమలే. అంటే ఎక్కువ ఉద్యోగాలు కల్పించగలిగేవి కావు, ఉన్నత స్థాయి, స్వయంచాలిత సాంకేతిక నైపుణ్యంతో నడిచేవి. అవి సృష్టించే అతి తక్కువ ఉద్యోగాలు తెలంగాణ భూమి పుత్రులకే దక్కుతాయన్న హామీ ఏమీ లేదు.

వనరుల వినియోగం, ఉద్యోగకల్పన అనే అంశాలతో పాటుగా, అంతకన్న ఎక్కువగా ఎవరైనా పారిశ్రామికీకరణ నుంచి ఆశించేది జీవన ప్రమాణాల అభివృద్ధి. పరిశ్రమలు ప్రత్యక్ష ఉద్యోగకల్పనతో పాటు

అనుబంధ వృత్తులు, ఉపాధులు తలెత్తడానికి అవకాశం ఇస్తాయి. ప్రభుత్వ ఖజానాకు పన్నుల ఆదాయాన్ని పెంచి తద్వారా ప్రజాసంక్షేమం మీద ఎక్కువ ఖర్చు పెట్టడానికి వీలు కల్పిస్తాయి. పరిసర గ్రామీణ ప్రాంతాల ప్రజలకు, సుదూరం నుంచి వలస వచ్చేవారికి కూడ ఒక పారిశ్రామిక కేంద్రం జీవనోపాధి అవకాశాల కేంద్రంగా ఉంటుంది. అటువంటి సాధారణ జీవన ప్రమాణాల పెరుగుదలకు అవకాశం ఇవ్వని రీతిలో ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి జరిగింది గనుక, తెలంగాణ ఆ దుస్థితిని సవరిస్తుందని ఒక ఆశ ఉద్యమ క్రమంలో వ్యక్తమవుతుండేది.

ఈ విశాలమైన ఆశలతో పాటు, తక్షణ పరిస్థితులవల్ల తలెత్తిన ఆశలు కూడ కొన్ని ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి క్రమంలో జరిగిన రెండు పరిణామాలు తెలంగాణలో మారాలని కూడ తెలంగాణ సమాజం కోరుకుంది. అవి, ఒకటి, హైదరాబాద్ పారిశ్రామిక కేంద్రీకరణ, రెండు, ప్రపంచీకరణ విధానాలలో, చంద్రబాబు నాయుడు పాలనాకాలంలో పద్ధతి ప్రకారం జరిగిన తెలంగాణ పరిశ్రమల విధ్వంసం. ఒక్క హైదరాబాద్ లో మాత్రమే కాక, అన్ని జిల్లాలలోను పరిశ్రమలు రావాలని, పాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వకాలంలో కుట్రపూరితంగా మూసివేతకు గురైన ఆల్విన్, ఎచ్ ఎం టి, ప్రాగా టూల్స్, ఆజంజాహి మిల్స్, డిబిఆర్ మిల్స్, నిజాం షుగర్స్, ఐడిపిఎల్, స్పాంజ్ ఐరన్, రామగుండం ఫర్టిలైజర్ కార్పొరేషన్, రిపబ్లిక్ ఫోర్జ్, సర్ సిల్క్, అంతర్గాం స్పిన్నింగ్ మిల్స్, నేతాజీ మిల్స్, ఎపి స్కూటర్స్ వంటి అనేక ప్రభుత్వ, సంయుక్త, సహకార, ప్రైవేట్ రంగ పరిశ్రమలను తెలంగాణ రాష్ట్రంలో పునరుద్ధరించుకుంటామని ఆశించారు. కాని కొత్త పారిశ్రామిక విధానంలో విధ్వంసమైన, మూతబడిన పరిశ్రమల పునరుద్ధరణ ప్రస్తావనే లేదు.

అలాగే, లాభాపేక్ష కోసమే, రాయితీల కోసమే పరిశ్రమల స్థాపనకు పూనుకునే ప్రైవేట్ పెట్టుబడిదారులు, సామాజిక అవసరాలను, సామాజిక శ్రేయస్సును దృష్టిలో పెట్టుకోరని, అందువల్ల సామాజిక శ్రేయస్సే లక్ష్యంగా, లాభనష్టాల ప్రమేయం లేని ప్రభుత్వరంగం అవసరమని జాతీయోద్యమం నాటినుంచీ ఉన్న అభిప్రాయం. తెలంగాణ సమాజం పునర్నిర్మాణ క్రమంలో కూడ లాభాపేక్షకూ సామాజిక శ్రేయస్సుకూ పోటీ వస్తుంది. ఆరు దశాబ్దాల విధ్వంసాన్ని సవరించడానికి సామాజిక శ్రేయస్సుకే ప్రాధాన్యత ఇవ్వవలసి ఉంటుంది. అంటే తెలంగాణ కొత్త పారిశ్రామిక విధానం మొదటి ప్రాధాన్యత ప్రభుత్వ రంగానికి ఇవ్వాలి. ఒకవేళ ప్రైవేట్ రంగానికి ప్రాధాన్యత ఇవ్వదలచినప్పుడు కూడ పబ్లిక్ రంగంలో ఉదాహరణప్రాయమైన పరిశ్రమలను ఏర్పాటు చేసి తద్వారా సామాజిక శ్రేయస్సు లక్ష్యాలను నెరవేర్చవలసి ఉంటుంది. కాని తెలంగాణ పారిశ్రామిక విధాన ప్రకటనలో ప్రభుత్వ రంగ పరిశ్రమల గురించి మాటమాత్రమైనా లేదు. వీలైనన్ని చోట్ల ప్రైవేటు రంగ పరిశ్రమల ప్రస్తావన, వాటికి ప్రభుత్వ సహాయాలు, ప్రోత్సాహాలు, మద్దతులు, రాయితీల గురించి మాత్రమే ఉంది.

ఆంధ్రప్రదేశ్ అనుభవం తర్వాత, ఉద్యమ క్రమంలో తీవ్రమైన ఆకాంక్షల తర్వాత, తెలంగాణ ప్రభుత్వం ఇతర ప్రాంతాల పెట్టుబడిదారుల గురించి, ప్రత్యేకించి పాత ఆంధ్రప్రదేశ్ పెట్టుబడిదారుల గురించి జాగరూకత వహిస్తుందని, అలా జాగరూకత వహించడం న్యాయమని, సహజమని ఎవరైనా అనుకుంటారు. తెలంగాణలో ఇంతకాలం వివక్షకు, అన్యాయానికి గురయిన స్థానిక పారిశ్రామిక, వ్యాపారవేత్తల వర్గాన్ని అభివృద్ధి చేయడానికి ప్రత్యేక ప్రోత్సాహకాలు ఉంటాయని ఎవరైనా అనుకుంటారు. కాని కొత్త పారిస్థామిక విధానం అటువంటి జాగరూకతను, విచక్షణను ప్రదర్శించలేదు. పైగా, ప్రభుత్వాధినేతలు ఈ విధాన ప్రకటన తర్వాత స్పష్టంగానే 'ఆంధ్ర పెట్టుబడిదారులకు ఎర్రతివాచీ ఆహ్వానం పలుకుతున్నాం' అన్నారు. సరిగ్గా ఆ మాట అన్నందుకే, అమలు చేసినందుకే ఆరు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ పాలకులను వ్యతిరేకించి, తొలగించేవరకూ పోరాడిన తెలంగాణ సమాజం ఈ విధానాన్ని ఎలా జీర్ణించుకుంటుందో చూడవలసిందే.

దళితులకు, ఆదివాసులకు, మహిళలకు, చేతివృత్తులవారికి ప్రకటించిన ప్రత్యేక పథకాలు ఆహ్వానించదగినవే గాని అవి నిజంగా, సంపూర్ణంగా అమలవుతాయా అనేది గత చరిత్ర అనుభవం నుంచి చూసినప్పుడు అనుమానమే. ఒకవేళ అమలయినా, ఆయా అనాదృత వర్గాల లోంచి ఒక పిడికెడు మంది ఉదాహరణ ప్రాయమైన పెట్టుబడిదారులను తయారు చేయడానికి తప్ప మొత్తంగా ఆ వర్గాల అభ్యున్నతికి ఈ పథకాలు ఉపయోగపడతాయా కూడ అనుమానమే.

ప్రభుత్వం ఈ విధానం ప్రకటించిన తర్వాత పారిశ్రామిక, వ్యాపారవర్గాల నుంచి, ప్రతిపక్షాల నుంచి స్పందనలు వచ్చాయి గాని ప్రజాసంఘాల నుంచి, మేధావుల నుంచి పెద్దగా స్పందనలు వచ్చినట్టులేవు. పారిశ్రామిక, వ్యాపారవర్గాలు సహజంగానే ఈ విధానాన్ని ప్రశంసించి, ఆహ్వానించాయి. ప్రభుత్వ విధానాలు ఎంత ఎక్కువగా రాయితీలు, మినహాయింపులు, సౌకర్యాలు ప్రకటిస్తే వారి లాభాలు అంతగా పెరుగుతాయి గనుక వారు ఈ విధానాలను ఆహ్వానించడంలో ఆశ్చర్యం లేదు.

ప్రతిపక్షాలలో కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీ రెండూ ఈ విధానానికి తాము అనుకూలమని, ఇంకా ఎక్కువగా పారిశ్రామికవేత్తలను ఆహ్వానించే చర్యలు తీసుకోవాలని స్వాగతం చెపుతూ, తెలంగాణ పారిశ్రామికీకరణకు విద్యుత్తు సమస్య వంటి ఆటంకాలున్నాయని, అవి ముందు పరిష్కరించాలని సన్నాయి నొక్కులు నొక్కాయి. ప్రపంచీకరణ విధానాల సృష్టికర్తగా కాంగ్రెస్, వాటిని ఇంకా ఎక్కువగా అమలుచేస్తున్న కొనసాగింపుదారుగా భాజపా ప్రజా ప్రయోజనాల కన్న ఎక్కువగా పెట్టుబడిదారుల ప్రయోజనాలను కోరుకుంటాయని అందరికీ తెలుసు. తెలుగు దేశం పార్టీ ఈ విధానాన్ని ఆహ్వానిస్తున్నదో వ్యతిరేకిస్తున్నదో చెప్పకుండా మూతబడిన పరిశ్రమలను తెరిపించడం మీద శ్రద్ధ పెట్టాలని వ్యాఖ్యానించింది. నిజానికి గత పాలనా కాలంలో ఇటువంటి విధానాన్నే అమలు చేసిన చరిత్ర, పరిశ్రమలను మూసివేసిన చరిత్ర తెలుగుదేశం పార్టీది. ఇక భారత కమ్యూనిస్టు పార్టీ ఈ పారిశ్రామిక విధానాన్ని పూర్తిగా సమర్థించగా, భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ఈ విధానం పెట్టుబడిదారులకు అనుకూలంగా ఉన్నదని విమర్శించింది.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఈ పారిశ్రామిక విధాన ప్రకటన చేస్తుండగానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పారిశ్రామికవేత్తలకు తాము ఇచ్చే రాయితీలను, మినహాయింపులను, ప్రోత్సాహకాలను పోటీగా ప్రకటించడం మొదలుపెట్టింది. చంద్రబాబు నాయుడు గతంలో అనుసరించిన విధానాలనే మళ్లీ ప్రకటిస్తూ పారిశ్రామికవేత్తలకు ఆహ్వానాలు పలకడం ప్రారంభించారు. పత్రికలు, ప్రచారసాధనాలు అతిశయోక్తులతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు పరిశ్రమ అనుకూల విధానాలను గురించి రాయడం మొదలుపెట్టాయి. దేశదేశాల

పెట్టుబడిదారులు ఆంధ్రప్రదేశ్ కు వచ్చి స్థిరపడుతున్నట్టు ఆర్భాటపు ప్రచారం ప్రారంభమైంది. ఈ ప్రచారాన్ని చూసి తెలంగాణ పాలకులు, తెలంగాణలోని ఈ అభివృద్ధి నమూనా సమర్థకులు కూడ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఇంకా ఇంకా ఎక్కువ పెట్టుబడి అనుకూల విధానాలు ప్రకటించాలని అనడం మొదలుపెట్టారు.

ఈ ఒత్తిడులో, ప్రయోజనాలో, ఒక అభివృద్ధి నమూనా పట్ల భావజాల పరమైన సానుకూలతో, ప్రజల పట్ల నెనరు లేకపోవడమో, చరిత్ర నుంచి వేరు చేసుకోవాలనే బలమైన కోరిక లేకపోవడమో కారణం ఏదైనప్పటికీ, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కొన్ని ప్రజానుకూల ప్రస్తావనలు, ప్రకటనలు చేస్తూనే ప్రధానంగా ప్రజా వ్యతిరేక పారిశ్రామిక విధానానికి తెరతీసింది. వంటకపు నిరూపణ తినడంలో తెలుస్తుంది అని ఒక సామెత ఉంది. పారిశ్రామిక విధానంలో ఏమి చెప్పినా, ఎంత గంభీరమైన, అస్పష్టమైన ప్రకటనలు ఉన్నా, వాస్తవంగా ప్రభుత్వం అమలు చేసే విధానాలు ఎలా ఉన్నాయనేది ప్రధాన సూచికగా ఉంటుంది. సరిగ్గా ఈ విధాన ప్రకటన, దాని మీద చర్చలు జరుగుతున్న సమయంలోనే, బహుళజాతి సంస్థలకు, దేశంలోని బడా దళారీ పెట్టుబడిదారీ సంస్థలకు ఆర్భాటపూర్వకమైన ఆహ్వానాలు సాగుతున్న సమయంలోనే తెలంగాణలో రెండు ప్రధానమైన పరిశ్రమలు మూతపడ్డాయి. ఒకటి వరంగల్ జిల్లా కమలాపూర్ లోని ఎపి రేయాన్స్, మరొకటి ఆదిలాబాద్ జిల్లా కాగజ్ నగర్ లోని సిర్పూర్ పేపర్ మిల్స్. నాలుగు దశాబ్దాలుగా నడుస్తున్న ఎపి రేయాన్స్ ప్రస్తుతం బల్లార్ పూర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ అనే థాపర్ గ్రూపు కంపెనీగా 3,000 మందికి ప్రత్యక్షంగా ఉద్యోగాలు, 10,000 మందికి పరోక్ష ఉపాధి కల్పిస్తూ ఉంది. ప్రతికూల వ్యాపార వాతావరణం వల్ల కంపెనీని మూసివేస్తున్నామని యాజమాన్యం ప్రకటించింది. ఈ మూసివేత చట్టవ్యతిరేకంగా జరిగినప్పటికీ ప్రభుత్వం కంపెనీని తిరిగి తెరిపించడానికి అవసరమైన చర్యలు తీసుకోవడం లేదు. కొత్త విధానంలో ప్రకటించిన రాయితీలతో, ప్రోత్సాహకాలతో పోలిస్తే కొద్దిపాటి చొరవతో ఈ పరిశ్రమను పునరుద్ధరించి, వేలాదిమంది కార్మికుల జీవనోపాధిని పరిరక్షించడం సాధ్యమే. అలాగే పాత నిజాం ప్రభుత్వం 1938లో ఏర్పాటు చేసిన, 1942 నుంచి కాగితం ఉత్పత్తిలో ఉన్న, మొదట బిర్లాల చేతుల్లోకి వెళ్లి, ప్రస్తుతం పోద్దార్ ల చేతుల్లో ఉన్న సిర్పూర్ పేపర్ మిల్స్ లో 3,200 మంది కార్మికులున్నారు. అంతకు రెట్టింపు మంది పరోక్షంగా ఆధారపడినవారున్నారు. వారందరినీ వీధిన పడేస్తూ యాజమాన్యం కంపెనీ మూసివేత నిర్ణయం తీసుకుంది. ఆశ్చర్యకరంగా ఈ కంపెనీ కార్మిక సంఘానికి అధ్యక్షుడు తెలంగాణ రాష్ట్ర సమితి నాయకుడు, ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వ హోం మంత్రి నాయిని నరసింహారెడ్డి. అయినప్పటికీ సంస్థను తిరిగి తెరిపించడానికి ఎటువంటి చర్యలూ జరగడం లేదు. తాము అధికారంలోకి వచ్చిన తర్వాతనే జరిగిన ఈ రెండు పెద్ద మూసివేతల గురించి, కనీసం ఆరు వేల కార్మిక కుటుంబాలు వీధిన పడడం గురించి ఎటువంటి స్పందనా చూపని పాలకులు రాష్ట్రంలోకి ఎన్నెన్నో పరిశ్రమలు తెస్తామని, రాష్ట్రాన్ని పారిశ్రామికీకరణ దిశగా నడుపుతామని అనడం ఆశ్చర్యకరం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

**కొత్త రాజధాని నిర్మాణ ప్రక్రియ పై రచయితల ప్రకటన!**

## పంట భూముల నుండి రైతులను గెంటివేసే చర్యలను ఖండిస్తున్నాం!!

*13 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌కి కొత్త రాజధాని నిర్మాణం పేరిట ప్రస్తుత ప్రభుత్వం సాగిస్తున్నదంతా దాని సాకున నల్లధన కుబేరుల జూదగొండి ప్రయోజనాలను కాపాడడమేనని ఈ కింద సంతకం చేసిన రచయితలమూ, ఆలోచనాపరులమూ అయిన మేము బలంగా అభిప్రాయపడుతున్నాం.*

*ప్రపంచాన్ని తలదన్నేంత మహోన్నత రాజధానిని నిర్మాణం చేయమని రాష్ట్ర ప్రజలు పాలకులను ఆదేశించలేదు. ఆశించడమూ లేదు. చంద్రబాబు తరహాలో జరిగిన హైదరాబాదు అభివృద్ధి, ప్రజానుకూల నమూనా కాదు. దాని వైఫల్యాలను చరిత్ర నమోదు చేసింది. పరిపాలనా రాజధానికి కనీస అవసరాలైన అసెంబ్లీ భవనం, సచివాలయం, హైకోర్టు, రాష్ట్ర స్థాయి పరిపాలనా శాఖల కార్యాలయాలు, కొన్ని కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలూ, శాసనసభ్యుల, ఉద్యోగుల గృహ సముదాయాలూ నిర్మించుకుంటే సరిపోతుంది. అందుకు కొద్ది వందల ఎకరాల భూమి చాలు. 30 వేలు – లక్ష ఎకరాలు సమీకరించడమన్నది దేశ, విదేశీ ధనస్వాముల దోపిడీ ప్రయోజనాల కొరకే. కాని, సాధారణ రైతుల, కౌలు రైతుల, చేతి వృత్తుల, వ్యవసాయ కూలీల, కార్మికుల, మధ్యతరగతి ప్రజల ప్రయోజనాల కొరకు కాదని మేం కచ్చితంగా అభిప్రాయపడుతున్నాం. పరిపాలనా రాజధానికి సరిపోను ప్రభుత్వ భూములు ప్రస్తుత నిర్దేశిత ప్రాంతంలో ఉన్నాయి. అదనంగా రైతుల భూములను సమీకరించనక్కరలేదు. ముక్కారు పంటలు పండే పొలాలను కాంక్రీటు వనాలుగా మార్చనక్కలేదు. తరతరాలుగా అక్కడ జీవిస్తున్న వేలాది కుటుంబాలను వలస జీవులుగా గెంటి వేయనక్కర లేదు.*

*మన దేశానికి ఆయువుపట్టు లాంటి గ్రామీణ జీవనంలో 'డబ్బు'కి మించిన, అది కొనుగోలు చేయలేని సాంస్కృతిక ఔన్నత్యం ఒకటుంది. ఒక కుటుంబమంటే తల్లీ-తండ్రి, భార్యా-భర్తా, పిల్లలు ఎలాగో, గ్రామం అంటే భూమి-నీరు-పశువు-పాడి-పంట-అనేక కుటుంబాల ఆత్మిక కలయిక. వారి జీవన విధ్వంసమంటే సాంస్కృతిక విధ్వంసం కూడానని మేము భావిస్తున్నాం.*

*ఆహార ధాన్యాల ఉత్పత్తికి కొరతను తెచ్చి, విదేశాల నుండి వాటిని దిగుమతి చేసుకోవాల్సిన దుస్థితికి దేశాన్నీ, రాష్ట్రాన్నీ దిగజార్చే విధంగా 30 వేల ఎకరాల నుండి లక్ష ఎకరాల దాకా పంటలు పండే భూముల్నీ రాజధాని నిర్మాణం కొరకు సమీకరించే రాష్ట్ర ప్రభుత్వ విధానాలను, చర్యలను మేము ఖండిస్తున్నాం.*

*సాధారణ పరిపాలనా రాజధానిని, ప్రభుత్వ భూములలో, పంటలు పండని భూములలో నిర్మాణం చేయమనీ, ప్రజల వాస్తవిక సమస్యలైన ఆత్మహత్యలు, అధిక ధరలు, నిరుద్యోగం, అందరికీ అందుబాటులో విద్య, వైద్యం, రైతాంగానికి గిట్టుబాటు ధరలు, శ్రామికులకు కనీస వేతన చట్టాలూ, మహిళలూ, దళితుల పట్ల కొనసాగుతున్న వివక్ష, భాషా – సాంస్కృతిక వికాసం లాంటి సమస్యలను వేగంగా పరిష్కరించే దిశగా పని చేయమని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి అనధికార ప్రజా ప్రతినిధులమైన తెలుగు రచయితలుగా, ఆలోచనపరులుగా విజ్ఞప్తి చేస్తున్నాం.*

**– కె. రవిబాబు, ప్రజాసాహితి ప్రధాన సంపాదకులు**
**– దివి కుమార్, జనసాహితి ప్రధాన కార్యదర్శి**

*(140 మంది రచయితలూ, కవులూ, ఉద్యమకారులూ, మేధావులూ ఈ లేఖకు మద్దతు తెలుపుతూ సంతకం చేశారు.)*

# అరబిందో ఫార్మా కార్మికుల పోరాటం

***యాజమాన్యాలు కార్మికులకు చాలీచాలని వేతనాలు ఇస్తూ, న్యాయమైన డిమాండ్ల కోసం పోరాడుతున్న వారిపై అన్యాయంగా దాడులు చేస్తూ, అక్రమ కేసులు పెట్టి వేధింపులకు గురిచేస్తున్నాయని అంటున్నారు* పి.వి. రమణ**

శ్రీకాకుళం జిల్లా, రణస్థలం మండలం, పైడిభీమవరంలో అరబిందో ఫార్మా లిమిటెడ్ కంపెనీ 11వ యూనిట్‌గా 2001లో ప్రారంభమైంది. ఆ ప్రాంతంలో పంటలు పండే వ్యవసాయ భూములున్నాయి. భూములిస్తే వారి పిల్లలకు ఉద్యోగాలు కల్పిస్తామని, అనేక సంక్షేమ కార్యక్రమాలు అమలు చేస్తామని అక్కడ రైతులకు హామీలు ఇచ్చి దాదాపు 240 ఎకరాలు అతి తక్కువ ధరకు ఎకరం రు. 50 వేల నుండి ఒక లక్ష వరకు చెల్లించి కొనుగోలు చేశారు. ఈరోజు అక్కడ భూమి మార్కెట్ ధర ఎకరానికి దాదాపు రు. 80 లక్షల నుండి ఒక కోటి వరకు ఉంది. దీని బట్టి రైతులు ఎంత నష్టపోయారో అర్థమవుతుంది. అనాటి టిడిపి ప్రభుత్వం ఈ కంపెనీకి 15 ఏళ్ల పన్ను రాయితీ ఇచ్చింది. దీని వల్ల కంపెనీకి నెలకు 2.5 కోట్ల రూపాయల పన్ను మినహాయింపు పొందుతుంది. ఉద్యోగులకిచ్చే జీతాల కోసం నెలకు రు. 4 కోట్లు వెచ్చిస్తున్నారు. దీన్ని బట్టి ఉద్యోగుల జీతంలో 50 శాతానికి పైగా ప్రజల సొమ్మే చెల్లిస్తున్నట్లుగా అర్థమవుతుంది.

ఈ కంపెనీలో దాదాపు 2,200 మంది రెగ్యులర్ సిబ్బంది, 3,800 మంది కాంట్రాక్టు కార్మికులు పని చేస్తున్నారు. 1986లో ఒక చిన్న యూనిట్‌గా ప్రారంభమైన కంపెనీ, నేడు వేలాది కోట్లా రూపాయల టర్నోవర్‌తో వందలకోట్ల రూపాయల లాభాలతో ప్రపంచవ్యాప్తంగా దూసుకుపోతుంది. కాని ఈ ఎదుగుదలకు కారణమైన కార్మికులకు మాత్రం చాలీచాలని జీతాలు ఇస్తూ, న్యాయం అడిగిన వారిపై నిరంతరం దాడులు, అణిచివేత చర్యలు కొనసాగిస్తుంది కంపెనీ యాజమాన్యం. ఎక్కువ జీతాలు లభిస్తాయని ఆశతో బి.ఎస్.సి, ఎం.ఎస్.సి. కెమిస్ట్రీ చదువులు చదివి 25 నుండి 32 ఏళ్ల వయస్సు కలిగిన యువకులు అనేక మంది ఈ కంపెనీలో చేరారు. ఉద్యోగులలో అధిక శాతం మంది గత ఎన్నికల్లో టిడిపి కోసం సెలవులుపెట్టి మరీ పనిచేశారు. వీరి కుటుంబాలు కూడా ఆ పార్టీకే ఓట్లు వేశారు. వీరి ఓట్ల ప్రభావం వల్లనే అచ్చెం నాయుడు కార్మికమంత్రి అయ్యాడు. జీతాలు తక్కువ ఇవ్వడమే కాకుండా, కార్మికులను బానిసలుగా ఉపయోగించుకుంటున్నారు. యజమాన్యపు నిరంకుశ చర్యలు ఏళ్ల తరబడి భరించిన కార్మికులు, సంఘటితం కాకపోతే తమ సమస్యలు పరిష్కారం కావని గుర్తించారు.

అనేక సమస్యలపై వారు సంఘటితమైనప్పుడల్లా మేనేజ్‌మెంట్ వారి ఐక్యతను భగ్నం చేసింది. ఇక గత్యంతరంలేని పరిస్థితిలో వారు ఐఎఫ్‌టియు నాయకత్వంలో యూనియన్ పెట్టుకోవాలని నిర్ణయించుకుని 2013 ఏప్రిల్‌లో అరబిందో ఫార్మా ఎంప్లాయిస్ యూనియన్ రిజిస్ట్రేషన్‌కు పూనుకున్నారు. దీన్ని తట్టుకోలేని యాజమాన్యం వీరి ఐక్యతను దెబ్బతీసేందుకు అనేక కుయుక్తులకు పాల్పడింది. పోటీ యూనియన్‌ను ఏర్పాటు చేయడానికి ప్రయత్నించింది. రిజిస్ట్రేషన్‌కు పూనుకున్న బాధ్యులు ఏడుగురిలో ఇద్దరు ఉద్యోగులు జగదీష్, దుర్గా ప్రసాద్‌లను మే 20న కిడ్నాప్ చేశారు. జగదీష్‌ను డ్యూటీలో ఉండగా పని ఉందంటూ కంపెనీ వాహనంలోనే ఎక్కించుకున్నారు. అప్పటికి నారువ గ్రామంలో ఉన్న దుర్గాప్రసాద్‌ను గ్రామంలోనే జీపులో ఎక్కించుకుని విశాఖపట్టణానికి తీసుకువచ్చి లాడ్జిలో ఉంచారు. యూనియన్ నుండి వైదొలగాలని, ఒక్కొక్కరికి ఐదు లక్షల రూపాయలు ఇస్తామని, ప్రమోషన్‌లు కల్పిస్తామని ఆశలు కల్పించారు. కార్మికులు తెలివిగా ఆలోచించి చెపుతామని తప్పించుకుని మరుసటి రోజు రణస్థలం పోలీస్ స్టేషన్‌లో ఈ విషయం ఫిర్యాదు చేశారు.

యూనియన్ ఏర్పడకుండా చూడడానికి కంపెనీ యాజమాన్యం కిడ్నాప్‌లు, బెదిరింపులు, అక్రమ దాడులు, సస్పెన్షన్‌లు, ట్రాన్స్‌ఫర్‌లు, కార్మికులను కొనుగోలు చేయడానికి ప్రయత్నాలు, ప్రమోషన్ల ఆశ చూపించడం లాంటి అనేక ఎత్తుగడలను ప్రయోగించింది. యూనియన్ నాయకత్వాన్ని దెబ్బతీయడానికి జూలైలో 9 మందిని ఇతర యూనిట్లకు బదిలీ చేశారు. దానిపై, ఇతర సమస్యలపై కార్మికులు 83 రోజుల ఉద్యమం కొనసాగించారు. దీనిలో భాగంగా ధర్నాలు, నిరసన ప్రదర్శనలతో పాటు 2013 జూలై 1న శ్రీకాకుళం కలెక్టర్ ఆఫీసు దగ్గర మెగా రక్తదాన శిబిరం ఏర్పాటు చేసి వందలాది మంది కార్మికులు రక్తదానం చేశారు. ఆగస్టు 15న జిల్లా కలెక్టర్ రెడ్‌క్రాస్ సంస్థ తరుపున ఇటువంటి సామాజిక కార్యక్రమాలు నిర్వహించిన అరబిందో ఫార్మా ఎంప్లాయిస్ యూనియన్‌కు ప్రశంసా పత్రం కూడా ఇచ్చారు. జూలై 30న కార్మికుల భార్యలు, తల్లులు, అక్కా చెల్లెల్లు, పిల్లలతో సహా విజయనగరంలోని మెసానిక్ టెంపుల్‌లో నిరసన తెలిపారు. పోరాటాల ఫలితంగా సెప్టెంబర్ 30న చిట్టచివరకు హైదరాబాద్‌లో ఎడిషనల్ లేబర్ కమిషనర్ వద్ద జరిగిన అగ్రిమెంట్‌లో భాగంగా సస్పెన్షన్‌లను ఎత్తివేశారు.

2013 ఆగస్టు 6న యూనియన్ రిజిస్టర్ అయి సర్టిఫికేట్ కూడా పొందింది. అయినా మేనేజ్‌మెంట్ అణచివేత చర్యలను ఆపకుండా కొనసాగిస్తోంది. ఏప్రిల్ 2014లో యూనియన్ తమ డిమాండ్లను సమర్పించింది. ప్రధానంగా చుట్టు పక్కల ఉన్న ఇతర ఫార్మా కంపెనీలలో ఇస్తున్న జీతాలలాగ చెల్లించాలని కోరారు. మిగతా కంపెనీల కన్నా అరబిందో కంపెనీలో సంవత్సరానికి ఎంత తక్కువ జీతాలు చెల్లిస్తున్నారో పట్టికను బట్టి తెలుస్తుంది.

| | అరబిందో (లక్షల రు.) | దివీస్ (లక్షల రు.) | మైలాన్ (లక్షల రు.) | డా. రెడ్డీస్ (లక్షల రు.) |
|---|---|---|---|---|
| కెమిస్ట్ | 1.02–1.20 | 1.80–2.40 | 1.30–2.50 | 1.50–2.30 |
| సీనియర్ కెమిస్ట్ | 1.02–2.00 | 2.80–3.80 | 2.30–3.20 | 2.50–3.60 |
| ఆఫీసర్ | 1.50–2.40 | 3.80–4.50 | 3.40–4.50 | 2.60–3.80 |
| ఎగ్జిక్యూటివ్ | 3.00–3.60 | 4.80–5.80 | 4.50–5.30 | 3.80–5.30 |

పై కంపెనీలతో సమానంగా జీతాలతో పాటు, ఇంక్రిమెంట్లు,

సెలవులు, బోనస్, రవాణా, భోజన సౌకర్యం లాంటి ప్రాథమికమైన డిమాండ్లను సమర్పించారు. 2014 మే నుండి జూలై వరకూ జాయింట్ లేబర్ కమిషనర్‌తో చర్చలు జరిగాయి. ఆగస్టు 27న కార్మిక మంత్రి అచ్చెం నాయుడు వద్ద కంపెనీకి, కార్మికులకు మధ్య సమావేశం జరిగింది. తను మధ్యవర్తిత్వం వహించి సమస్యను పరిష్కరిస్తానని హామీ ఇచ్చిన మంత్రి తన వాగ్దానం నిలబెట్టుకోలేదు.

చర్చలు కొనసాగుతున్నా యాజమాన్యం అణచివేత చర్యలు ఆపలేదు. ఐదుగురు కార్యకర్తలను సస్పెండ్ చేసింది. వీరిలో ముగ్గురిపై తప్పుడు అభియోగం మోపి పోలీసులకు ఫిర్యాదు చేసింది. మొదట్లో ఈ కంపెనీలో కార్మికులకు అవసరమైనప్పుడు రెండు గంటల అనుమతి తీసుకునే సదుపాయం ఉండేది. కక్ష కట్టిన యాజమాన్యం అకస్మాత్తుగా ఆ సదుపాయాన్ని తొలగించివేసింది. దాంతో కార్మికులతో చర్చించకుండా ఈ సదుపాయాన్ని ఎలా తొలగిస్తారని అడిగినందుకు కార్మికులు అధికారుల్ని దుర్భాషలాడి గాయపరిచారని అబద్ధపు ఫిర్యాదు చేయగానే పోలీసులు స్వయంగా ప్లాంట్‌లోకి వచ్చి అందర్నీ భయభ్రాంతులను చేసి శంకర్, రమేష్, సతీష్‌లను అరెస్టు చేశారు. 2014 అక్టోబర్ 2న సి.ఐ., ఎస్.ఐ. దాదాపు ముప్పైమంది కానిస్టేబుల్స్ నేరుగా ప్లాంటులోకే వచ్చి ఈ ముగ్గుర్నీ అరెస్ట్ చేసి తీసుకెళ్లారు. ఆ సమయంలో తామేమీ తప్పుచేయలేదని కార్మికులు వివరిస్తుంటే సి.ఐ. స్వయంగా 'నాకు తెలుసు, కాని మీరు కంపెనీ యాజమాన్యానికి కోపం తెప్పించారు. అందుకే ఈ చర్య తీసుకోవలసి వచ్చిందని' అక్కడ ఉన్న కార్మికులతో అన్నారంటే మేనేజ్‌మెంట్ దుర్మార్గం అర్థమవుతుంది. వెంటనే 150 మంది కార్మికులు 100 కిలోమీటర్ల దూరంలో ఉన్న కార్మికమంత్రి అచ్చెంనాయుడిని కలిసి సమస్య పరిష్కరించడానికి పూనుకోవలసిందిగా విజ్ఞప్తి చేశారు. కాని మంత్రి అక్రమాలకు, చట్టవ్యతిరేక చర్యలకు పాల్పడిన యాజమాన్యం కొమ్ముకాసి కార్మికులను ముందు డ్యూటీలకు భేషరతుగా వెళ్లిపొమ్మని ఉచిత సలహా ఇచ్చారు గానీ సమస్య పరిష్కారానికి పూనుకోలేదు.

అక్టోబర్ 11న ప్రారంభమైన భయంకర హుదూద్ తుఫాన్ కారణం గా ఉత్తరాంధ్ర అంతా అల్లకల్లోలంగా మారి రోడ్లన్నీ బంద్ అయి, రవాణా సౌకర్యం నిలిచిపోయిందనీ అందరికీ తెలుసు. ఎవరూ ఎక్కడికీ వెళ్లలేని పరిస్థితి ఏర్పడింది. ఆ సమయంలో కంపెనీలో పనిచేస్తున్న 300 మంది కార్మికులు తమ షిఫ్ట్ టైమ్ అయి పోయినా ఇళ్లకు వెళ్లకుండా పరిశ్రమ ధ్వంసం కాకుండా కాపాడారు. లక్షల రూపాయల జీతాలు తీసుకుంటున్న అధికారులు అక్టోబర్ 11, 12 తేదీలలో పని స్థలాన్ని వదిలి క్షేమమైన ప్రదేశాలలో తలదాచుకున్నారు. ప్రాణాలకు తెగించి కంపెనీని భారీ విధ్వంసం నుండి కాపాడిన కార్మికుల పట్ల ఏ మాత్రమూ కృతజ్ఞతలేని మేనేజ్‌మెంట్ అణచివేత చర్యల్ని మరింత పెంచింది.

హుదూద్ తుఫాన్ మొత్తం ఉత్తరాంధ్రను కకావికలం చేసిన సంగతి ప్రపంచమంతటికీ తెలుసు. ఇళ్లనుండి ఎవరూ కదలలేని పరిస్థితి. బయటకు వస్తే ప్రాణాలతో మిగలని పరిస్థితి. ఇలాంటి ప్రకృతి బీభత్సాల సందర్భంగా పరిశ్రమలు, ప్రభుత్వాలు డ్యూటీలకు రాలేకపోయిన కాలాన్ని డ్యూటీ కిందే పరిగణించడం సర్వసాధారణమైన విషయం. ఆ ప్రాంతంలో ఉన్న ఇతర ఫార్మా కంపెనీలు దాన్ని అమలు చేశాయి కూడా. కాని, కార్మికులపై పగబట్టిన అరబిందో యాజమాన్యం అక్టోబర్ 23న హాజరు కాలేని కార్మికులందరినీ సెలవులు పెట్టుకోవాలని కోరింది. దాంతో యూనియన్ 24న తుఫాన్ బీభత్సంవల్ల పనులకు హాజరు కాలేకపోయాం తప్ప, కావాలని పనులకు రావడం మానేయలేదని, హాజరుకాని కాలాన్ని డ్యూటీగా గుర్తించాలని కోరింది. కాని యాజమాన్యం 24 మందికి షోకాజ్ నోటీసులు ఇచ్చి గేటు దగ్గరే ఆపేసింది. ఇదేమి అన్యాయమని అడిగినందుకు అక్టోబర్ 26న దాదాపు 1800 మంది కార్మికులను డ్యూటీలో చేరకుండా గేటు దగ్గరే లోపలకు రాకుండా అడ్డు పడ్డారు. పైగా అందరినీ యూనియన్‌ను రద్దు చేసుకుంటామని, యాజమాన్యం చెప్పినట్లు నడుచుకుంటామని హామీ పత్రం ఇస్తేనే లోపలకి రావచ్చని హెచ్చరించింది. ఇవన్నీ కార్మిక వ్యతిరేక చర్యలే కాకుండా చట్ట వ్యతిరేకం కూడా అని, యూనియన్ పెట్టుకోవడం రాజ్యాంగబద్ధమైన హక్కని కార్మికులు వివరించినా యాజమాన్యం ఖాతరు చేయలేదు. పైగా కార్మికులే సమ్మె చేస్తున్నారని ప్రచారం మొదలుపెట్టింది.

వందలాది మంది కార్మికులను బయటకు నెట్టేసిన కంపెనీ తరువాత భయపెట్టి, బెదిరించి, ఆశచూపి రకరకాల ఎత్తుగడల ద్వారా దాదాపు 500 మంది కార్మికులతో బలవంతంగా కంపెనీలో ఉత్పత్తి కొనసాగి స్తుంది. వారిపై కూడా ఎటువంటి దాక్షిణ్యం లేకుండా బెదిరింపులు, అణచివేత చర్యలు కొనసాగిస్తూనే ఉంది. ఫార్మా కంపెనీలలో ఉత్పత్తి చాలా ప్రమాదకరమైన పరిస్థితులలో కొనసాగుతుంది. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా భారీ ప్రమాదాలు వాటిల్లి ఆస్తి నష్టంతో పాటు ప్రాణనష్టం కూడా జరుగుతుంది. ప్రమాదాలు జరగకుండా నిరంతరం శిక్షితులైన కార్మికుల నిఘాలో, సంఖ్యాపరంగా నిర్దిష్టమైన కార్మికులతో పనులు చేయాలి. కాని 80 శాతం కార్మికులను బయటకు నెట్టి కేవలం 20 శాతం మంది సిబ్బంది, కాంట్రాక్టు కార్మికులతో ఉత్పత్తి కొనసాగించడం వల్ల భారీ ప్రమాదాలు జరిగే అవకాశం ఉంది. ఈ మధ్య ఒక డ్రగ్ ఉత్పత్తి కార్యక్రమంలో రు.1 లక్షా 50 వేల నష్టం వాటిల్లితే ఒక కార్మికుడ్ని బాధ్యుడ్ని చేసి విధుల నుండి తొలగించారు. నిర్దిష్టమైన ప్రమాణాలకు తిలోదకాలిస్తే ఇటువంటి ప్రమాదాలు ఇంకా ఎక్కువ జరుగుతాయి.

మేనేజ్‌మెంట్ లోపల పనిచేస్తున్న కార్మికుల్లో కొంతమందిని యూనియన్ ఏజెంట్లుగా ముద్ర వేసి తొలగించడం చేసింది. 2015 జనవరి 18న ఇద్దరిని, 19న ముగ్గురిని పని నుండి తొలగించిన ఆదేశాల తో పాటు వారికి రావలసిన బకాయిలను చెక్కు రూపంలో ఇంటికే రిజిస్టర్‌పోస్ట్‌లో పంపారు. కార్మికుల సమస్య లేబర్ డిపార్ట్‌మెంట్ వద్ద పరిష్కారానికి పెండింగ్‌లో ఉండగా చట్టప్రకారం యాజమాన్యం ఎటువంటి అణచివేత చర్యలు కొనసాగించ కూడదు. కాని అరబిందో యాజమాన్యానికి చట్టం పట్ల గాని, రాజ్యాంగం పట్ల గాని ఎటువంటి గౌరవం లేదని వారి చర్యల ద్వారా నిరూపిస్తున్నారు. అక్టోబర్ నెలలో పని చేసిన కాలానికి జీతాల చెల్లింపు చట్టప్రకారం చెల్లించకుండా పనిచేసే కాలంలోనే చెల్లిస్తామని చట్టాన్ని కూడా ఉల్లంఘిస్తున్నారు.

2014 అక్టోబర్ 26 నుండి బయటకు నెట్టివేసిన కార్మికులు యూనియన్ నాయకత్వంలో తమ నిరసన తెలపడానికి వీలులేకుండా నిషేధాజ్ఞలు ప్రకటించారు. ఫ్యాక్టరీ దగ్గర కనీసం నిరసన దీక్షలకు అనుమతి నిరాకరించారు. కేవలం మౌన ప్రదర్శన జరుపుతామని కోరితే అనుమతి ఇచ్చినట్లే ఇచ్చి చివరి క్షణంలో రద్దుచేశారు.

**ఎమర్జెన్సీని తలపించే దాడులు, అరెస్టులు**

కార్మికుల పోరాటానికి మద్దతుగా డిసెంబర్ 10న 10 వామపక్ష పార్టీల ఆధ్వర్యంలో శ్రీకాకుళంలోని బలగ హాస్పిటల్ నుండి 7 రోడ్ల జంక్షన్ వరకూ సంఘీభావ ప్రదర్శన, అనంతరం బహిరంగ సభ నిర్వహించడానికి ప్రయత్నిస్తే పోలీసులు మొత్తం శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలను యుద్ధ భూమిగా మార్చారు. విజయనగరం టౌనులోనూ, పరిసర గ్రామాలలోనూ యూనియన్ కార్యకర్తల ఇళ్లపై డిసెంబర్ 9న అర్ధరాత్రి నుంచి దాడులు జరిగాయి. అనేక మందిని

ప్యాంట్లు కూడా తొడుక్కోనివ్వకుండా కనీసం లుంగీలు కట్టుకోనివ్వకుండా దాదాపు 20 మందిని అరెస్టు చేశారు. వారిలో కొంతమందిని ఒడిశా బోర్డర్ దగ్గర ఉన్న మెంటాడ పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్లి తీవ్రమైన మానసిక క్షోభకు గురిచేశారు. లావేరు, రణస్థలం, నాతవలస జంక్షన్, ఆముదాలవలస రైల్వేస్టేషన్, శ్రీకాకుళం పట్టణంలో కూడా రోడ్ల ప్రారంభంలో కాపు కాసి బస్సులను ఆటోలను ఆపి ప్రతి ఒక్కరిని ప్రశ్నించి అనేక మందిని అరెస్టులు చేశారు. మేం కార్మికులం కాదని చెప్పినా వినకుండా పోలీసులు సాధారణ ప్రయాణికులను గమ్యం చేరకుండా మధ్యలోనే అనేక చోట్ల దించేసి జులుం ప్రదర్శించారు. సాధారణ ప్రజలు ఈ దాడిని చూసి భయభ్రాంతులయ్యారు. పైడి భీమవరం నుండి శ్రీకాకుళం వరకు దాదాపు 37 కిలోమీటర్ల పొడవునా పోలీసు పహరా ఏర్పాటు చేశారు. 15 వ్యాన్‌లలో శ్రీకాకుళమంతా వేటాడి, వెంటాడి దొరికిన వారిని దొరికినట్లు అరెస్టు చేశారు. శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల 11 మండలాలలో ఉన్న కార్మికులపై, కార్యకర్తలపై దాడి చేసి అరెస్టు చేశారు. శ్రీకాకుళంలో సి.పి.ఐ. ఆఫీసులో ప్రెస్‌మీట్ జరుగుతుండగానే నేరుగా పోలీసులు లోపలకు దూసుకువచ్చి కొంత మందిని బయటకు లాక్కెళ్లారు. 10 పార్టీల నాయకులు కలెక్టర్‌ను కలిసి పరిస్థితిని వివరించడానికి ప్రయత్నించగా వారిని మార్గమధ్యంలోనే అరెస్టులు చేశారు.

ఈ దాడులు, అరెస్టులు జరిగి అంతా సద్దుమణిగిందనుకున్న సమయంలో అకస్మాత్తుగా కార్మికులు సాయంత్రం 4 గంటలకు చిన్న చిన్న గ్రూపులుగా అనేక చోట్ల నుండి దాదాపు 400 మంది కార్మికులు సమూహంగా ఏర్పడి బస్‌స్టాండు నుండి 7 రోడ్ల జంక్షన్ వరకూ దాదాపు ఒక కిలోమీటరు దూరం నిరసన ప్రదర్శన కొనసాగించారు. ప్రదర్శనలో 'కాసుల మంత్రీ - కార్మిక మంత్రీ', 'కంపెనీ మంత్రీ-కార్మిక మంత్రీ', 'కార్పొరేట్ మంత్రీ-కార్మిక మంత్రీ' అనే నినాదాలు ఇచ్చారు. తరువాత విషయం తెలుసుకున్న పోలీసులు చాలా మందిని అరెస్టులు చేశారు. మొత్తంగా విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలో దాదాపు 500 మంది కార్మికులను, వామపక్ష పార్టీల నాయకులను అరెస్టు చేశారు.

'దేశంలో ఎక్కడా లేని విధంగా రాష్ట్ర ప్రభుత్వం కార్మికులను అణచివేసేందుకు ప్రయత్నిస్తుందని, శ్రీకాకుళం జిల్లాకే చెందిన కార్మిక మంత్రి అచ్చెంనాయుడు కార్పొరేట్ సంస్థలకు అండగా నిలబడి కార్మికులపై అణచివేత చర్యలకు పాల్పడుతున్నారని, చంద్రబాబు నాయుడు కార్పొరేట్ సంస్థల పెట్టుబడులను ఆహ్వానించే మైకంలో శ్రమ జీవులను అణచివేసే ప్రయత్నాలు చేస్తున్నారని' రాష్ట్ర సి.పి.ఐ. కార్యదర్శి కె. రామకృష్ణ విమర్శించారు. 'కార్మికులు యూనియన్ పెట్టుకోవడం వారి హక్కని, వారి హక్కులను కాలరాయడానికి నేడు పాలకులు ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేస్తున్నారని అరబిందో కార్మికుల సమస్యను శాంతియుతంగా పరిష్కరించకుండా జిల్లాను అగ్ని గుండంగా మార్చుతారా?' అని సిపిఎం రాష్ట్ర కార్యవర్గసభ్యులు చౌదరి తేజేశ్వరరావు విమర్శించారు. పోలీసు నిర్బంధం ఎమర్జెన్సీని తలపిస్తుందని పలువురు నాయకులు ఆగ్రహం వ్యక్తం చేశారు.

**కార్పొరేట్ శక్తుల చేతుల్లో కీలుబొమ్మగా మారిన కార్మికశాఖ యంత్రాంగం**

చర్చలు కొనసాగుతుండగానే రాష్ట్ర ప్రభుత్వం ఎప్పుడో 2012 డిసెంబర్ 7న మురిగిపోయిన జి.ఒను అకస్మాత్తుగా 2014 నవంబర్ 1న జీవం పోసి ఫార్మా పరిశ్రమలను ప్రజావినియోగ సర్వీసుగా ప్రకటిస్తూ కొత్త జి.ఒను విడుదల చేసింది. ఆశ్చర్యంగా అదే తేదీన జాయింట్ లేబర్ కమిషనర్ అరబిందో కంపెనీ లేవనెత్తిన అభ్యంతరాలపై సమాధానమివ్వాలని యూనియన్‌కు ఉత్తరం రాసింది. అదే తేదీన మరో ఉత్తరం ద్వారా జాయింట్ లేబర్ కమిషనర్ కేసును లేబర్ కోర్టుకు పంపామని యూనియన్‌ను వెంటనే సమ్మె విరమించాలని ఏకపక్షంగా తెలియజేసింది. రాష్ట్రప్రభుత్వం జి.ఒ విడుదల చేసిన రోజునే జాయింట్ లేబర్ కమిషనర్ సమస్యను లేబర్ కోర్టుకు పంపడం యాధృచ్ఛికం కాదనీ, కార్పొరేట్ శక్తుల ప్రభావం ఏ స్థాయిలో ఉందో అర్థమవుతుంది. నిజానికి కార్మికులు తాము సమ్మెచేయడం లేదని మొదటి నుంచీ వాదిస్తున్నా, మేనేజ్‌మెంట్ వాదననే జె.సి.ఎల్ కూడా అంగీకరించడం దీన్ని రుజువుచేస్తుంది.

అరబిందో యాజమాన్యపు కార్మిక వ్యతిరేక చర్యలపై ఎప్పటికప్పుడు యూనియన్ జిల్లాలో లేబర్ కమిషనర్‌కు, ఉత్తరాంధ్ర 3 జిల్లాలకు అధికారి అయిన జాయింట్ లేబర్ కమిషనర్‌కు చట్ట ప్రకారం సమస్యను పరిష్కరించమని క్రమం తప్పకుండా నివేదిస్తూనే ఉంది. కాని లేబర్ డిపార్ట్‌మెంట్ కూడా యాజమాన్యానికి అనుకూలంగానే ప్రవర్తించింది. డిమాండ్ల సమస్యను నవంబర్ 1న లేబర్ కోర్టుకు పంపేసి చేతులు దులుపుకుంది. నిజానికి జూలై 2013 నుండి లేబర్ కోర్టులో జడ్జిలేదన్న సంగతి జె.సి.ఎల్‌కి తెలిసే ఈ పనిచేయడం వెనుక ఎవరున్నారో తెలుస్తుంది. కార్మికులను అక్రమంగా సస్పెండ్ చేయడం, అక్రమంగా బదిలీ చేయడం, పనిచేసిన కాలానికి చట్టప్రకారం చెల్లించాల్సిన జీతాలు చెల్లించకపోవడం, చెల్లించాల్సిన ఇంక్రిమెంట్‌లను ఇవ్వకపోవడం, చురుకుగా ఉన్న కార్యకర్తలను ఉద్యోగాల నుండి తొలగించడం లాంటి సమస్యలపై యూనియన్ చేస్తున్న అభియోగాలను జె.సి.ఎల్ నవంబర్11న లేబర్ కమిషనర్‌కు రాసిన ఉత్తరంలో ఉటంకిస్తూ వాటిపై అవసరమైన చర్యలు తీసుకోవడానికి ఆదేశాలిమ్మని కోరారు. వీటన్నిటిపై ప్రతిస్పందించిన హైదరాబాద్‌లోని లేబర్ కమిషనర్ 2014 డిసెంబర్ 12న అన్ని అభియోగాలపై చట్ట ప్రకారం సమస్యలను పరిష్కరించమని జె.సి.ఎల్‌కు ఆదేశాలిచ్చారు.

నాటి నుండి దీనిపై వెంటనే చర్చలు ఏర్పాటు చేసి సమస్యను పరిష్కరించమని యూనియన్ కార్యకర్తలు జె.సి.ఎల్‌కు నివేదించడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. కాని ఆశ్చర్యకరంగా ఆనాటి నుండి జె.సి.ఎల్ కనిపించకుండా పోయారు. ఆఫీసుకు వచ్చారని తెలిసి వెళితే అప్పుడే వెళ్లిపోయారని చెప్పడం, కొన్నిసార్లు సెలవులో ఉన్నారని చెప్పడం జరిగింది. ఇటువంటి పరిస్థితి కార్మికశాఖలో గతంలో ఎప్పుడూ జరగలేదు. విశాఖలో ఉన్న జె.సి.ఎల్‌ను కలవడానికి తిరిగి తిరిగి విసిగిపోయి వేరే దారిలేక జెసిఎల్ ఆఫీసు వద్దే 2015 జనవరి 5 నుండి వంటావార్పు కార్యక్రమంతోపాటు నిరవధిక ధర్నా కొనసాగిస్తున్నారు. పగలూ, రాత్రీ వందలాది మంది కార్మికులు అక్కడే వంట చేసుకుని నిరసన సాగిస్తున్నారు. రాత్రుళ్లు అందరూ చలికి ఇళ్లల్లో వెచ్చగా ముసుగు వేసుకుని నిద్రపోతున్న సమయంలో కార్మికులు రోడ్లపై చలికి గజగజ వణుకుతూ కూడా తమ నిరసన కొనసాగించడం, వందలాది మంది రోజూ తమ వంటలు తామే చేసుకుని, తిన్న తరువాత ఎటువంటి చెత్తా, కాలుష్యం సమస్య రాకుండా క్రమశిక్షణతో తమ ప్లేట్లను తామే శుభ్రం చేసుకుంటూ, అందరిలా వ్యర్థాలను ఇష్టమొచ్చినట్లు కాలువల్లో పారేయకుండా, చుట్టుపక్కల ఎటువంటి చెత్తా పేరుకు పోకుండా నిర్దిష్టమైన చర్యలు తీసుకోవడం అపూర్వమైన విషయం.

కార్మికుల పోరాటానికి మద్దతుగా పౌరహక్కుల సంఘం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ తరుపున రాష్ట్ర కార్యదర్శి చిలుకా చంద్రశేఖర్, సహాయ కార్యదర్శి ఎన్. శ్రీమన్నారాయణల ఆధ్వర్యంలో 9 మంది సభ్యులతో జనవరి 10, 2015న నిజనిర్ధారణ కమిటీగా విశాఖపట్నం, శ్రీకాకుళం

పర్యటించి విడుదల చేసిన నివేదికలో 'రాష్ట్ర కార్మిక మంత్రి ప్రాధాన్యత వహిస్తున్న జిల్లాలో వందలాది మంది కార్మికులు నెలల తరబడి యాజమాన్యం నిర్లక్ష్యానికి గురికావడం ప్రభుత్వ పనితీరుకు నిదర్శనం. వారం రోజులలో పరిశ్రమలకు అన్ని అనుమతులూ ఇస్తామని హామీలిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం నెలల తరబడి కార్మికుల సమస్యను అడుగుతుంటే పట్టించుకోకపోవడం, ఈ ప్రభుత్వం యాజమాన్యాల వైపే గాని ప్రజల్లో భాగమైన కార్మికులను పట్టించుకోదని తేట తెల్లమవుతుంది. ఇప్పటికైనా అరబిందో కంపెనీ సాగిస్తున్న చట్ట వ్యతిరేక చర్యలన్నిటినీ ఆపాలని, కార్మికుల న్యాయమైన డిమాండ్లను వెంటనే పరిష్కరించాలని' ప్రకటించింది.

**లాభాల వేటలో ప్రాణాలు తీసే కార్పొరేట్ సంస్కృతి**

అరబిందో ఫార్మా కంపెనీ 1986లో పి.వి. రామ్‌ప్రసాద్‌రెడ్డి, కె. నిత్యానంద రెడ్డి, ఇతరులతో చిన్న కంపెనీగా మొదలైంది. 1989లో పాండిచ్చేరిలో సెమీ సింథటిక్ పెన్సిలిన్ తయారీ యూనిట్ ప్రారంభించింది. 1992లో పబ్లిక్ కంపెనీగా మారింది. దేశంలో ఇప్పటికే 9 యూనిట్లు హైదరాబాద్‌లోనూ, 1 యూనిట్ మహబూబ్ నగర్‌లోనూ ఉన్నాయి. 11వ యూనిట్‌గా శ్రీకాకుళం జిల్లాలో పైడిభీమవరంలో 2001లో ప్రారంభమైంది. మరో రెండు యూనిట్లు పరవాడలోనూ, మరొకటి నెల్లూరులోనూ నిర్మాణంలో ఉన్నాయి.

2015 – 16 నాటికి 2 బిలియన్ డాలర్ల వ్యాపారానికి చేరుకోవాలనేదే కంపెనీ లక్ష్యం. ఆసియాలోకెల్లా పెద్ద జెనరిక్ ఫార్మా కంపెనీగా ఎదగాలని, ప్రపంచ స్థాయి 15 కంపెనీలలో ఒకటిగా ఎదగాలనే లక్ష్యంతో ఉంది. 2014లో 7 పశ్చిమ యూరప్ దేశాలలో ఆక్టివిస్ కంపెనీ ఆపరేషన్స్‌ను 41 మిలియన్ డాలర్లకు కొనుగోలు చేసింది. నేడు ప్రపంచంలో 125 దేశాలకు తన ఉత్పత్తులను ఎగుమతి చేస్తుంది. అమెరికా, యూరప్ మార్కెట్‌లలో దూసుకుపోవడానికి 165 మిలియన్ యూరోలను ఖర్చు చేయడానికి సిద్ధంగా ఉంది. 2005 – 06లో 315.8 మిలియన్ యూరోల వ్యాపారం చేసింది. దీనిలో 47 శాతం దేశీయ మార్కెట్ ద్వారా, 53 శాతం విదేశీ ఎగుమతుల ద్వారా సాధించింది. విదేశాలకు మరింత ఎగుమతులు పెంచాలని భవిష్యత్‌లో 70 శాతానికి చేరాలనే లక్ష్యంతో ఉన్నారు. ప్రపంచ వ్యాప్తంగా కంపెనీ బ్రాంచ్‌లు, అనుబంధ సంస్థలు అమెరికా, బ్రిటన్, దక్షిణ ఆఫ్రికా, టర్కీ మాల్టా, బాంగ్‌కాక్, నైజీరియా, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్స్, జపాన్, స్పెయిన్, ఆస్ట్రేలియా, నెదర్లాండ్స్, పోర్చుగల్, చైనా, బ్రెజిల్, రొమేనియా, సింగపూర్, పోలెండ్, న్యూజిలాండ్, మెక్సికో, కొలంబియాలలో ఉన్నాయి. 2004లో ఆసియాలో వేగంగా దూసుకుపోతున్న ప్రముఖ 100 కంపెనీలకు చెందిన ఫోర్బ్స్ లిస్టులో ఈ కంపెనీ చోటు చేసుకుంది. భారత్‌లో అగ్రభాగాన గల ఐదు ఫార్మా కంపెనీలలో కూడా చోటు చేసుకుంది.

సమన్యాయం, వ్యక్తుల పట్ల గౌరవం, టీమ్‌గా కలిసి పనిచేయడం పారదర్శకత, జవాబుదారీ తనం, నిజాయితీ లాంటి ఉన్నత విలువలను పాటిస్తానని గొప్పగా ప్రకటించిన అరబిందో కంపెనీ, వీటికి భిన్నంగా లాభాల వేటలో ఎంత మంది జీవితాలనైనా బలిపెట్టే అసలు కార్పొరేట్ సంస్కృతిని బయటపెట్టుకుంది. ఎవరి రక్తం, చెమట తమ కోట్ల రూపాయల లాభాలకు కారణమో వారు బానిసల్లా పడి ఉంటే ఫరవాలేదు కానీ, సంఘటిత శక్తిగా మారి హక్కులు, న్యాయం, ధర్మం అని మాట్లాడితే సహించేది లేదని అరబిందో కంపెనీ తన ఆచరణ ద్వారా నిరూపించింది. రణస్థలం, శ్రీకాకుళం, విజయనగరాలలో విలేఖరుల సమావేశాలు ఏర్పాటు చేసి, తాము పరిష్కారానికి సిద్ధంగా ఉన్నా ఐ.ఎఫ్.టి.యు నాయకత్వం అడ్డుకుంటుందని, బయటి శక్తులైన యూనియన్ నాయకులను వదిలేసి కార్మికులు స్వయంగా వస్తే సమస్యలను పరిష్కరిస్తామని ప్రచారం చేయడం దీనినే రుజువు చేస్తుంది.

మహబూబ్‌నగర్ ప్లాంటులో తయారైన గాబాపెంటిన్ అనే కాప్స్యూల్స్ లో అసలు మందే లేకుండా ఖాళీ కాప్స్యూల్స్ అమెరికాకు ఎగుమతి అయి, వాటిపై అక్కడ ఆందోళన రాగానే కంపెనీ వెంటనే 24,816 బాటిల్స్‌ను వెనక్కి తీసుకుంటున్నట్లుగా వార్తలు వచ్చాయి. లాభాల వేటలో నాణ్యత, భద్రత, జవాబుదారీ తనం కార్పొరేట్ కంపెనీలలో కొరవడ తాయనడానికి ఇదొక నిదర్శనం.

ఎక్కడా లేని విధంగా అరబిందో కంపెనీ కార్మికులపై కపట ప్రేమను ప్రకటిస్తూ ఐదు కరపత్రాలను కూడా విడుదల చేసింది. వాటిలో 'చదువుకున్న కార్మిక ఉద్యోగ సోదరులు చదువు మర్చిపోయి అవగాహనా లోపంతో స్వార్థపరులైన నాయకులను గుడ్డిగా నమ్మి, వారికి జీవనోపాధి కల్పించిన యాజమాన్యంపై తప్పుడు ప్రచారంతో తిరుగుబాటు ధోరణికి ఉసిగొల్పడం, కర్మాగారాన్ని స్తంభింపజేయడానికి ప్రయత్నించడం చాలా బాధాకరం. మీకు నాయకత్వం వహిస్తున్న ఐ.ఎఫ్.టి.యు చరిత్ర పుటల్లో ఎన్నో కంపెనీల కార్మిక సోదరులు కన్నీటిలో తడిసిముద్దయ్యారు. ఐ.ఎఫ్.టి.యు ని నమ్ముకుంటే గొర్రె కసాయి వాడిని నమ్మినట్లే. ఐ.ఎఫ్.టి.యు లాంటి కార్మిక వ్యతిరేక కుట్రలు పన్నే చీకటి శక్తిని పారద్రోలండి. అరబిందో యాజమాన్యానికి ఎవరి మీదా కడుపు మంట లేదు. యాజమాన్యం పరిశ్రమకు తండ్రి లాంటిది. ఉద్యోగులను తమ బిడ్డలుగా చూసుకుంటుంది. 2015 జనవరి 1న అరబిందో కుటుంబ సభ్యులైన మీ అందరికీ వెలుగులు ప్రసాదించాలనే నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాం' అని నోటితో నవ్వి నొసలుతో వెక్కిరించిన చందాన కార్మికులపై కపట ప్రేమను ప్రకటిస్తూ కార్మికులకు నాయకత్వం వహిస్తున్న యూనియన్‌పై ఎంత ద్వేషముందో స్పష్టం చేశారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్పొరేట్ శక్తులకు ఎర్ర తివాచి పరచి, వారేంచేసినా ఫరవాలేదనే హామీలిచ్చిన కారణంగానే కార్పొరేట్ కంపెనీలు కార్మికులపై తీవ్రమైన దాడులు సాగిస్తున్నాయి. ఇది కేవలం అరబిందో కార్మికుల సమస్య మాత్రమే కాదు. మొత్తం భారత కార్మిక వర్గం ఈ ప్రమాదాన్ని ఎదుర్కోబోతుంది. కార్మికులు చట్టపరంగా, శాంతియుతంగా సమస్యల పరిష్కారాన్ని కోరుకుంటున్నప్పుడు పోలీసులు ప్లాంటులోకే వచ్చి అరెస్టులు చేయడం, ఇళ్లదగ్గర, రోడ్లపైనా వేటాడి, వెంటాడి అరెస్టులు చేసి భయభ్రాంతులను చేయడం, రాజకీయ పార్టీల ఆఫీసులలోకే పోలీసులు చొరబడి దాడులు చేయడం ఇవన్నీ ప్రమాద సంకేతాలేనని అర్థమవుతుంది.

అరబిందో ఫార్మా కంపెనీ నిరంకుశ చర్యల కారణంగా 2014 అక్టోబర్ 2 నుండీ రోడ్లపైనే ఉన్న 1800 మంది కార్మికులు తమ న్యాయమైన పోరాటంలో భాగంగా విశాఖపట్నంలో వంటా వార్పు కార్యక్రమాన్ని కొనసాగిస్తూనే మరో వైపు నగరంలో ఉన్న అన్ని రాజకీయ పార్టీలను, ప్రజాసంఘాలను, కలుపుకుంటూ వివిధరూపాలలో ఆందోళన కొనసాగిస్తున్నారు. ప్రజాస్వామికవాదులు, కార్మికసంఘాలు, రాజకీయాల తో ప్రమేయం లేకుండా, ఆత్మ గౌరవంతో జీవించే హక్కుకై పోరాడుతున్న అరబిందో కార్మికులకు పూర్తి మద్దతునిచ్చి ప్రజాస్వామ్యాన్ని బతికించు కోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకుడు)* వీ

# దేశంలో శ్రామిక చట్టాలు - సరళీకరణ

***ప్రపంచీకరణ, సరళీకరణ ఆర్థిక విధానాలను దేశంలో అమలుపర్చడం కోసం పాలక వర్గాలు రాజ్యాంగబద్ధమైన కార్మిక చట్టాలను ఏ విధంగా బలహీనం చేస్తున్నాయో వివరిస్తున్నారు బి.ఎస్. రాజు***

*శ్రామిక శక్తికి, పెట్టుబడికి మధ్య ఉన్న వర్గాధికార పొందిక ప్రతిబింబమే శ్రామిక చట్టాలు. భూగోళమంతా పెట్టుబడి సర్వశక్తి మంతమై ఉన్న ప్రస్తుత సందర్భంలో, శ్రామికవర్గం ఆర్థిక సరళీకరణకు పూర్వం సాధించుకున్న ఫలాలన్నీ ఇప్పుడు తుత్తునియలై చేజారి పోతున్నాయి. సర్వత్రా శ్రామికులను తాత్కాలిక పనివారుగా కుదిస్తూ, శ్రమ ఖర్చును రాజ్యానికి బదిలీ చేస్తూ, పెట్టుబడి అంతర్జాతీయ శ్రామిక రాశులను కకావికలు చేస్తోంది. ఈ క్రమంలోనే భారతదేశం భూగోళపు చెమట కుహరంగా (గ్లోబల్ స్వెట్ షాప్) మారుతుంది. మోడీ ప్రభుత్వపు అధికార బలం ఈ పరిణామాన్ని మరింత వేగవంతం చేస్తుంది'– 'ఇండియాలో కార్మిక చట్టాల సరళీకరణ రాజకీయ అర్థశాస్త్రం' అనే పత్రం నుండి – సురేంద్ర ప్రతాప్, సెంటర్ ఫర్ వర్కర్స్ ఎడ్యుకేషన్)*

**శ్రామిక చట్టాలు, వర్తమాన స్థితి**

మనదేశంలోని శ్రామిక చట్టాలను చదివిన వారికెవరికైనా, మన ప్రభుత్వాలకు పనివారిపట్ల ఇంత అవ్యాజమైన ప్రేమ కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నదా అనే సందేహం కలగక మానదు. పనివారి క్షేమానికై కేంద్ర స్థాయిలో చేసిన ఓ యాభై, ఆ యా రాష్ట్రాల్లో మరికొన్ని, శ్రామిక– ఉద్యోగ – పారిశ్రామిక చట్టాలను కలిపితే శతాధికమే అవుతాయి. ఈ చట్టాలు చూస్తే, అహో! భారతదేశం ఒక శ్రామిక స్వర్గధామం కదా! అని అనిపించక మానదు. ఇహ వారి యోగాక్షేమాలకై ఏర్పడ్డ కమిటీలు, అవి సమర్పించిన నివేదికలను లెక్కగట్టి తూకమేస్తే బహుశ మరెక్కడా, ఏ దేశంలోనూ ఇంత మోత ఉండకపోవచ్చు.

అయినప్పటికీ, ఇటు కార్మికవర్గ ప్రతినిధులకు, అటు పారిశ్రామిక అధిపతులకు, ఈ చట్టాల పట్ల ఎందుకని సదభిప్రాయం లేదు? ఇరు వర్గాలు ఈ చట్టాల పట్ల అసంతృప్తినే ఎందుకు ప్రకటిస్తున్నాయి? ఈ చట్టాలను సంస్కరించాలని, సరళీకరించాలని, వీటిలో చాలా వాటిని ఎత్తివేయాలని, బుట్టదాఖలు చేయాలని ఈ రెండు శిబిరాలు ప్రభుత్వాలను ఎందుకు ఒత్తిడి చేస్తూ వస్తున్నాయి?

అయితే, ఈ రెండు శిబిరాలు ఉత్పత్తి చట్రంలో విరుద్ధ శక్తులు. ప్రస్తుత సమాజంలో ఉన్న వైరుధ్యాలకు ప్రతినిధులు. ఒక శిబిరం కేవలం పెట్టుబడి అధిపతుల, ఉత్పత్తి సాధనాల యజమానులదైతే; వేరొక శిబిరం ఉత్పత్తి సాధనాలపై ఏ రకమైన యాజమాన్యం, అధికారం లేని, కేవలం తమ శ్రమ అమ్ముకుని సంపదను సృష్టించే శ్రామికుల, కార్మికుల, ఉద్యోగులది. ఈ రెండు శిబిరాలు, తమ తమ స్థానాల నుండే లేబర్ చట్టాల సరళీకరణకై పట్టుబడుతున్నాయి. ప్రభుత్వాలపై ఒత్తిడి తెస్తున్నాయి. ఈ రెండు ప్రత్యర్థి శిబిరాలు చట్టాల ఆసరాతో వారి వారి అవసరాల రీత్యా ఉత్పత్తి చట్రంలో రాజీ పడుతూనే ఉంటాయి. ప్రభుత్వం, న్యాయ వ్యవస్థలు, సభ్య సమాజం ఈ భిన్న శిబిరాలకు మధ్యవర్తిత్వం వహిస్తూ శాంతిని కాపాడుతూ ఉంటాయి. ఈ మొత్తం వ్యవహార క్రమంలో రాజ్యపు మొగ్గు ఎటు ఉంటుందో, ఎవరికీ అనుకూలంగా ఉంటుందో వేరే చెప్పక్కర్లేదనుకుంటా!

మరి ఇన్ని చట్టాలుండి, ప్రభుత్వాలకు పనివారిపై కట్టలు తెగి పడుతున్న ప్రేమమయ దృక్పథం నుండి, ఈ దేశంలో సంఘటిత రంగం కుంచించుకుపోతూ, అసంఘటితరంగం ఎందుకని విస్తరిస్తూ పోతోంది? ఏ సౌకర్యాలు, సంక్షేమ కార్యక్రమాలు లేని శ్రామికుల సంఖ్య ఎందుకని పెరిగిపోతోంది? ప్రభుత్వ గణాంకాల ప్రకారమే దినసరి ఆదాయం మూడు పదుల రూపాయల కన్నా దాటని జనసంఖ్య వందల కోట్లకు ఎలా పెరిగిపోతోంది? సంపదలో మెట్టు వాటా అందినవారికే మరింతగా అందుతూ సౌకర్యాలు, సంక్షేమ వనరులు పొందుతున్న వారే పొందుతూ బహువిధాలుగా సుఖభోగులవుతున్న సమాజంలో యాజమాన్యాల, అధికార వర్గాల మీగడ పొర ఒకటి వికృత రూపం దాల్చి, విర్రవీగుతూ ప్రజల మూపులపై సవారి చేస్తున్నది? మరింకొక పక్క ధనికులకు లెక్కలేనంత సంపద మరింతగా ఎలా సమకూరుతోంది? వారి కుటుంబాలకు ఇంటికొక అరడజను కార్లు ఎట్లా సమకూరుతున్నాయి?

అంటే చట్టాలు చేసే వాళ్లకు తెలుసన్నమాట, ఈ చట్టాలు ఖాళీ పాముల పుట్టలు – చెద పట్టిన పేపరు కట్టలేనని. పారిశ్రామిక, వ్యాపార వర్గాలకూ క్షుణ్ణంగా తెలుసన్నమాట ఈ చట్టాలు తమ చుట్టాలేనని, ఏనుగులు దూరిపోయే బొక్కల'వలలే'నని. ఇక మిగిలిందెవరు? దిక్కులేని నిరుపేద శ్రామికుడు లేక కార్మికుడు, అంతేగా ? నిజానికి ఈ చట్టాలు బడుగుజీవులైన కార్మికులకు ప్రవేశించలేని ఓ కీకారణ్యమే! దుర్భేద్యమైన కందకపు కోటే!

అసంఘటిత రంగం – పనివారి స్థితిగతుల అధ్యయనానికై డా. అర్జున్‌కుమార్ సేన్ గుప్త అధ్యక్షతన యు.పి.ఎ ప్రభుత్వ హయాంలో ఏర్పడ్డ కమిషన్ 2007లో అప్పటి ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు సమర్పించిన నివేదికను యుపిఎ ప్రభుత్వం 2009లో ప్రజలకు అందుబాటులో ఉంచింది. ఈ నివేదిక కొన్ని నమ్మశక్యం కాని నిజాలు బయటపెట్టింది. భారతదేశం చెప్పుకోదగ్గ ఆర్థిక ప్రగతి సాధించినప్పటికీ ఇంకా 77 శాతం ప్రజలు రోజూ 20 రూపాయల లోపు ఆదాయంతో కునారిల్లుతున్నారనే విషాద వాస్తవాన్ని, అంతేగాక దేశంలో పనిచేసే ప్రజల్లో 86 శాతం మంది అసంఘటిత రంగంలో కూరుకుపోయి ఉన్నారని కూడా ఈ నివేదిక ప్రకటించింది. ఈ నివేదిక బయట పెట్టిన నిజాలను పరిశీలిస్తే శ్రామిక శిబిరం ఇప్పుడున్న జంగ్లీ జాన్వర్ చట్టాలను ఎందుకు సవరించమని, పకడ్బందీగా చట్టాలను అమలుచేసే తీరుగా సరళీకరించమని పట్టుబడుతున్నదో అర్థమవుతుంది.

ఇక యాజమాన్యాలేమి వాదిస్తాయంటే, ఈ చట్టాల్లో పొందుపరిచిన ఓ 50 శాతం అంశాలనైనా మేము గనుక అమలుచేస్తే, గుండు గొరిగించుకుని, మా పరిశ్రమల గేట్ల వద్ద మేమే భిక్షాటన చేసుకోవాల్సి వస్తుందని మరి ఇటువంటి స్థితిని కోరి తెచ్చుకోవడానికే మేము పెట్టుబడులు పెట్టి, పరిశ్రమలను స్థాపించి, వ్యాపారాలు నడుపుతామా ? లేక లాభార్జనకు పరిశ్రమలు స్థాపించి వ్యాపారాలు చేస్తామా? అంటే ఏమనుకోవాలి? ఈ చట్టాలు, అటు శ్రామికులకు, ఇటు పారిశ్రామిక, వ్యాపార వర్గాలకు కూడా తలనొప్పిగా మారాయన్న మాట! ఇదొక పార్శ్వం. మరొక పార్శ్వం మేటల కొద్దీ ఉండి, అమలుకు నోచుకోక నామ మాత్రంగా మిగిలి ఉన్న చట్టాలను కూడా పాలకులు గత 25 సంవత్సరాలుగా ఎందుకని పలచన చేస్తూ

వస్తున్నారు? ఇప్పటి మోడీ ప్రభుత్వం ఈ చట్టాల సరళీకరణకు ఎందుకింత దూకుడు ప్రదర్శిస్తున్నది? కొంచం చరిత్రలోనికి వెళ్లి వర్తమానంలోనికి రావలసి ఉంది.

**వలస భారతంలో కార్మిక చట్టాలు**

భారతదేశం బ్రిటిష్ వలసగా ఉన్న రోజుల్లోనే కార్మిక చట్టాలకు బీజం పడింది. బ్రిటన్లో కార్మికవర్గం పెట్టుబడిపై జరిపిన పోరాటాల మూలంగా బ్రిటిష్ కార్మికుల హక్కులకు గుర్తింపు, పని గంటల తగ్గింపు, వేతనాల పెంపు, పని ప్రదేశాల్లో సౌకర్యాలు, ప్రమాద నివారణ అమరికలు స్త్రీల, బాలకార్మికుల సంక్షేమం, పరిరక్షణలకై అక్కడి పెట్టుబడిదారులు కార్మిక చట్టాలు చేయక తప్పలేదు. అప్పటివరకు బ్రిటన్ తన దురాక్రమణలో ఉన్న వలస దేశాల నుండి తరలించుకు తెచ్చుకున్న వనరుల సంపదతో వేగవంతమైన పారిశ్రామికీకరణ సాధించింది. ఈ పారిశ్రామికీకరణ కార్మికులపై అత్యంత దోపిడీ - అణచివేతలతో మొదలై, క్రమేణా సంస్కరించబడిన దశలో కార్మికులకు కనీస సౌకర్యాలు కల్పించి, కనీస జీతాలు చెల్లించాల్సిన దశకు చేరుకుంది. ఇవేమీ అయాచితంగా కార్మికులకు దక్కలేదు. వారి పోరాటాల, త్యాగాల ఫలితంగా ఒకింతగ అందివచ్చిన హక్కులు, సౌకర్యాలే ఇవి.

బ్రిటిష్ వలసగా ఉన్న భారతదేశం మట్టుకు ఈ క్రమంలో సర్వస్వాన్ని కోల్పోయింది. భారత ప్రజల అపార సంపదను అప్పనంగా తెల్లవాళ్లు తరలించుకు పోయారు. బ్రిటన్ తెల్ల జాతీయులు తమ వికాసానికి, అభివృద్ధికి భారత దేశపు సహజ జవసత్వాలను దెబ్బకొట్టి, కోట్లాది భారత ప్రజలను బిచ్చగాళ్లుగా మార్చి వేశారు. 'మేం ఇండియాను జయించింది ఇండియన్ల క్షేమం గురించి కాదు. బ్రిటన్లో ఉత్పత్తయ్యే వస్తువులకు ఇండియా ఓ పెద్ద అడ్డా కావాలని ఇండియాను మేం కత్తితో జయించాం. దాన్ని మేం కత్తితోనే నిలుపుకుంటాం. బ్రిటిష్ సరుకుల అమ్మకానికి చాలా విలువైన లాభసాటి విఫణిగా, మరీ ముఖ్యంగా 'లేంకషైర్' పత్తి వస్త్రాల అమ్మకానికి మేం దీన్ని నిలబెట్టు కుంటాం'. అప్పటి 'బాల్డ్విన్' కాబినెట్లో హోం సెక్రటరీగా ఉన్న 'సర్ విలియం జాయిసన్ - హిక్స్' మాటలివి. అంటే భారతదేశ వనరులు, ఆర్థిక సామాజిక వ్యవస్థ తెల్లవారి భోగభాగ్యాలకు, సుఖమయ జీవితాలకు, భోగ లాలసత కొనసాగించుకోవడానికి మలచబడింది.

ప్రపంచంలోనే అగ్రగామిగా నిలిచిన చేనేత పరిశ్రమను నేలమట్టం చేసి, నాణ్యమైన ఉత్పత్తులు తయారుచేసి ఎగుమతి చేసే భారతదేశాన్ని ముడిసరుకుల ఎగుమతి దేశంగా, బ్రిటన్లో ఉత్పత్తైన వినియోగ సరుకులను హెచ్చు ధరలకు దిగుమతి చేసుకునే దేశంగా బ్రిటన్ ఇండియాను దిగజార్చి వేసింది. భారతదేశంలో విస్తృత ప్రజారాశులను దుర్భర దారిద్రంలోనికి నెట్టి, ఆకలి కూడా తీర్చుకోలేని దుఃఖ భాజనమైన కూలీ డబ్బులకు తలవంచి పనిచేసే కూలీలుగా మార్చేసి, తమ అడుగులకు మడుగులొత్తే గుప్పెడు దళారీలను ఇండియాలో తయారు చేసుకుంది. ఈ దళారీ కుటుంబాలే బ్రిటిష్‌వారి కనుసన్నల్లో, పర్యవేక్షణలో స్వాతంత్ర్యానికి ముందు నుండే కొన్ని పరిశ్రమలు స్థాపించారు. అప్పటి నుండి వీరు ఎదుగుతూ బడా పెట్టుబడిదారులుగా, పారిశ్రామిక అధిపతులుగా, కార్పొరేట్ దిగ్గజాలుగా ఈ నాటికీ దేశంలో చలామణీ అవుతున్నారు. ఈ ప్రాంతీయ దళారులు, బ్రిటిష్ పారిశ్రామిక-పెట్టుబడివర్గాలు వ్యాపార సంబంధాల్లో పెనవేసుకు పోవడానికి నాంది స్వాతంత్ర్యానికి పూర్వమే జరిగిపోయింది. ఎప్పుడైతే బ్రిటన్లో కార్మికుల జీతాలు పెరిగి, కార్మిక చట్టాలు అమలు చేయవలసి వచ్చిందో, అప్పటి నుండి వారి లాభాలు తగ్గుతూ వచ్చాయి. అటువంటి దశలో ఇండియాలో కారు చౌకగా లభ్యమవుతున్న నిరుపేద కూలీలను ఉపయోగించుకుని ఎక్కువ లాభాలు గడించే ఆలోచనతో ఇక్కడ నూలు, బట్టల తయారీ మిల్లులు స్థాపించడం మొదలు పెట్టారు.

బ్రిటిష్ పారిశ్రామిక వేత్తలు బొంబాయిలో స్థాపించిన బట్టల మిల్లుల్లో పనిచేసే శ్రామికుల అతి దయనీయమైన స్థితిగతులను, దుర్భరమైన పరిస్థితులను గమనించిన వలస ప్రభుత్వం 1875లో ఓ పారిశ్రామిక పరిశీలన, అధ్యయన బృందాన్ని నియమించింది. ఈ మిల్లుల్లో పనివారు ఒకటి రెండు పండగ దినాలు మినహా నిర్విరామంగా ఏడాది పొడుగునా పనిచేయడాన్ని, ఎనిమిదేళ్ల లోపు పిల్లలు కూడా ఎనిమిది గంటల పాటు పనిచేయడాన్ని, ఏకబిగిన రోజూ పన్నెండు గంటలు, మధ్యలో విరామం అన్నదే లేకుండా పనిచేయడాన్ని, తాగేందుకు మంచినీళ్లు లేకపోవడాన్ని, కార్మికులు ప్రమాదాలకు గురికాకుండా యంత్రాలకు బిగించవలసిన నివారణ సదుపాయాలనేవి ఏమీ లేకపోవడాన్ని ఈ బృందం తన రిపోర్టులో వివరించింది. ఈ పరిశీలనా బృందం నివేదిక ఆధారంగా, అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం 1891లో ఇండియాలో మొట్టమొదటి కార్మికచట్టం తీసుకొచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చిన తొలి దశాబ్దాలలో ప్రాథమిక ఉత్పత్తిరంగంలో ప్రభుత్వరంగ సంస్థల స్థాపనకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. అప్పటికి ప్రైవేట్‌రంగం ఇంకా బాల్యావస్థలో ఉంది. ప్రభుత్వరంగంపై ఆధారపడి ఎదిగి బలపడడం మినహా దానికి వేరే దారిలేదు. కనుక ప్రైవేట్ పెట్టుబడి లాభసాటైన వినియోగ వస్తువుల ఉత్పత్తులతో లబ్ధి పొందాలనే ఉద్దేశంతో అవసరమైన భారీ పరిశ్రమల స్థాపనకు ప్రభుత్వమే పూనుకోవాలనే వ్యూహ రచన చేశారు. అలా స్వాతంత్ర్యపు తొలినాళ్లలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థ రూపుదిద్దుకుంది. అప్పట్లో కార్మిక సంక్షేమం పట్ల ఎంతో కొంత పట్టింపు ఉండేది. ఇటు ప్రభుత్వమూ, అటు సంఘటిత కార్మిక సంఘాలూ, వామపక్ష రాజకీయ పార్టీలూ కార్మిక సంక్షేమం పట్ల నిబద్ధత కలిగి ఉండడం మూలంగా కార్మికచట్టాల పల్చబాటు, ఉల్లంఘన మరీ దొంగల దోపిడిగా మారిపోలేదు. కార్మిక చట్టాలను కనుమరుగుచేసే కార్యక్రమం మనదేశంలో 1990 నుండి ప్రవేశించిన ఆర్థిక సరళీకరణతో పాటే వేగవంతమైంది.

**వేగం పుంజుకున్న శ్రామిక చట్టాల సరళీకరణ**

ఆర్థిక సరళీకరణను దౌడు తీయించడానికే దేశ విదేశీ పెట్టుబడి, హిందూత్వ శక్తులు ఒక్కటై 16వ పార్లమెంట్‌లో మోడీని ప్రధాని కుర్చీపై కూర్చోబెట్టాయి. ఈ పీటం అతనికి సరదాగా ఏమీ అప్పచెప్పలేదు. సరళీకరణ అశ్వాన్ని దౌడెత్తించి దేశ వనరుల కబ్జా రేసులో తమను గెలిపించే రౌతుగా అతనిపై 'పెట్టుబడి' పందెం కాసింది, బెట్టు కట్టింది. ఈ రేసులో గెలవాలంటే అతను దౌడెత్తించాల్సిన అంశాలు చాలానే ఉన్నాయి. ఆ అంశాల్లో ప్రధానమైంది కార్మిక చట్టాల సరళీకరణ. ఈ చట్టాలను ఊడ్చి పెంటకుప్ప పైకి విసిరివేయడం పెట్టుబడికి ఒక్కసారే సాధ్యమయ్యే పని కాదు కాబట్టి, ఇన్నాళ్లూ ఈ దేశంలో అంచెలంచెలుగా వాటిని బలహీనం చేస్తూ వచ్చారు పెట్టుబడి అధిపతులూ, రాజకీయ నాయకులు, ప్రభుత్వ అధికార్లూ. అదిప్పుడు సరిపోదు. కార్మిక చట్టాలే కాదు, భారత రాజ్యాంగం కూడా ఇప్పుడు పెట్టుబడికి ఆటంకం ఔతోంది. పనివాళ్లపై దూకి కండలు పీకాల్సిన కుక్క పెట్టుబడి దొరలపైకి, వారి కాపలాదారులపైకి కూడా దూకడం, అప్పుడప్పుడూ మొరగడం, కరవడం మొదలుపెడితే కష్టం కదూ! దానికోరలు పీకకుండా వదిలిపెడితే కొంపలంటుకుపోవూ! అందుకనే ఆ కోరలు పీకే పనిని 'పెట్టుబడి' ఇప్పుడు మోడీకి, హిందూత్వ ఆర్ఎస్ఎస్ బాబులకు అప్పచెప్పింది.

భారత పార్లమెంటరీ రాజ్యాంగం కూడా ఇప్పుడు ఈ శక్తులకు ఒక రకంగా అడ్డంకిగా మారింది. పెట్టుబడిదారీ రాజకీయ ఆర్థిక వ్యవస్థలో సరుకుల ఉత్పత్తి, వాటి పంపిణీ, పెట్టుబడి ఆధిపత్యంలోనే నడుస్తుంది. పెట్టుబడిదారుల లాభసంరక్షణే ఈ వ్యవస్థ ప్రధాన లక్ష్యంగా ఉంటుంది. పెట్టుబడిదారుల లాభార్జనకై ఏర్పాటు చేసుకున్న పకడ్బందీ రాజ్య వ్యవస్థే ఇప్పుడు భారతదేశంలో కొనసాగుతున్నది. దీనినే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటున్నాం. ఆ పేరుతోనే ఈ వ్యవస్థ చలామణీ అవుతోంది. ఇటువంటి వ్యవస్థలో పెట్టుబడికి, శ్రమకు ఉన్నసహజ వైరుధ్యం మూలంగా వీటి మధ్య ఎల్లప్పుడూ సంఘర్షణ ఉంటుంది. పెట్టుబడి తన ఆధిపత్య

స్థాయి నుండి అత్యంత లాభార్జనకై పెట్టుబడుతుంది. కార్మికుల శ్రమ, ఆసరా, శాంతియుత ఉత్పత్తి వాతావరణం లేనిదే లాభార్జన సాధ్యం కాదు కాబట్టి వారితో పెట్టుబడి ఘర్షణ పడుతూ, బెదిరిస్తూ, బుజ్జగిస్తూ తన పబ్బం గడుపుకుంటూ ఉంటుంది. అలా కుదరనప్పుడు – రాజ్యం తనదే కాబట్టి, ఈ వ్యవస్థను తనే రచించుకుంది కాబట్టి, శ్రమను లొంగ తీసుకోవడానికి సమయాను కూలంగా దండాన్ని ప్రయోగిస్తుంది. కార్మికునికి భుక్తి గడవాలంటే పనిచేసి జీతం సంపాదించక తప్పదు. అందుచేత శ్రామికుడు ఏదో ఒక పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థలో పని వెతుక్కోవలసిందే. అక్కడ అతడు తన శ్రమను అమ్ముకోక తప్పదు.

ఉత్పత్తి క్రమంలో, కార్మికుల మధ్య ఏర్పడే సంఘటన, చైతన్యం వారిని దైన్యావస్థ నుండి మేల్కొనేట్లు చేస్తాయి. పెట్టుబడి తన శ్రమను ఉపయోగించుకుని పొందుతున్న లబ్ధి నుండి తన మనుగడకు, తన కుటుంబ సంరక్షణకు వాటా పొందాలనే కార్మికుల సహజమైన ఆకాంక్ష హక్కుల రూపం దాలుస్తుంది. చరిత్ర పొడుగునా పెట్టుబడికి, శ్రమకు మధ్య జరిగిన, జరుగుతూ వస్తున్న పోరాటాల్లో కార్మికులు తమ బలిదానాలతో, రక్త తర్పణతో సాధించుకున్నవే కార్మికుల హక్కులు. ఆ హక్కుల కనీస రక్షణకై పెట్టుబడి తన అవసరార్థం కొన్ని చట్టాలు చేస్తుంది. పెట్టుబడిదారులపై కార్మికులు జరిపే పోరాటాల ఫలితంగా తప్పని పరిస్థితుల్లో కొన్ని కార్మికహక్కుల పరిరక్షణ చట్టాలు రూపు దిద్దుకుంటాయి. మరికొన్ని చట్టాలు పౌర సమాజపు ఒత్తిడి మూలంగా కూడా ఏర్పడతాయి. వివిధ చారిత్రిక, సామాజిక పురోగమన దశల్లో పెట్టుబడి, శ్రమ అనే రెండు ప్రత్యర్థి శక్తుల మధ్య తలెత్తే సంఘర్షణలను నివారించి, ఆయా సందర్భాల్లో రాజ్యం, పౌర సమాజం మధ్యవర్తిత్వం వహించి శాంతియుత ఉత్పతి వాతావరణాన్ని కల్పించడానికి పెట్టుబడి, శ్రమల మధ్య ఏర్పాటు చేసిన తాత్కాలికమైన ఒప్పంద పత్రాలే కార్మిక చట్టాలని చెప్పవచ్చు.

**ప్రధానమైన కొన్ని శ్రామిక చట్టాలు**

మన దేశంలోని కార్మిక, ఉద్యోగ చట్టాలను ఐదు ప్రధాన భాగాలుగా విభజించ వచ్చు. అవి: 1. పనివారి పని పరిస్థితులు(వర్కర్స్ కండిషన్స్) 2.పారిశ్రామిక సంబంధాలు (ఇండస్ట్రియల్ రిలేషన్స్) 3. పనివారి జీతాలు (వర్కర్స్ వేజెస్) 4. పనివారి సంక్షేమం(వర్కర్స్ వెల్ఫేర్) 5. పనివారి సామాజిక భద్రత (వర్కర్స్ సోషల్ సెక్యూరిటీ). కార్మిక,ఉద్యోగ చట్టాలు భారత రాజ్యాంగంలో పొందుపంచిన నిబంధనల ప్రకారం కాలానుగుణంగా, దపదఫాలుగా రూపొందించబడ్డాయి. అంతర్జాతీయ శ్రామికసంస్థ (ఐ.ఎల్.ఒ) తీర్మానాలను కూడా ఈ చట్టాలు తయారు చేయడంలో పరిగణనలోనికి తీసుకున్నారు.

**వాటిలో ప్రధానమైనవి కొన్ని**

1. పనివారి నష్టపరిహార చట్టం (వర్క్‌మెన్స్ కంపెన్సేషన్ యాక్ట్) – 1923
2. జీతాల చెల్లింపు చట్టం (పేమెంట్ అఫ్ వేజెస్ యాక్ట్) –1936
3. పారిశ్రామిక వివాదాల చట్టం (ఇండస్ట్రియల్ డిస్ప్యూట్స్ యాక్ట్) – 1947
4. పరిశ్రమల చట్టం (ఫ్యాక్టరీస్ యాక్ట్) – 1948
5. ఉద్యోగుల రాజ్య భీమా చట్టం(ఎంప్లాయీస్ స్టేట్ ఇన్స్యూరెన్స్ యాక్ట్) –1948
6. ఉద్యోగుల పొదుపు భద్రతా నిధి చట్టం (ఎంప్లాయీస్ ప్రావిడెంట్ ఫండ్ యాక్ట్)– 1952
7. వృత్తి శిక్షణా (అప్రెంటీస్) చట్టం –1961
8. ప్రసూతి ఉపకార చట్టం (మెటర్నిటీ బెనిఫిట్స్ యాక్ట్) –1961
9. బహుమతి (బోనస్) చెల్లింపుల చట్టం –1965
10. ఉద్యోగ సేవల పారితోషిక (గ్రాట్యుటీ) చట్టం –1972
11. దుకాణాల, వ్యాపారాల చట్టం (షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్మెంట్ యాక్ట్)
12. కనీస వేతనాల చట్టం 1948 (మినిమమ్ వెజెస్ యాక్ట్)
14. పారిశ్రామిక ఉపాధి (వర్తింపు నియమ నిబంధనావళి) యాక్ట్–1946 (ఇండస్ట్రియల్ ఎంప్లాయ్‌మెంట్ (స్టాండింగ్ ఆర్డర్స్) యాక్ట్ –1946)
15. ఒప్పంద కార్మికుల (క్రమబద్ధీకరణ, రద్దు) యాక్ట్ 1970

(ఈ చట్టాల ఉద్దేశాలు, వివరాలు ఈ వ్యాసంలో చెప్పడం సాధ్యం కాదు కాబట్టి వాటిని ఇక్కడ ఇవ్వడం లేదు)

**కార్మిక చట్టాలు – సరళీకరణ దౌడు**

సరళీకరణ దౌడులో రూపు మారబోతున్న కొన్ని చట్టాలను ఇప్పుడు చర్చిద్దాం.

**1) ఒప్పంద కార్మికుల(క్రమబద్ధీకరణ, రద్దు)1970 చట్టానికి సవరణ**

ఇప్పటి వరకు 20 మంది తాత్కాలిక, ఒప్పంద పనివారు కలిగిన అన్ని వ్యాపారాలకు, కాంట్రాక్టర్లకు వర్తించే ఈ చట్టం సవరణ తరవాత 50, ఆ పైబడి తాత్కాలిక పనివారు ఉన్న సంస్థలకే వర్తిస్తుంది. పారిశ్రామిక వివాదాల చట్టం 'సెక్షన్–25 ఎఫ్ ఎఫ్ ఎ' ప్రకారం 20 మంది తాత్కాలిక పనివారు ఉన్న ఏదైనా సంస్థను మూసి వేయాలంటే ప్రభుత్వ అనుమతి అవసరం. ఈ దేశంలో అధిక శాతం సంస్థలు 50 మందికి లోపే పని వారిని కలిగి ఉంటాయి కాబట్టి, ఈ చట్ట సవరణ ద్వారా ఇవన్నీ కూడా కార్మికుల పట్ల తాము వహించాల్సిన బాధ్యత నుండి విముక్తమవుతాయి. ఈ చట్టాలను అమలు చేయాల్సిన ప్రభుత్వ సంస్థల ఉద్యోగుల అవినీతికి తప్ప ఇవి ఎందుకూ కొరగావడం లేదనే నెపంతో ఈ సవరణను తీసుకొస్తున్నారు. ఈ విషయంలో ప్రభుత్వ సంస్థల అవినీతి భరించరాని స్థితికి చేరుకున్న మాట వాస్తవమే అయినప్పటికీ, దీని చాటున శ్రామిక ఆలంబనమైన కొమ్మనే నరికి వేయాలనుకోవడం రాజ్యాంగ వ్యతిరేకం. ఇలా చేయడం వల్ల తాత్కాలిక పనివారి సంఖ్య పెరిగి, వారి స్థితిగతులు మరింతగా దిగజారిపోతాయి. ఇప్పటికే కొన్ని రాష్ట్రాలు ఈ సవరణను అమలు చేస్తున్నాయి.

**2) 1948, పారిశ్రామిక వివాదాల చట్టానికి సవరణ**

ఈ చట్టం ప్రస్తుతం వంద లేక ఆ పైన శ్రామికులు పనిచేస్తున్న పరిశ్రమలన్నిటికీ వర్తిస్తుంది. ఈ చట్టం ప్రకారం పనివారికి, పారిశ్రమల యాజమాన్యాలకు తలెత్తిన వివాదాల మూలంగా పని వారిని పని నుండి నిలుపుదల చేయాలన్నా, పరిశ్రమను మూసి వేయాలన్న ప్రభుత్వ అనుమతి అవసరం. అదే ఇప్పుడు 300 లేక ఆ పైన పనివారున్న పరిశ్రమలకే ఇది వర్తిస్తుందని చట్ట సవరణచేసే ప్రయత్నం జరుగుతోంది. అంతేగాక మూడు సంవత్సరాల వరకు అసలు ఏ పారిశ్రామిక వివాదాన్ని పరిగణనలోనికి తీసుకోవాల్సిన అవసరం లేదని కూడా ఈ కొత్త సవరణ చెపుతోంది. అంటే ఈ చట్ట సవరణ ద్వారా శ్రామికులను పెట్టుబడికి బలిపశువులను చేయడమే కదా! దీనికి పారిశ్రామిక వర్గాలు చెపుతున్నదేమంటే – ఏ పరిశ్రమైనా నిలదొక్కుకోవాలంటే కనీసం మూడు సంవత్సరాలు పడుతుందని, ఈ లోపే పనివారు డిమాండ్లు పెడితే, వాటిని తీర్చే స్తోమత కొత్త పరిశ్రమలకు ఉండదని, అలా పరిశ్రమలను నడపడం సాధ్యం కాదని, కంపెనీలు దివాళా తీయడమే కాకుండా పారిశ్రామిక ప్రగతి కుంచించుకు పోతుందనీ పరిశ్రమ వర్గాల వాదన. పరిశ్రమల లాభనష్టాలతో మాకు సంబంధం లేదనీ, మా శ్రమకు తగ్గ ఫలితాన్నే చట్ట ప్రకారం డిమాండ్ చేసే హక్కును ఈ చట్ట సవరణ ద్వారా కుదేలు చేస్తున్నారని శ్రామిక వర్గాల వాదన. ఈ దేశంలో 300 పైబడి పని చేస్తున్న పరిశ్రమలు లెక్కకు చాలా తక్కువ సంఖ్యలోనే ఉంటాయి కాబట్టి అవన్నీ కూడా ఇప్పుడు శ్రామికులకు జవాబు చెప్పాల్సిన స్థితి నుండి విముక్తమవుతాయి. మరి

శ్రామికుల గతేమిటి? వారు తలవంచుకు పనిచేయాలి, పనిలోంచి తీసేస్తే మరో చోట మరో పని వెతుక్కోవాలి.

**3. 1948 పరిశ్రమల చట్టానికి సవరణ**

విద్యుత్ వినియోగించి 10 మంది పనివారితోనూ, విద్యుత్ లేకుండా 20 మంది పనివారితోనూ నడిచే పరిశ్రమలకు ప్రస్తుత చట్టం వర్తిస్తుంది. దీనిని 'విద్యుత్ వినియోగించి 20 మంది పనివారితోను, విద్యుత్ లేకుండా 40 మంది పని వారితోను' నడిచే పరిశ్రమలకు వర్తించేలా ఇప్పుడు సవరించదల్చారు. అంటే ఈ చట్టం నుండి వేలాది పరిశ్రమలను తప్పించదల్చారన్నమాట. దీనిని కొంచెం నిశితంగా పరిశీలించాల్సి ఉంది. ప్రపంచీకరణ నేపథ్యంలో అంతర్జాతీయ శ్రమ విభజన పెద్దఎత్తున జరుగుతున్న వాస్తవాన్ని మనం గుర్తించాలి. అంతేగాక, కేంద్రీకృత యాంత్రీకరణ పెరుగుతున్న హైటెక్ పరిశ్రమల్లో పనివారి సంఖ్య చాలా కుంచించుకుపోతోంది. ఎక్కువ పెట్టుబడి, ఎక్కువ యాంత్రీకరణ, అతి తక్కువ పనివారు – ఉద్యోగులతో అత్యధిక వ్యాపార టర్నోవర్, అధిక లాభార్జన, సరుకుల విలువ గొలుసుకు (వాల్యూ చైన్) ఒక కొస అయితే, ఇంకొక కొస తక్కువ మంది పని వారితో తక్కువగా వ్యాపార టర్నోవర్ చేసే అతి ఎక్కువ చిన్న, మధ్యతరహా పరిశ్రమలు ఉంటాయి. 'మేక్ ఇన్ ఇండియా' మూలాలు ఇక్కడ చూడాల్సి ఉంది. చైనా నమూనాగా ఇదంతా జరుగుతోంది. చైనాకు ఒక ప్రత్యామ్నాయంగా ఎదగాలనే భారత పాలకుల కోరిక, చైనాకు ప్రత్యామ్నాయ 'జైంట్' నొకదాన్ని తయారు చేయాలనే సామ్రాజ్యవాద పెట్టుబడి వ్యూహం కలగలసి ఈ దేశంలో శ్రామిక చట్టాలతో సహా అన్ని చట్టాలను, ఆర్థిక వ్యవస్థలను తమ కనుగుణంగా మలిచే బాధ్యత మోడీ భుజస్కందాలపై మోపాయి.

అపాయకరమైన, ప్రాణసంకటమైన, విషతుల్యమైన రసాయనాలను ఉపయోగించే తయారీ పరిశ్రమలు అధికమవుతూ వీటిలో పని చేసేవారి ఆరోగ్యానికి జరిగే హానిని దృష్టిలో పెట్టుకుని ఫ్యాక్టరీ యాక్ట్‌లోని మొదటి షెడ్యూల్‌ను సవరించాలనీ, విష రసాయన ఉత్పత్తులను, వాటిలో వాడే రసాయనాలను పునర్ నిర్వచించాలనే డిమాండ్ ఎప్పటి నుండో ఉంది. ఇప్పుడు దీనిని అడ్డం పెట్టుకుని ఈ మొత్తం షెడ్యూల్‌ను రద్దు చేసి కొత్త గందర గోళాన్ని, ఇది వరలో లేని మరిన్ని ప్రమాదకర పదార్థాల తయారీ పరిశ్రమలను కూడా కొత్త చిట్టాలో చొప్పించే ప్రయత్నం జరుగుతోంది. ప్రజా వ్యతిరేకత మూలంగా అభివృద్ధి చెందినా దేశాల్లో ఇటువంటి ఉత్పత్తులను కొనసాగించలేని పరిస్థితిలో వాటిని ఈ కొత్త పాలసీల ద్వారా భారతదేశంలో చొప్పించే కుట్ర దీని వెనుక ఉందనేది గ్రహించాల్సిన అంశం.

ఒకే ప్రాంతంలో ఉండే పరిశ్రమలకు ఒకే రోజు వారాంతపు సెలవు ఇవ్వకుండా కొన్నిటికి ఒక రోజు, మరికొన్నిటికి ఇంకొక రోజు మార్చి మార్చి ఈ వారాంతపు సెలవులను అమలు చేయాలనే ప్రతిపాదన కూడా ఉంది. ఇలా చేయడం ద్వారా అసలు సెలవులు సక్రమంగా ఇస్తున్నారా, లేదా అనేది గ్రహించడం కష్టమవుతుంది. ఇప్పటికే చాలా పరిశ్రమల్లో వారాంతపు సెలవు ఇవ్వడానికి స్వస్తి పలుకుతున్న స్థితి ఒకటి కొనసాగుతూ, పెరుగుతూ ఉంది. ఈ ప్రతిపాదన అమల్లోకి వస్తే కార్మికులకు సెలవులు దొరకడమే మృగ్యమయ్యే ప్రమాదముంది. అడిగే నాథుడే లేని పరిస్థితి దాపురించవచ్చు.

రోజుకు ఎనిమిది గంటలకు మించి పని చేయరాదనే నియమం నుండి బయటపడి యాజమాన్యాలు ఇప్పుడు పదిన్నరగంటల వరకు కూడా పని చేయించుకోవడం చాప కింద నీరులా పాకిపోతోంది. కొత్త ప్రతిపాదనలో 12 గంటల వరకు పని చేయించుకోవచ్చునే క్లాజ్‌ను చేర్చుతున్నారు. ఇంతేగాక ఇప్పుడు అమల్లో ఉన్న ఓవర్ టైం పాలసీకి కూడా సరళీకరణ వాతలు పెడుతున్నారు. మహిళల చేత రాత్రులు కూడా పని చేయించుకోవచ్చునే వెసులుబాటును కలిగిస్తున్నారు. పావు సంవత్సరంలో 50 గంటలకు మించి ఓవర్ టైం ఉండరాదని, అవి సాలు మొత్తంలో చూసినట్లయితే ఏ ఒక్క పావు సంవత్సరంలోనూ 75 గంటలకు మించితే శిక్షార్హులని ప్రస్తుత చట్టం చెపుతోంది. దాన్నిపుడు 100–115 గంటలుగా మార్చి యాజమాన్యాలకు వెసలుబాటు కల్పిస్తున్నారు. పనివారి సంఖ్యతో నిమిత్తం లేకుండా అన్ని పరిశ్రమల్లోనూ క్యాంటీన్లు, కూర్చుని తినేందుకు సౌకర్యాలు, సరైన, సరిపడ మరుగు దొడ్లు, శుభ్రపరిచిన మంచి నీరు ఇత్యాది సౌకర్యాలను తప్పనిసరిగా చేయడం మానివేసి, పరిశ్రమల్లో పనివారి సంఖ్యను బట్టి సౌకర్యాలు కలుగజేయాలనే నిబంధనలు పెట్టడం సరళీకరణ పేర తలపెట్టేది కార్మిక విద్రోహమే!

**4. వృత్తి శిక్షణా (ఎప్రెంటీస్) చట్టం–1961 సవరణ**

యాజమాన్యాలు శ్రామికులకు నిలకడ గల ఉద్యోగ కల్పనా బాధ్యత నుండి తప్పించే ఘనమైన చట్టం ఈ వృత్తి శిక్షణా (అప్రెంటీస్) చట్టం. అనుభవంలేని పనివారిని కారు చౌకగా సుదీర్ఘకాలం పాటు ఉపయోగించుకోవడానికి, లాభాలు పిండుకోవడానికి ఈ చట్టం యాజమాన్యాలకు ఓ కామధేనువు. అంతేగాక ఒక సంవత్సరం పాటు శిక్షణాకాలంలో ఇచ్చే స్టైఫండ్( శిక్షణా కాలంలో జీతం) లో సగ భాగం ప్రభుత్వమే భరిస్తుంది. 100 కోట్ల లోపు వ్యాపార టర్నోవర్ ఉన్న చిన్న మధ్య తరహా పరిశ్రమలకు ఇది వర్తిస్తుంది. వీరికి ఇ.ఎస్.ఐ సదుపాయం సమకూర్చనక్కర్లేదు. పారిశ్రామిక వివాదాల చట్టానికి తీసుకోచ్చే సవరణను దృష్టిలో పెట్టుకుంటే 300 వరకు పనివారున్న పరిశ్రమల్లో పనివారిని తీసేసినా, పరిశ్రమలను మూసివేసినా చట్టం ఇక అడ్డం కాబోదు. బోర విరుచుకుని వారు ఆ పని చేసుకోవచ్చు. ఈ సవరణలను మొత్తంగా చూస్తే ప్రభుత్వం యాజమాన్యాలకు, పెట్టుబడికి హైర్ అండ్ ఫైర్ అనే పదునైన ఆయుధాన్ని పనివారిపై అడ్డు అదుపు లేకుండా ప్రయోగించడానికి అందిస్తున్నదనే విషయం స్పష్టమవుతున్నది.

**5. లేబర్, పరిశ్రమల నియంత్రణా శాఖల్లో జమ చేయాల్సిన నెలవారీ ఖాతాల నుండి యాజమాన్యాలకు విముక్తి అనే సవరణ**

10 నుండి 40 వరకు పనివారుగల పరిశ్రమలు ఈ కొత్త సవరణ ద్వారా తమ తమ పరిశ్రమల్లో పనివారి వివరాలను, వారికిచ్చే జీత నాతాలను, సౌకర్యాల దస్తావేజులు, రిజిస్టర్లు నెల నెల జమ చేయ నక్కర్లేదు. ఇన్స్పెక్టర్ రాజ్ నుండి విముక్తి అనే తారక మంత్రం చాటున ఈ సవరణ తీసుకొచ్చారు. దుర్భరమైన, అవినీతిమయమైన ఇన్స్పెక్టర్ల వ్యవస్థ తప్పక రద్దు కావాల్సిందే. కాని వీరికి మించి పన్నుల ఎగవేతలోనూ, నియమ నిబంధనలను తుంగలో తొక్కడంలోనూ, చట్ట ప్రకారం కార్మికులకు ఇవ్వాల్సిన జీతాలు, సౌకర్యాలను మసిపూసి ఎగ్గొట్టడంలో ఆరితేరిన యాజమాన్యాలు కొల్లలుగా ఉన్న ఈ దేశంలో వీరిని ఓ మేరకైనా నియంత్రించే వ్యవస్థ మొత్తానికే ఎత్తేస్తే, ఇక కార్మికుల గతేం కాను?

**6. కనీస వేతన చట్ట సవరణ**

వివిధ రాష్ట్రాల్లో ఇప్పుడున్న కనీస వేతన చట్టాలు చాలా అమానుషంగా ఉన్నాయని, వాటిని రద్దు చేసి విశాల దృక్పథంతో అన్ని రాష్ట్రాలకు వర్తించే విధంగా కనీస వేతన చట్టాలను సవరించాలనే కార్మిక వర్గ డిమాండును అడ్డం పెట్టుకుని కొత్తగా సవరించబోయే ప్రతిపాదిత కనీస వేతన చట్టం పనివారికి మేలు చేయకపోగా వారికి మరింత హానినే కలుగజేస్తుంది. నైపుణ్యాల వ్యత్యాసాలనడ్డం పెట్టుకుని శ్రమకు తగ్గ ఫలితం న్యాయబద్ధంగా ఇవ్వడం మాని, లాభాల వేటలో చెమట కుహరాలుగా పరిశ్రమలను తయారుచేసే కార్యక్రమమే మోడీ చేస్తున్న కార్మిక చట్టాల సరళీకరణ, మేక్ ఇన్ ఇండియా కాకి గోల.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

# వ్యవసాయదారుల వాస్తవ స్థితి

***రైతులకు, రైతు కూలీలకు వచ్చే ఆదాయ వ్యయాలలో తీవ్రమైన వ్యత్యాసం చోటు చేసుకుంటోందనీ, ఈ పరిణామం తీవ్ర సంక్షోభానికి దారి తీసే ప్రమాదాన్ని ఎన్ఎస్ఎస్ఒ నివేదిక వెల్లడిస్తుందనీ అంటున్నారు* ఆశాలత**

**భా**రతదేశంలో వ్యవసాయదారుల స్థితిగతులపై ఇటీవల విడుదలైన నేషనల్ శాంపుల్ సర్వే ఆర్గనైజేషన్ (ఎన్ఎస్ఎస్ఒ) 70వ రౌండ్ సర్వే 2013 నివేదిక వ్యవసాయరంగ పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉన్నట్లు వెల్లడిస్తున్నది. ఎన్ఎస్ఎస్ఒ 1950 నుండి దేశంలో వివిధ సామాజిక ఆర్థిక అంశాలపై శాస్త్రీయమైన నమూనా పద్ధతిని అవలంభించి సర్వేలు నిర్వహిస్తున్నది. వివిధ రంగాలలో విధానాల రూపకల్పనకు ఈ సర్వే నివేదికలను ఆధారంగా తీసుకోవడం జరుగుతుంది. ఈ కారణంగానే ఎన్ఎస్ఎస్ఒ నివేదికలు ప్రాముఖ్యతను సంతరించుకుంటాయి.

వ్యవసాయ కుటుంబాల స్థితిపై భారతదేశ చరిత్రలో రెండుసార్లు మాత్రమే ఎన్ఎస్ఎస్ఒ సర్వే నిర్వహించింది. మొదటిది 59 వ రౌండ్ సర్వేలో భాగంగా రైతుల పరిస్థితిని అంచనా వేయడానికి 2003లో జరిగింది, రెండవది 10 సంవత్సరాల తర్వాత 2013 లో వ్యవసాయ కుటుంబాల స్థితిగతుల అంచనా సర్వేగా జరిగింది. 2003లో జరిగిన 59వ రౌండ్ సర్వేలో భూమి ఉన్న లేక కౌలుకు తీసుకున్న రైతును యూనిట్‌గా తీసుకుంటే 70వ రౌండ్ సర్వేలో భూ యాజమాన్యంతో సంబంధం లేకుండా పంటల, పండ్ల తోటల సాగు, పశుపోషణ వంటి వ్యవసాయ కార్యకలాపాలు సాగిస్తున్న కుటుంబాలను యూనిట్‌గా తీసుకోవడం జరిగింది. రైతులను నిర్వచించడంలో చేసిన ఈ మార్పు ఆహ్వానించదగినదే, అయితే ఈ రెండు సర్వే ఫలితాలను పోల్చి చూడడంలో సమస్య ఎదురవుతుంది. దీనిలో మొత్తం 4520 గ్రామాలలో దాదాపు 35000 కుటుంబాలను, ఖర్చులు, ఆదాయం, అప్పులు, భూమి, పశుసంపద వంటి ఉత్పాదక ఆస్తులు, వ్యవసాయ పద్ధతులు, వనరుల అందుబాటు, నూతన పరిజ్ఞానాల పట్ల అవగాహన, లభ్యత మొదలైన అంశాలపై సర్వే చేశారు. ఈ 70వ రౌండ్ ఎన్ఎస్ఎస్ఒ నివేదికలో వెల్లడైన అంశాలు వ్యవసాయరంగంపై తక్షణం దృష్టి పెట్టి అత్యవసరంగా చర్యలు తీసుకోవలసిన అవసరాన్ని సూచిస్తున్నాయి.

**వ్యవసాయ కుటుంబాల సంఖ్య**

2012-13 లలో దేశంలో 9 కోట్ల వ్యవసాయ కుటుంబాలు ఉన్నట్లు అంచనా, మొత్తం గ్రామీణ కుటుంబాలలో ఇది 57.8 శాతం. వారిలో 63.5 శాతం కుటుంబాలు వ్యవసాయమే ప్రధాన ఆదాయంగా ఉందని చెప్పారు. రాజస్థాన్, ఉత్తర్‌ప్రదేశ్, అస్సాం, మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్ వంటి ఉత్తర భారత రాష్ట్రాలలో వ్యవసాయ కుటుంబాల శాతం ఎక్కువగా ఉండగా కేరళ, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో గ్రామీణ కుటుంబాలలో వ్యవసాయ కుటుంబాల శాతం తక్కువగా ఉన్నట్లు ఈ సర్వేలో తేలింది. ఇది ఆంధ్రప్రదేశ్‌లో 41.5 శాతం తెలంగాణలో 51.5 శాతంగా ఉంది. గత 10 ఏళ్లలో సాగుదార్ల సంఖ్య 90 లక్షలు తగ్గినట్లు 2011 జనాభా గణాంకాలలో కూడా తేలింది. అంటే వ్యవసాయంపై ఆధారపడిన వారి సంఖ్య తగ్గుతూ వస్తున్నదని గణాంకాలతో సహా రుజువవుతున్నది. ఇది రెండు తెలుగు రాష్ట్రాలలో మరింత ఆందోళన కరంగా ఉంది. వ్యవసాయం నుండి బయటికి నెట్టివేయబడుతున్న వారికి సరిపడినంత ఆదాయాన్ని ఇచ్చే ఇతర ఉపాధి అవకాశాలు (పారిశ్రామిక రంగం తదితరాలు) లభించక పోవడం వల్ల తక్కువ వేతనాలకు ఏదో ఒక పని చేయడమే మార్గంగా తయారైంది.

**ఆదాయం - ఖర్చు - అప్పులు**

వ్యవసాయ కుటుంబాల సగటు నెలసరి ఆదాయం రు. 6,426 ఉందని ఈ నివేదిక తెలిపింది, అంటే ఒక కుటుంబంలో ఇద్దరు వ్యక్తులు పని చేస్తారనుకుంటే వారి రోజువారి ఆదాయం రు. 107 మాత్రమే, ఇది ప్రభుత్వం ప్రకటించిన కనీస వేతనం కంటే చాలా తక్కువ. సగటు నెలసరి ఆదాయంలో 47.9 శాతం పంటలసాగు నుండి, 11.9 శాతం పశుపోషణ నుండి వస్తున్నదనీ, 32 శాతం వేతనాల (రోజు కూలీ లేక ఉద్యోగం) నుండి మిగిలిన 8 శాతం వ్యవసాయేతర వ్యాపారం నుండి వస్తున్నదనీ నివేదిక వెల్లడిస్తున్నది. ఈ కుటుంబాల నెలసరి వినిమయ ఖర్చు రు. 6,223 (ఆహారం, ఆరోగ్యం, బట్టలు మొదలైనవి మాత్రమే), ఇతర ఖర్చులు లెక్కలోకి తీసుకుంటే ప్రతి కుటుంబానికి నెలకు కనీసం రు. 856 లోటు వస్తున్నది, 70 శాతం కుటుంబాలు ఈ లోటులోనే ఉన్నాయి, అంటే అవి అప్పు చేయకుండా బతికే పరిస్థితి లేదు. ఇటీవల విడుదలైన 10వ వేతన సవరణ కమిషన్ నివేదిక ఉద్యోగుల కనీస వేతనం రు. 6,700 నుండి రు. 13,000 లకు పెంచాలని సూచించింది. ఒక కుటుంబానికి (పట్టణాలలో ముగ్గురు, గ్రామాలలో ఐదుగురు సభ్యులు) నెలకు తిండి, బట్టలు వంటి అవసరాలకు రు. 11,000 అవుతుందని ఖర్చువేసి దానికి అదనంగా 20 శాతం కలిపి రు. 13,000 కనీస వేతనంగా నిర్ణయించారు. అటువంటప్పుడు ఒక వ్యవసాయ కుటుంబానికి కూడా అదే లెక్క ఎందుకు వర్తించకూడదో ప్రశ్నించవలసిన అవసరం ఉంది. ప్రస్తుత ఎన్ఎస్ఎస్ఒ నివేదిక ప్రకారం వ్యవసాయ కుటుంబాలకు వస్తున్న ఆదాయం వేతన సవరణ కమిషన్ సూచించిన దానిలో సగం మాత్రమే ఉన్నప్పుడు రైతులు ఆ లోటు ఆదాయాన్ని సమకూర్చుకోవడానికి ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకుంటుందో అడగవలసిన అవసరం కూడా ఉంది. ఉద్యోగులకు నెల జీతంతో పాటు వైద్య సదుపాయాలు, పిల్లల చదువుల సదుపాయాలు అనేక ఇతర భత్యాలు చెల్లించే ప్రభుత్వం దేశానికి ఆహారం పండించే రైతులకు సరిపడే ఆదాయం సమకూర్చే బాధ్యతను తప్పకుండా తీసుకోవాలి.

# ఊరూరా గ్రంథాలయాన్ని స్థాపించుకుందాం

***వట్టికోట ఆళ్వారుస్వామి స్ఫూర్తిని నిలుపుకొని ఊరూరా గ్రంథాలయాన్ని స్థాపించే కృషిలో ప్రతి ఒక్కరూ భాగం కావాలని కోరుతోంది* గ్రంథాలయ ప్రచార సమితి, తెలంగాణ**

అక్షరాలంటే వంకర టింకర నిర్జీవ రేఖాచిహ్నాలు కాదు, మానవ స్పందనల ఆనవాళ్లు. ఆదిమ మానవుడు.. సామూహిక జీవన సమరంలో మాట నేర్చి అక్షరాలకు రూపుదిద్దే దాకా, ఆ తర్వాతా సాగిన జీవన సమర సారాన్నంతా అక్షరాలు నిక్షిప్తం చేసుకున్నాయి. తరతరాల మానవ వికాస చరిత్రలో మనుషుల ఆకాంక్షలకు, ఆరాట పోరాటాలకు ఆనవాళ్లయ్యాయి. నాగరికతా వికాసానికి ఆధారమయ్యాయి, జవ జీవాలయ్యాయి. అయితే ఇటుకల కుప్ప ఇల్లు కానట్లే.., అక్షరాల అర్థవంతమైన కూర్పు మాత్రమే మంచి పదం, వాక్యం అయ్యింది. గ్రంథం రూపుదిద్దుకున్నది. ఇలా రూపుకట్టుకున్న గ్రంథం (పుస్తకం) మనిషికి నడక నేర్పడమే కాదు, వెలుగుబాట అయ్యింది. అవుతున్నది. ఈ నేపథ్యంలోనే మన కాళోజీ అన్నట్లు ఒకే ఒక సిరా చుక్క లక్ష మెదళ్లకు కదలిక అయ్యింది.

తరతరాల చారిత్రక గమనంలో చరిత్ర సారాన్నంతా నింపుకున్న చైతన్య దీపిక పుస్తకం. సమాజ గతిని, పురోగతినీ గ్రంథాలే నిర్ణయిస్తున్నాయి, నిర్దేశిస్తున్నాయి. మరోమాటలో చెప్పాలంటే.. మానవాళిని నడిపిస్తున్నది పుస్తకం మాత్రమే. వేదాలు, పురాణ ఇతిహాసాలైన రామాయణ, మహాభారతాలు, జాంబవంత పురాణం మొదలు బైబిల్, ఖురాన్, బౌద్ధ దమ్మపదం.. అన్నీ పవిత్ర గ్రంథాలుగా ప్రపంచ మానవాళిని వేల సంవత్సరాలుగా ప్రభావితం చేస్తున్నాయి. ఆధునిక చరిత్రలో కూడా పుస్తకం తనదైన పాత్రను పోషిస్తున్నది. సమాజాలను నడిపిస్తున్నది. చరిత్ర గతులను వేగిర పరుస్తున్నది. సామాజిక సంఘర్షణల్లో పుస్తకం వెలుగుదారై వెలుగొందుతున్నది. శ్రమజీవుల చేతుల్లో చేరి చేదోడు అవుతున్నది. అన్యాయాలపై అంకుశం అవుతున్నది. అందుకే సమాజ పీడకులకు పుస్తకం అంటే పిడుగుపాటు. అందుకే చరిత్ర పొడుగునా పాలకులంతా గ్రంథాన్ని నిర్బంధాలకు, నిషేధాలకు గురి చేశారు. యూరప్ ఖండాన్నంతా ప్రభావితం చేసిన కమ్యూనిస్టు మ్యానిఫెస్టో (పుస్తక) ప్రభావాన్ని ఎదుర్కోలేక దోపిడీ పీడకులు యూరప్ ఖండాన్ని కమ్యూనిస్టు భూతం ఆవహించిందని అక్కసు వెళ్లగక్కారు. ఇక మనదేశంలో బ్రిటిష్ పాలకులు, తెలుగు నేలలో నిజాం రాజులు పుస్తకం ఉనికినే భరించలేకపోయారు. గ్రంథాలను నిషేధించి సామాజిక చలనాన్ని అడ్డుకోవాలని పడరాని పాట్లు పడ్డారు. ఒకానొక దశలో నిజాం పాలకులు తెలుగు భాష ఉనికిని సహించలేక పోయారు. తెలుగును మృత భాష అన్నారు. దాని వాహికగా ఉన్న పుస్తకాన్ని చూసి బెంబేలెత్తి పోయారు. పుస్తకంలోంచే.. సామాజిక చైతన్య కిరణం పురుడు పోసుకుంటుందని భయపడి కక్షగట్టారు. గ్రంథకర్తలను జైళ్లలో నిర్బంధించారు. అయినా జైలు గోడలపై అక్షరాలు చైతన్య కిరణాలై నైజాం దోపిడీ పీడనలను ప్రశ్నించాయి. ఎదిరించాయి. ఈ సామాజిక పరిస్థితుల్లోంచే గ్రంథాలయోద్యమం ఓ సామాజికోద్యమంగా ముందు కొచ్చింది. ఆమాట కొస్తే తెలుగు నేలలో ఆంధ్రమహాసభ కార్యకలాపాల కన్నా గ్రంథాలయోద్యమమే ముందుగా ప్రారంభమైంది. వీటికన్నా ముందే తెలుగునేలలో బౌద్ధ, జైనుల విద్యా, సాంస్కృతిక కృషి, అవి తీసుకొచ్చిన మానవీయ విలువలు ఉండనే ఉన్నాయి. ఆనాటి నుంచీ తెలుగునేల జన జీవనంలో గ్రంథాలు, గ్రంథాలయోద్యమం నిర్వహించిన పాత్ర అమోఘమైనది.

---

మొత్తం వ్యవసాయ కుటుంబాలలో 52 శాతం కుటుంబాలు రుణగ్రస్తమై ఉన్నాయి, సగటు అప్పు రు. 47,000 కాగా దేశంలో అత్యధికంగా ఆంధ్రప్రదేశ్‌లో 92.2 శాతం, తెలంగాణలో 89.1 శాతం కుటుంబాలు అప్పులలో ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఒక్కొక్క కుటుంబానికి సగటు అప్పు రు. 1.12 లక్షలైతే తెలంగాణలో అది రు. 99,000, అంటే రెండు తెలుగు రాష్ట్రాలలో సగటు అప్పు దేశ సగటు కంటే దాదాపు రెట్టింపు ఉంది. వ్యవసాయ కుటుంబాల రుణాలలో 58 శాతం వ్యవస్థాగతమైనవి (42.9 శాతం బ్యాంకుల నుండి, 14.8 శాతం సహకార సంఘాల నుండి). ఒక హెక్టారు కంటే తక్కువ భూమి ఉన్న కుటుంబాలకు బ్యాంకు రుణాలలో 15 శాతం మాత్రమే అందాయి, 10 హెక్టార్ల (50 ఎకరాలు) కంటే ఎక్కువ ఉన్న భూ యాజమాన్య వర్గానికి బ్యాంకు రుణాలలో 79 శాతం అందుతున్నాయి. పంటల బీమా విషయానికి వస్తే 90 శాతం వ్యవసాయ కుటుంబాలకు బీమా సౌకర్యం అందుబాటులో లేదు. వివిధ పంటల వారీగా 2.5 శాతం నుండి 39 శాతం కుటుంబాలకు మాత్రమే కనీస మద్దతు ధర గురించి అవగాహన ఉంది. ఈ నివేదికలో వెల్లడించిన విషయాలు ఒక నమూనా ఆధారంగా చేసిన విశ్లేషణ మాత్రమే ఐనప్పటికీ, ఇవి స్థూలంగా ఒక చిత్రాన్ని మన కళ్ల ముందు ఉంచుతాయి. ఈ గణాంకాలన్నీ వ్యవసాయరంగంలో ప్రభుత్వం చేపట్టవలసిన చర్యలను స్పష్టంగా సూచిస్తున్నాయి. మొట్ట మొదటగా వ్యవసాయ కుటుంబాల ఆదాయాలు పెంచి కనీస ఆదాయం కల్పించే చర్యలను అత్యవసరంగా చేపట్టాలి. వ్యవసాయ దారులలో అత్యధిక సంఖ్యగా ఉన్న చిన్న సన్నకారు రైతులకు, కౌలు రైతులకు, మహిళా రైతులకు సంస్థాగత రుణాలు, పంటల బీమా సౌకర్యం, సమాచారం, మార్కెట్ సదుపాయం తదితర మద్దతు వ్యవస్థలను కల్పించాలి. అప్పుల ఊబిలో ఉన్న అత్యధిక వ్యవసాయ కుటుంబాలు వ్యవసాయం వదిలి పోకుండా, ఆత్మహత్యలవైపు మళ్లకుండా ఉండాలంటే ఇది తప్ప మరొక మార్గం లేదు.

*(రచయిత రైతు స్వరాజ్య వేదిక రాష్ట్ర కన్వీనర్)* వీ

తెలంగాణలో ఆంధ్రోద్యమం ప్రారంభమయ్యే నాటికి 1922 కల్లా ఇక్కడ ఊరూరా గ్రంథాలయాలు స్థాపించబడ్డాయి. హైదరాబాద్ నగరంలో 16లో అబ్దుల్ ఖయ్యూం, మౌల్వీ సయ్యద్ హుసేన్ బిల్ గ్రామీ, నవాబు ఇమాదుల్ ముల్కీ కలిసి ఆసఫియా లైబ్రరీని స్థాపించారు. అదే నేటి అఫ్జల్‌గంజ్‌లోని స్టేట్ లైబ్రరీ. ఆ తర్వాత 1995లో పాతనగరంలోని లాల్‌దర్వాజ ప్రాంతంలో భారత గుణవర్ధక సంస్థను స్థాపించారు. ఇది ఇప్పటికీ పని చేస్తున్నది. 1901లో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం స్థాపించబడింది. 1903లో రాజరాజ నరేంద్ర భాషా నిలయం, 1904లో శబ్దానుశాసనాంధ్ర భాషానిలయం, 1905లో సికింద్రాబాద్‌లో ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయం, 1908లో హనుమకొండలో రాజరాజనరేంద్ర ఆంధ్రభాషా నిలయం, 1911లో ఎర్రుపాలెంలో మహబూబియా గ్రంథాలయం, 1917లో సూర్యాపేటలో ఆంధ్ర విజ్ఞాన ప్రకాశన గ్రంథాలయం, 1918లో నల్లగొండలో ఆంధ్ర సరస్వతీ గ్రంథాలయ స్థాపన జరిగింది. హైదరాబాద్‌లోని గౌలీగూడాలో బాలసరస్వతీ ఆంధ్ర గ్రంథాలయం, నాంపల్లిలో వేమన ఆంధ్ర భాషాలనియం స్థాపించబడ్డాయి. ఇలా నిజాం ఫ్యూడల్ పాలకుల ఏలుబడిలో నిర్లక్ష్యానికీ, వివక్షకు గురైన తెలుగు భాషను పునరుజ్జీవింప చేసేందుకు, పాలకుల పీడనను తుదముట్టించేందుకు ప్రజలను సంఘటితం చేసేందుకు, చైతన్యం రగిల్చేందుకు గ్రంథాలయాల స్థాపన ఉద్యమంలా సాగింది. ఈ ఒరవడిలోనే 1939లో వెల్దుర్తి మాణిక్యరావు, గుండవరపు హనుమంతరావు తోడ్పాటుతో కేసీ గుప్త అణాగ్రంథమాలను స్థాపించారు. అణాకొక గ్రంథంగా వంద పుస్తకాల్ని కేవలం ఐదు రూపాయలకే ప్రజలకు అందించారు. గుప్తాగారి ఇల్లే అణా గ్రంథమాలకు కేంద్రంగా ఉండేది. ఈ కోవలో తెలుగు నేలలో తెలగుభాషా సంస్కృతుల పరిరక్షణ, వికాసం కోసం అక్షరాన్ని ఆయుధం చేసి పోరాటం చేసిన వారిలో సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, గడియారం రామకృష్ణశర్మ, మాడపాటి హనుమంతరావు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, కోదాటి నారాయణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, అకినేపల్లి జానకిరామారావు, కొమర్రాజు లక్ష్మణరావు, దాశరథి, కాళోజీ మొదలు వట్టికోట ఆళ్వారుస్వామి, సుద్దాల హనుమంతు దాకా ఎందరో అక్షరయోధులు ఈ నేలపై ఉన్నారు. వీరిలో వట్టికోట ఆళ్వారుస్వామి కృషి, పాత్రను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. తెలుగు జాతి విముక్తి వికాసానికి అక్షరాన్ని ఆయుధంగా చేయడమే గాక, జాతి విముక్తి కోసం ఆయుధం పట్టి పోరాడిన వాడు వట్టికోట. ఈ క్రమంలోనే 1941లో వట్టికోట ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించారు. గ్రంథమాల తరఫున 1938-41, 1953-61 మధ్యకాలంలో దాదాపు ముప్పైకి పైగా పుస్తకాలను ప్రచురించారు. ఇంతటితో ఆగకుండా వట్టికోట భుజానికి జోలె సంచి వేసుకుని ఊరూరా తిరిగి గ్రంథాలను అమ్మాడు. పుస్తక పఠనానికి, పుస్తకాల ప్రచురణకు ప్రేరణగా నిలిచారు. తెలంగాణ చరిత్ర, సంస్కృతులను తెలిపే పుస్తకాలతో పాటు, సమకాలీన సమస్యలను, వాటి పరిష్కారాలను తెలిపే పుస్తకాలతో ప్రజల్లో రాజకీయ చైతన్యం రగిల్చాడు. దేశ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించదగిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో స్వయంగా పాల్గొని రహస్య జీవితం గడిపాడు. ఉద్యమ కార్యకలాపాల నిర్వహణలో ఉన్న వట్టికోటను నైజాం ప్రభుత్వం అరెస్టు చేసి జైలులో నిర్బంధించింది. అయినా మొక్కవోని ధైర్యంతో పెన్నూ, గన్నూ పట్టి నిజమైన పోరాట యోధుడిగా తెలుగునేలలో అందరికీ ఆదర్శప్రాయుడుగా నిలిచాడు.

ఇది వట్టికోట ఆళ్వారుస్వామి శత జయంతి సంవత్సరం. ఈ సందర్భంగా అందరూ వట్టికోట పేరుతో రకరకాల కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. సభలు, సమావేశాలంటున్నారు. విగ్రహాలంటున్నారు. నిజానికి వట్టికోట ఆళ్వారుస్వామి ఆశయాలను నిలిపేందుకు వట్టికోట ప్రేమికులుగా ఆయన ఆశయాలను ముందుకు తీసుకుపోవాల్సిన అవసరం ఉన్నది. ప్రజల్లో పుస్తక పఠనాన్ని పెంపొందించాల్సి ఉన్నది. గ్రంథ పఠనమే చైతన్యానికి గీటురాయి అని నమ్మి దానికోసం జీవితాంతం కృషిచేసిన ఆళ్వారు ఆచరణ అందరికీ ఆదర్శం. దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఊరూరా తిరిగి పుస్తకాలమ్మిన ఆయన ఆచరణ అనుసరణీయం. వట్టికోట బాటలో మనమూ గ్రంథపఠనాన్ని పెంపొందించేందుకు కంకణబద్ధులై కృషిచేద్దాం.

అయితే.. ఆధునిక ప్రచార, ప్రసార సాధనాల వెల్లువలో పుస్తకపఠనం కనుమరుగై పోతున్నది. ఇంటింటా ఈడియట్ బాక్స్(టివి)లు తిష్టవేసి మన భాషా సంస్కృతులను నాశనం చేయడమే కాదు, మనుషులను అమానవీయం చేస్తున్నాయి. వస్తుమయ సంస్కృతి వెర్రి తలలువేసి మనిషి మాయమైపోతున్నాడు. నానాటికీ విజృంభిస్తున్న విధ్వంసక వికృతాభివృద్ధిలో స్త్రీ భోగ వస్తువుగా మారుతున్నది. ఇంటా బయటా మహిళ హింస దౌర్జన్యాలకు బలి అవుతున్నది. ఇక్కడే యువత గురించి కూడా మాట్లాడుకోవాలి. దేశానికి కళ్లూ, కాల్లూ యువతే.. అన్నారు మన పెద్దలు. కానీ నేటి పాశ్చాత్య విష సంస్కృతి మూలంగా కళ్లూ మూసుకుపోయాయి, కాళ్లూ వక్రమార్గం పట్టాయి. నవతరంగా నవయుగానికి నాంది పలకాల్సిన యువత నవ నాగరికత పేర వినాశనం అవుతున్నది. వినిమయ సంస్కృతి ఊబిలో చిక్కుకున్న యువత బలహీనమై ఉక్కిరిబిక్కిరి అవుతున్నది. సమష్టి జీవనాన్ని విడనాడి వ్యక్తి కేంద్రంగా ఆలోచించి, ఎదుటి మనిషిని సహజీవిగా చూడడం లేదు, శత్రువుగా పరిగణిస్తున్నారు. అందరినీ తొక్కి పైకి ఎగబాకాలని ఎగబడుతున్నారు. అందరికీ దూరమవుతున్నారు. ఈ స్థితి నుంచే సామాజిక హింసకు కారణమవుతున్నారు. ఈ దుస్థితి దూరమవ్వాలి. దీనికి పుస్తక పఠనమే మార్గమని మహనీయుల చరిత్ర చెబుతున్నది. కాబట్టి పుస్తక పఠనాన్ని అభ్యసనంగా, అలవాటుగా స్వీకరించాలి. నవ యవ్వన తేజంతో నిత్య చైతన్యశీలురై సమాజానికి మార్గదర్శకులవ్వాలి.

మరో వైపు.. ప్రస్తుత కార్పొరేట్ వస్తుమయ సంస్కృతి కారణంగా సకల సామాజిక సమూహాలూ తమ అస్తిత్వాలను కోల్పోయి విలవిల్లాడుతున్నాయి. ఈ సంక్షుభిత సామాజిక సందర్భంలో వట్టికోట ఆచరణ స్ఫూర్తి అవసరం మరింత ఉన్నది. సకల సామాజిక శాస్త్రాల అధ్యయనంతో పాటు, మానవ పురోగతిని, పరిణామ క్రమాన్ని తెలిపే గ్రంథాలయాల స్థాపన, పుస్తక పఠనం ఇప్పటి సామాజికావసరం. దీనిలో భాగంగానే మనం అందరం పుస్తక పఠనాన్ని పెంపొందించేందుకు పాటుపడదాం. మన సామాజిక, సాంస్కృతిక మూలాలను తెలుసుకుని వాటి పునాదిగా సుందర భవిష్యత్తును నిర్మించుకుందాం. మానవీయ సమాజాన్ని ఆవిష్కరించుకుందాం. ఊరూరా గ్రంథాలయాలను స్థాపించి వట్టికోట ఆళ్వారుస్వామి ఆశయ సాధనకు సాగిపోదాం. వీ

# కశ్మీర్ దైన్యస్థితికి 370 అధికరణనే కారణమా?

***కశ్మీర్ ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించకుండా ఆర్టికల్ 370 పేరుతో రాజకీయ పార్టీలు కాలం గడుపుతున్నాయని అంటున్నారు డా. లచ్చయ్య గాండ్ల***

ప్రభుత్వాలు మారినప్పుడల్లా కశ్మీర్ సమస్య తెరపైకి వస్తూ, ఎన్నికల సందర్భంగా కశ్మీర్ ఓ ఎజెండాగా మారుతుంది, ఉద్వేగంగా ప్రసంగాలు చేసి, కశ్మీర్ సమస్య త్వరితగతిన పరిష్కారం జరుగుతుందనే ఓ భ్రమను కల్పించి, తర్వాతి కాలంలో అదో సాధారణ అంశంగా చిత్రీకరించి, స్థానిక రాజకీయ పార్టీలతో స్నేహాన్ని, లేదా వైరిని ప్రదర్శిస్తారు. ఈ విధానం సమస్యను పరిష్కరించకపోగా మరింతగా జటిలం చేసి, ఓ దీర్ఘకాలిక అపరిష్కృత సమస్యగా మార్చివేయడం జరుగుతున్నది.

కశ్మీర్ సమస్యని అర్థం చేసుకోవాలంటే 1947 ముందుకు వెళ్లాలి. దేశంలోని ఇతర ప్రాంతాలు బ్రిటిష్ వలసవాదులకు వ్యతిరేకంగా పోరాడినట్లే కశ్మీర్ ప్రాంత ప్రజలు (హిందువులు, ముస్లింలు, సిక్కులు, గిరిజన తెగలు) స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటం సలిపారు. ఈ పోరాట ఘటనలల్లో 1931 జూలై 13న అప్పటి నిరంకుశ ప్రభుత్వం జరిపిన కాల్పుల్లో చాలా మంది (నేటికి లెక్క లేదు) చనిపోయారు. ఈ రోజును ఇప్పటికి కశ్మీర్ ప్రజలు స్వాతంత్ర్య పోరాట దినంగా పాటిస్తూ నిరసనల్ని తెలుపుతున్నారు. 1947 ఆగస్టులో వలస పాలకులకు, కాంగ్రెస్ పార్టీకి జరిగిన ఒప్పందంలో అధికార మార్పిడిని, ఉపఖండాన్ని మూడు భాగాలు చేశారు. తూర్పు, పశ్చిమ పాకిస్థాన్‌ల మధ్యన భారత్‌ను ఏర్పాటు చేసినా, ఉత్తరాన కశ్మీర్‌ను, దక్షిణాన నిజాం హైదరాబాద్‌ను వదిలి వేశారు. దీనికి ప్రధాన కారణం బ్రిటిష్ వలస పాలకులకు ఈ రెండు రాజ్యాలు సలాం కొట్టి కప్పం చెల్లించుకుంటూ, విడిదులను, మిలటరీ క్యాంపుల్ని ఏర్పాటు చేసుకోవడానికి అవకాశం ఇవ్వడమే! పైగా ఈ రెండు ప్రాంతాల్లో రాచరిక వ్యవస్థకు, భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా జాతీయ పోరాటంతో సంబంధం లేకుండా తిరుగుబాటు జరగడం బ్రిటిష్ పాలకులకు మరింతగా కలిసి వచ్చింది. కశ్మీర్ కేంద్రంగా పశ్చిమ, ఉత్తర భారతదేశాన్ని, హైదరాబాద్ కేంద్రంగా దక్షిణ భారత దేశాన్ని అజమాయిషి చేయవచ్చనే అంతర్గత రాజనీతి ఇందులో దాగి ఉంది. అందుకే బ్రిటిష్ వారు వెళ్లిపోతున్న క్రమంలో ఈ రెండు రాజ్యాలు చర్చలోకి రాలేకపోయాయి. జునాగఢ్ విషయంలో కూడా ఇలాంటిదే జరిగింది.

భవిష్యత్తులో దేశ అంతరంగిక వ్యవస్థకు ఈ ప్రాంతాలు ముప్పుగా మారుతాయని భావించిన నెహ్రూ ప్రభుత్వం, ముఖ్యంగా హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతంలో తలెత్తిన సాయుధ రైతాంగ పోరాటాన్ని అణిచి వేయకపోతే, దేశ వ్యాప్తంగా మారుతుందని గ్రహించి, పటేల్ నాయకత్వంలో హైదరాబాద్‌పై పోలీసు చర్య జరిపి 1948 సెప్టెంబర్ 17న నిజాంను లొంగతీసుకున్నది. కాని కశ్మీర్ పరిస్థితి మరో విధంగా ఉండడంతో ఈ సాహసాన్ని చేయలేక పోయారు. దేశ విభజన సందర్భంగా తూర్పు పాకిస్థాన్ ఏర్పాటుతో కలకత్తాలో, పశ్చిమ పాకిస్థాన్ ఏర్పాటుతో శ్రీనగర్‌లో అల్లర్లు చెలరేగాయి. అక్కడ ముస్లింలు, ఇక్కడ హిందువులనే ముద్రతో హరిజనులు చంపబడ్డారు. ఈ కాలంలోనే భారత సైన్యం కార్గిల్‌కు, లే (ఎల్ఇఎచ్) కు ప్రయాణం కావడం, కశ్మీర్‌లో కాల్పుల విరమణకై ఐక్యరాజ్య సమితిలో చర్చించడానికై ఆర్మీలో జూనియర్ అధికారి ఎస్.కె.సిన్హాను, కార్యదర్శి హోదాలో సైనిక ప్రధానాధికారి కరియప్పను పంపించారు. తర్వాతి కాలంలో ఈయన ఉపసైనికాధికారిగా, జమ్మూ, కశ్మీర్ గవర్నర్‌గా కూడా పనిచేశారు. నాటి కశ్మీర్ విషయాల్ని ఇప్పటికి సిన్హా తన వ్యాసాంగ కథనాలల్లో వివరిస్తూ ఉంటారు. మరోవైపు పాకిస్థాన్, కశ్మీర్ సరిహద్దుల్లోని సాయుధ గిరిజన తెగలు కశ్మీర్‌పై నిరంతర పోరాటం సాగించడంతో, నాటి జమ్మూ, కశ్మీర్ చివరి మహారాజు (నాడు యువరాజు) హరిసింగ్, తన రాచరిక వ్యవస్థకు నూకలు చెల్లుతాయని భావించి, ప్రజాస్వామిక, లౌకిక కశ్మీర్ ఏర్పాటు నినాదంతో నడుస్తున్న నేషనల్ కాన్ఫరెన్స్ ముఖ్య నాయకుడైన షేక్ అబ్దుల్లాను అపద్ధర్మ ప్రధానమంత్రిగా నియామకం చేశారు. ఈయన మంత్రివర్గంలో లౌకికవాదిగా ముద్రపడిన జి.ఎం. సాదిక్, బక్షీలు ముఖ్యులు. ముస్లిం కాన్ఫరెన్స్‌గా ఉన్న రాజకీయ పార్టీని జాతీయ దృక్పథంతో 1939లో సోపోర్‌లో జరిగిన కాన్ఫరెన్సులో నేషనల్ కాన్ఫరెన్సుగా పేరు మార్చింది సాదిక్ గారే! తర్వాత ఈయన కూడా జమ్మూ, కశ్మీర్ ప్రధానమంత్రిగా, ముఖ్యమంత్రిగా కూడా కొంత కాలం పనిచేశారు.

ఇదే కాలంలో భారతదేశం ఏర్పాటు చేసిన అంబేద్కర్ నాయకత్వం లోని రాజ్యాంగ రూపకల్పన సభలో జమ్మూ, కశ్మీర్ పక్షాన షేక్ అబ్దుల్లాతో పాటు, సాదిక్, మరో వ్యక్తి ప్రాతినిధ్యం వహించారు. 1949లో తుది రూపుదిద్దుకున్న భారత రాజ్యాంగంలో, భారతదేశంతో కలిసి పని చేయడానికై (చేరడానికి కాదు) ఓ ఒప్పందం కుదరడం, అనుకూలంగా 370 అధికరణను రాజ్యాంగంలో చేర్చారు. ఈ నేపథ్యంలోనే ఆర్టికల్ ఒకటికి అనుబంధంగా ఏర్పడిన మొదటి షెడ్యూల్లో, జమ్మూ, కశ్మీర్ పేరు ఇప్పటికి కనపడదు. ఈ సందర్భంగా జరిగిన ఒడంబడిక అయిన రాచరిక పెద్దరికం (ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఆక్సెషన్) ప్రకారం రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలు తప్ప మిగతా విషయాలేవి భారత్‌తో సంబంధం లేకుండా జమ్మూ, కశ్మీర్ జరుపుకునే నిర్ణయం జరిగింది. దీనికి అనుగుణంగానే జమ్మూ, కశ్మీర్ రాజ్యాంగ రూపకల్పన సభ 75 మందితో 1951 అక్టోబర్ 31న ఏర్పాటు చేశారు.

ఈ విధానాల్ని మొదటి నుంచి వ్యతిరేకిస్తున్న నాటి నెహ్రూ కేబినెట్‌లోని శ్రీనగర్‌కు చెందిన శ్యాంప్రసాద్ ముఖర్జీ 370 అధికరణకు

వ్యతిరేకంగా రాజీనామా చేసి, 1950 ఏప్రిల్‌లో జనసంఘ్‌ను స్థాపించాడు. అప్పటికి జమ్మూ, కశ్మీర్‌తో భారతదేశానికి ఫెడరల్ సంబంధాలు లేకున్నా నెహ్రూ శ్యాంప్రసాద్‌కు మంత్రి హోదానివ్వడం గమనార్హం! ఇరు ప్రాంతాల్లో రాజ్యాంగ సభలు ఏర్పడడం, 370 అధికరణతో జమ్మూ, కశ్మీర్ భారతదేశంలో ఓ భాగంగా మారడం, జూలై 1952లో షేక్‌అబ్దుల్లా మరో ఇద్దరి నాయకులతో ఢిల్లీలో నెహ్రూతో ఒప్పందం చేసుకొని, సంతకాలు చేశారు. దీన్ని మొదటి నుంచి వ్యతిరేకించిన శ్యాంప్రసాద్ ఉద్యమ బావుటా ఎగురవేయగా, 1953 మేలో అరెస్టుకావడం, తర్వాత నెల రోజులకే ఆయన పోలీసు కస్టడీలో మరణించడం నేటికి మిస్టరీగానే మిగిలింది.

అటు పాకిస్థాన్ గిరిజన సాయుధులతో ఉన్న ముప్పును, ఇటు భవిష్యత్‌లో భారత్‌తో ఏర్పడబోయే ఇబ్బందికర దౌత్య పరిస్థితుల్ని, లడక్ ప్రాంతంలోని చైనా సరిహద్దులో ఏర్పడబోయే సమస్యల్ని దూరదృష్టితో ఆలోచించిన షేక్‌అబ్దుల్లా ఓ వైపు భారతదేశ రాజ్యాంగంలో పరిమితులతో కూడిన చట్టానికి స్థానాన్ని కల్పించుకుంటూనే, మిగతా విషయాల్ని స్వతంత్రంగా నిర్వహించుకోవడానికి ఒప్పందం కుదుర్చుకున్నాడు. తర్వాత కరెన్సీని చేర్చడం జరిగింది. ఇలా రూపుదిద్దుకున్న కశ్మీర్ రాజ్యాంగ సభ తన వ్యూహ రచన పూర్తికాగానే నవంబర్ 1956 17న రద్దయ్యింది. దీంతో ఇరు ప్రాంతాల చట్టసభలకు అనుసంధానంగా పనిచేసే రాజ్యాంగ సభ లేకపోవడంతో, జమ్మూ, కశ్మీర్ అసెంబ్లీ ఎలాంటి నిర్ణయాత్మక పాత్రను పోషించలేని స్థితి ఏర్పడింది. నాటి రాజ్యాంగ సభలో ప్రస్తుతం మిగిలిన ఇద్దరిలో ఒకరైన గులాం రసూల్ ఈ సందర్భంగా మాట్లాడుతూ, 370 అధికరణను రద్దు చేసే అర్హత ఇరు ప్రాంతాల చట్ట సభలకు లేదని వ్యాఖ్యానించడం గుర్తించాల్సిన అంశం!

దేశ మొదటి హోంమంత్రి సర్దార్ వల్లబాయి పటేల్ భారత రాజ్యాంగ సభలో 370 గూర్చి మాట్లాడుతూ, కశ్మీర్ కున్న ప్రత్యేక సమస్యల్ని పరిగణలోకి తీసుకొని ఈ అధికరణను రూపొందించడం జరిగిందని, అందుకే 'తాత్కాలిక' అనే పదాన్ని వాడడం జరిగిందని వివరణ ఇచ్చాడు. నాటి కేంద్రమంత్రి ఎన్.గోపాలస్వామి అయ్యంగార్ 1949 అక్టోబర్ 17న భారత రాజ్యాంగ సభలో ఇదే అంశంపై మాట్లాడుతూ, ఐక్యరాజ్య సమితిలో ఒప్పుకున్న విధంగా జమ్మూ, కశ్మీర్‌తో 370 అధికరణకు లోబడే వ్యవహరించవలసి వస్తుందని, ఇది ఎంతకాలం కొనసాగుతుందో తెలియదని చెప్పడం గమనించాలి. ఒడంబడిక నిబంధనల్లోని (7) క్లాస్ ప్రకారం 370 డ్రాఫ్ట్ తయారైందని, దీని పూర్వ పరాలను ది ట్రిబ్యూన్ దిన పత్రికలో మాజీ జమ్మూ, కశ్మీర్, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఆదర్శసేన్ ఆనంద్ 2014 జూలై 3న ఓ ప్రధాన వ్యాసాన్ని రాశారు. 370కి భిన్నంగా అనేక రాజ్యాంగ అధికరణలు జమ్మూ, కశ్మీర్‌కు వర్తింప చేయడంతో, 370 ఉనికి లేకుండానే పోయిందని వ్యాఖ్యానించారు.

ఈ విధంగా 1954 నుంచే ఆర్టికల్ 253కు భిన్నంగా, జమ్మూ, కశ్మీర్ రాజ్యాంగ సభకు అతీతంగా భారత ప్రభుత్వం చాపకింద నీరులా అనేక చట్టాల్ని జమ్మూ, కశ్మీర్‌కు వర్తింప చేయడం ప్రారంభించింది. ఈ కోవలోనే 1963 నవంబర్ 27న నెహ్రూ 370 అవసరం తీరందని ప్రకటించడం గమనార్హం! దీనికి అనుగుణంగా, తర్వాత హోంమంత్రిగా పనిచేసిన జి.ఎల్. నందా 1946 డిసెంబర్ 4న ఈ అధికరణ గూర్చి మాట్లాడుతూ జమ్మూ, కశ్మీర్‌లో రాజకీయంగా ప్రవేశించడానికి 370 ఓ వాహకంగా పనిచేసిందని తెలపడం నెహ్రూ చతురతకు నిదర్శనం. ఇదే విధంగా రాజకీయ దాహంతో షేక్ అబ్దుల్లా ఢిల్లీకి అనుగుణంగా, నెహ్రూకు అనుకూలంగా మారడంతో 370 అధికరణకు ప్రాధాన్యత లేకుండానే పోయింది. ఈ సందర్భంగానే షేక్ అబ్దుల్లా కుటుంబం జమ్మూ, కశ్మీర్‌లోని 44వ జాతీయ రహదారిలో గల జవహర్ టన్నల్‌కు లోలకంలా వేల్లాడుతారని, ఉత్తరాన గల ముందా వైపు 370కి రక్షకులుగా మాట్లాడడం, దక్షిణవైపున ఢిల్లీకి అనుకూలంగా, ఉదారంగా వ్యవహరించే వాడని, అందుకే ఆ కుటుంబమే మూడు తరాలుగా ఏడుసార్లు ముఖ్యమంత్రులుగా ప్రమాణం చేయడం జరిగిందని ఆరోపిస్తూ, సాదిక్ మనుమడు ఇఫ్తికార్ సాదిక్ జూలై 7న కశ్మీర్ ఇమేజెస్ అనే దినపత్రికలో ఓ కథనాన్ని రాస్తూ, 1975లో షేక్ అబ్దుల్లా కాంగ్రెస్ సభ్యత్వం తీసుకోవడానికి కూడా వెనుకాడలేదని తెలిపాడు.

ఇలాంటి రాజకీయ అనిశ్చిత పరిస్థితుల్ని ఉపయోగించుకుంటూనే భారత రాజ్యాంగంలోని అనేక చటాల్ని జమ్మూ, కశ్మీర్‌కు వర్తింప చేయడం చేశారు. 1954 నుంచి 1994 దాకా కొనసాగిన ఈ ప్రక్రియలో దాదాపు 47 సార్లు చట్టాల్ని సవరణ చేస్తూ జమ్మూ, కశ్మీర్‌కు విస్తరించింది. ఇలా 395 అధికరణల్లో 260 అధికరణలు ఇప్పుడు జమ్మూ, కశ్మీర్‌కు వర్తిస్తున్నాయి. మిగతా 135 దాదాపుగా జమ్మూ, కశ్మీర్ రాజ్యాంగం లాంటివే కావడంతో విస్తరించలేదు. అలాగే కేంద్ర జాబితాలోని 97 అంశాల్లో 94 అంశాల్ని, ఉమ్మడి జాబితాలోని 47 అంశాల్లోని 26 అంశాల్ని జమ్మూ, కశ్మీర్‌కు వర్తింప చేయడం, 370 ఊకలా (హస్క్) మిగిలిపోయింది. అలాంటప్పుడు 370 అధికరణను సవరించినా, ఊడపీకినా జమ్మూ, కశ్మీర్ ప్రజలకు ఒరిగేది లేదు, వచ్చేది లేదనే అభిప్రాయం ఈనాడు సర్వత్రా వినపడుతున్నది. ఏది ఏమైనా, 370 అధికరణను పూర్తిగా తొలగించడమనేది, అనేక రాజ్యాంగ చిక్కులతో ముడిపడి ఉన్న విషయం మాత్రం కాదనలేనిది.

ఈ సుదీర్ఘకాలంలో జమ్మూ, కశ్మీర్ ప్రజలు వివిధ రాజకీయ పార్టీల నీడన ఉద్యమాల్ని చేస్తూనే ఉన్నారు. ఈ ఉద్యమాల్ని ఇతర ప్రాంతాల్లో అణిచివేసినట్లే అణిచివేయడం జరుగుతున్నది. భద్రతా దళాల ప్రత్యేక అధికారాల చట్టం (ఎఎఫ్ఎస్‌పిఎ) జమ్మూ, కశ్మీర్‌కు కూడా వర్తింప చేయడంతో మహిళలు మానభంగాలకు గురికావడం, వ్యక్తులు మాయం కావడం, చిరునామాలేని సమాధులు వెలుస్తుండడం జరుగుతున్నాయి. దీంతో సాయుధ బలగాలకు వ్యతిరేకంగా కూడా ఉద్యమాలు జరుగుతున్నాయి. ఈ విషయాలేవి పట్టని డా. జితేందర్‌సింగ్ రానా మోడీ మంత్రి వర్గంలో స్థానం సంపాదించి, 370 అధికరణ అవసరం తీరిపోయిందనే వివాదస్పద వ్యాఖ్యలు చేయడంతో తిరిగి 370 తెరపైకి వచ్చింది. దీనికి అనుగుణంగానే కశ్మీర్‌పై బిజెపి (5) సూత్రాలతో ఎన్నికల ఎజెండాని ప్రకటించింది. ఈ ఏజెండా అమలు కావాలంటే 370ని పూర్తిగా తొలగించాలనేది బిజెపి ఆలోచన! విచిత్ర మేమిటంటే, రానా సోదరుడు దేవేందర్‌సింగ్ రానా నేషనల్ కాన్ఫరెన్స్ సీనియర్ నాయకుడే కాక, ఒమర్ అబ్దుల్లాకు రాజకీయ సలహాదారుడు కావడం గమనార్హం!

పోనీ, మోడీ జమ్మూ, కశ్మీర్ సమస్యకేమైన ముగింపు పలుకుతాడా అంటే, కుదరని పని అనేది గత అనుభవాలు చెపుతున్నాయి. వాజ్‌పేయి కూడా కశ్మీర్ సమస్యను మానవీయ కోణంతోనే చూడాలని పదే పదే ప్రస్తావించిన విషయం తెలిసిందే! ఇదో తేనె తుట్టలాంటి వ్యవహారమని

# కమ్ముకుంటున్న మత యుద్ధ మేఘాలు

***ప్రపంచ పీడితులైన ముస్లింల, ఆదివాసుల కాళ్ల కింద ఉన్న చమురునూ, ఖనిజాలనూ దోచుకోవడానికి దోపిడీ శక్తులు వారిని అసాంఘిక శక్తులుగా చిత్రీకరిస్తూ వారిపై యుద్ధం చేస్తున్నాయని అంటున్నారు*** **ఉషా ఎస్ డానీ**

ప్యారిస్‌లోని ఛార్లీ హెబ్డో పత్రిక కార్యాలయంపై దాడి తరువాత పత్రికా స్వేచ్ఛ మీద మరోసారి విస్తృత చర్చ మొదలైంది. దాడిలో పత్రిక సంపాదకులు సహా అరడజను సిబ్బంది కూడా చనిపోవడంవల్ల చర్చల తీవ్రత కూడా ఆ స్థాయిలోనే కొనసాగుతోంది. సామాజిక కోణంలో చూస్తే భావప్రకటనా స్వేచ్ఛ పేరిట సాగుతున్న ఈ చర్చలో ఇరువర్గాలు వర్ణ ప్రాతిపదిక మీద విడిపోయారని సులువుగానే అర్థం అవుతోంది. శ్వేతవర్ణ జాతీయులు, వాళ్ల మేధో బృందాలు పత్రిక కార్యాలయంపై దాడినీ, సిబ్బంది హత్యనూ తీవ్రంగా ఖండిస్తుంటే, ఇతర వర్ణాలకు చెందిన ప్రజలు, వాళ్ల మేధోవర్గాలు ఛార్లీ హెబ్డో పత్రిక దుందుడుకు స్వభావాన్నే తప్పుపడుతున్నారు.

ఛార్లీ హెబ్డో పత్రిక సామాజిక దృక్పథాన్ని అర్థం చేసుకోవడానికి ముందు ఫ్రాన్స్ రాజకీయార్థిక నేపథ్యాన్ని ఒకసారి పరిశీలించాలి. ఫ్రాన్స్ నిన్న మొన్నటి వరకు వలస పాలక దేశంగా ఉండేది. బ్రిటిష్ వలస పాలకులకన్నా ఫ్రెంచ్ వలస పాలకులు మరింత అహంభావులు. వలసలు అంతరించి దశాబ్దాలు గడుస్తున్నా, అలనాటి వలస దేశాల ప్రజలంటే ఫ్రెంచ్ ఉన్నత వర్గాలకూ, వాళ్ల మనోభావాల్ని ప్రచారం చేసే పత్రికలకూ ఇప్పటికీ చిన్న చూపే. అక్కడి పత్రికల్లో వచ్చే కార్టూన్లల్లో వర్ణ వివక్ష ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వీళ్లలో మరీ బరితెగించిన పత్రిక ఛార్లీ హెబ్డో. మినహాయింపు లేకుండా అందరి మీదా వ్యంగ్య బాణాలు సంధిస్తూ ఉంటుందని ఉదారవాద ఫ్రెంచ్ మేధావులు ఈ పత్రికని మెచ్చుకుంటూ ఉంటారు. ఇది పాక్షిక సత్యం మాత్రమే. కాస్త పరికించి చూస్తే, ఈ పత్రిక తెల్లవాళ్లను సుతారంగా గోళ్లతో గిల్లి వదిలేస్తుందనీ, నల్లవాళ్లు తదితర ఒక నాటి వలస ప్రజల్ని కర్కశంగా గొడ్డళ్లతో పొడుస్తుందనీ సులువుగానే అర్థం అవుతుంది.

నిజానికి ఈ పాటి జ్ఞానాన్ని సంపాదించడానికి ఆలోచనాపరులెవ్వరూ ప్యారిస్ పర్యటనకు వెళ్లాల్సిన పనిలేదు. తెలుగు వార్తా పత్రికల్ని అధ్యయనం చేసినా సరిపోతుంది. తెలుగు మీడియా సంస్థలన్నీ ఏదో ఒక రాజకీయపార్టీకి మద్దతుదారులుగా మారిపోయాయన్న సంగతి తెలియనివాళ్లు ఇప్పుడు ఎవరూలేరు. ప్రతీ పత్రిక రాజకీయ కార్టూన్లు ప్రచురిస్తుంది. తాము సమర్థించే పార్టీల ప్రత్యర్థుల మీదే కాకుండా కొన్ని సందర్భాలలో తాము సమర్థించే పార్టీల నాయకుల మీద కూడా కార్టూన్లు వేయాల్సి ఉంటుంది. అంత మాత్రాన వాళ్లు సమర్థించే పార్టీల మీద వేసే కార్టూన్ల తీవ్రతా, తాము సమర్థించే పార్టీల ప్రత్యర్థుల మీదే వేసే కార్టూన్ల తీవ్రతా ఒకే స్థాయిలో ఉంటాయని పుర్రెలో కాస్తంత బుర్ర ఉన్నవాడు ఎవరైనా నమ్ముతారా? సీనియర్ పాత్రికేయులు కొందరు నమ్ముతూ ఉండవచ్చు. వాళ్లను చూసి జాలిపడడం తప్ప మనం చేయగలిగింది ఏమీలేదు. పత్రికా స్వేచ్ఛ అంటే యథేచ్ఛ కాదు!

అప్పట్లో ఆఫ్రో – అమెరికన్ నల్లజాతీయుల్ని కోతులుగా చిత్రించిన అమెరికా శ్వేతవర్ణీయుల పత్రికల్ని, హిట్లర్ కాలంలో యూదుల్ని కించపరుస్తూ కార్టూన్లు వేసిన జర్మన్ పత్రికల్ని ఛార్లీ హెబ్డో పత్రిక అనుసరిస్తూ ఉంటుంది. ఇటీవలి కాలంలో ఆర్థిక సంక్షోభంలో పడిపోయిన ఛార్లీ హెబ్డో పత్రిక 'సమవర్తి' ముద్ర నుండి బయటపడి ఇస్లామో ఫోబియాను ప్రచారం చేయడం ద్వార శ్వేతవర్ణీయుల మద్దతు కూడగట్టి లాభాలబాట పట్టే ప్రయత్నాలు మొదలెట్టిందనే వాదనలు ఉన్నాయి. దాడి తరువాత ఆ పత్రికకు సంఘీభావంగా తరలివస్తున్న శ్వేతవర్ణ నిధులు ఈ వాదనను బలపరుస్తున్నాయి. లాభాలు సంపాదించడానికి ఏకంగా ఒక సంపాదకుని ప్రాణాలను బలిపెడతారా? అనే సందేహం ఎవరికైనా రావచ్చు. అయితే, 'పది శాతం లాభం కోసం ఉరికంబం ఎక్కడానికి కూడా పెట్టుబడిదారులు వెనుకాడరు' అనేది అందరికీ తెలిసిన సూత్రమే!

ఇంగ్లండ్ ముస్లింలలో అత్యధికులు ఒకనాటి బ్రిటిష్ వలస దేశాలకు చెందినవాళ్లే అయినట్టు, ఫ్రాన్సు దేశపు ముస్లింలలో అత్యధికులు సహజంగానే ఒకనాటి ఫ్రెంచ్ కాలనీలకు చెందినవారు ఉంటారు. ఛార్లీ హేబ్డే పత్రిక ఈ సామాజిక వర్గాన్ని లక్ష్యంగా చేసుకుని వ్యంగ్యం చాటున ముస్లింలను భూతాలుగా (ఇస్లామో ఫోబియాను) ప్రచారం చేస్తూ ఉంటుంది.

ఫ్రెంచ్ సామ్రాజ్యానికీ, ఇస్లాంకు ఒక విచిత్ర అనుబంధం ఉంది. ఉత్తర ఆఫ్రికా ఖండంలో ఫ్రెంచ్ సామ్రాజ్యం శిఖరాగ్ర దశలో ఉన్నప్పుడు,

---

తెలిసే, తన ప్రమాణ స్వీకారోత్సవానికి నవాజ్ షరీఫ్‌ను ఆహ్వానించాడు మోడీ. దాదాపు ఇద్దరి పదవికాలం ఒక్కటే! ఇప్పుడిప్పుడే నవాజ్‌కు వ్యతిరేకంగా ఇమ్రాన్‌ఖాన్ ఆజాద్ మార్చ్‌ను, మత పెద్ద తాహిర్ ఉల్ ఖాద్రీ ఇంక్విలాబ్ మార్చ్‌ను మొదలుపెట్టారు. ఇప్పటికే పాకిస్థాన్ తాలిబాన్ ఉగ్రవాద దాడులతో అట్టుడుకుతున్నది. ఈ స్థితిలో షరీఫ్‌తో స్నేహమే మంచిదనే మోడీ అభిప్రాయం పెనుమార్పులకు దారి తీయదు. ఇది, ఒక అంశంకాగా, 370 లాంటి అధికరణలు లేని మిగతా భారత్ ఎంతగా వెలిగిపోతున్నదో తెలిసిందే! 370 అధికరణపై ఇంతగా చర్చ జరగడంలోని ఆంతర్యాన్ని, రాజకీయాల్ని అర్థం చేసుకోలేక పోవడం మనకున్న గజిబిజి కాదా! ఉపరితలంగా మాట్లాడడానికి అలవాటు పడిన మనం, లోతుల్లోకి పోవడానికి అందుకే భయపడుతాం!

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

అక్కడ ఇస్లాం చాలా వేగంగా విస్తరించింది. ఒక దశలో అయితే ముస్లింల జనాభా అత్యధికంగా ఉన్న సామ్రాజ్యం తనదేనంటూ ఫ్రాన్సు గొప్పగా చెప్పుకునేది. ముస్లిం దేశాల్లోని చమురుపై ఆధిపత్యాన్ని సాధించడానికి ఈ జనాభా అంశాన్ని పెద్దగా ప్రచారం చేసుకునేది.

ప్రపంచవ్యాప్తంగా శ్వేత జాతీయులు ఇప్పుడు కార్టూన్లు ప్రచురించి నందుకు ఒక పత్రికా సంపాదకుడ్ని ముస్లింలు క్రూరంగా చంపేశారని గగ్గోలు పెడుతున్నారు. మహమ్మద్ ప్రవక్తను నగ్నంగా చిత్రించడం వ్యంగ్యమేనా? ముస్లింల ప్రవక్త వికృత మైధూ నాని (సుడోమి) కి పాల్పడినట్టు ఒక మతిచెడినవాడు తీసిన ఒక బూతు సినిమాకు వత్తాసు పలకడం హాస్యమేనా? శాసన సభ్యులుగా ఎన్నికైన పల్లెటూరి బైతులు ప్రభుత్వం ఇచ్చిన ల్యాప్ టాపుల్ని మడిచి ఎక్కడ పెట్టుకుంటారో? అని ఒక వెకిలి వ్యాఖ్య చేసినందుకు, అగ్రస్థానంలో ఉన్న ఒక న్యూస్ ఛానల్ ఆర్థిక పునాది కదిలి పోవడాన్ని తెలంగాణలో మనం కళ్ల ముందు చూశాం. తమ మత ప్రవక్త మీద అదే పనిగా వ్యంగ్యాస్త్రాలు సంధిస్తుంటే విశ్వాసులు ఎలా స్పందిస్తారో ఊహించడం కష్టమేమీ కాదు.

ఛార్లీ హెబ్డో పత్రిక మీద దాడి చేసింది ముస్లింలు అనేది కూడా పాక్షిక సత్యమే. ఈ కేసులో అరెస్టు అవుతున్న వారందరూ ఒకనాటి ఫ్రెంచ్ వలసలైన అల్జీరియా, మాలియన్ దేశాల నుండి వచ్చినవారేనన్నది మరో కోణం. పత్రిక మీద దాడికి మతం కన్నా జాతి వివక్ష అంశమే బలంగా పనిచేసిందని దీనినిబట్టి అర్థం అవుతున్నది. అంతర్జాతీయ పత్రికల్లో శ్వేతవర్ణ మేధావులు రాసే వ్యాసాలు చదివి రెచ్చిపోతున్న మన సమకాలిక నల్ల మేధావులకు వలసజాతుల ఆవేదన అర్థం అయినట్టు లేదు.

వలస జాతుల భావోద్వేగాలకు ఉధమ్‌సింగ్ అద్భుత ప్రతీక. జలియన్ వాలాబాగ్ దురంతాన్ని జరిపిన బ్రిగేడియర్ – జనరల్ రెగినాల్డ్ డయర్ కన్నా ఆ నరమేధానికి అనుమతి ఇచ్చిన పంజాబ్ గవర్నర్ మైఖేల్ ఓ డయ్యర్ ప్రధాన దోషని ఉధమ్‌సింగ్ భావించాడు. ఇరవై ఏళ్లు గడిచి పోయినా సరే, దయ్యర్ పదవీ విరమణ చేసి 76 ఏళ్ల వృద్ధుడు అయి పోయినా సరే కసి చల్లారక లండన్ వెళ్లి మరీ చంపేశాడు. అదే ఒక లండన్ పత్రిక తరచూ భారతీయుల్ని కించపరుస్తూ వ్యాసాలో, వ్యంగ్య చిత్రాలో ప్రచురిస్తుంటే ఉధమ్‌సింగ్‌లాంటి వాళ్లు ఏమిచేసి ఉండే వాళ్లూ? అప్పుడు ఆ చర్యను వలస పాలకులు ఎలాగూ ఖండిస్తారు. వాళ్ల చట్టాల ప్రకారం దోషుల్ని ఎలాగూ శిక్షిస్తారు. వలస ప్రజల్ని సమర్థించే మేధావులు ఏం చేయాలి? అన్నదే ఇప్పుడు మన ముందున్న ప్రశ్న.

ఇస్లామో ఫోబియా అనేది సాంస్కృతిక దాడి అయితే, దానికి మూలమైన రాజకీయార్థిక కారణాలను ఏకధ్రువ ప్రపంచాన్ని ఏలుతున్న అమెరికా సామ్రాజ్యవాదంలో చూడాలి. దానికి వ్యూహాలు రచిస్తున్న అమెరికా – ఇజ్రాయిల్ అనుబంధంలో చూడాలి. సామ్రాజ్యవాదిగా ఉన్న అమెరికాను రాజకీయార్థిక కోణంలో బాహాటంగా సమర్థించడానికి కొన్ని మతాలకు కొన్ని ఇబ్బందులు ఉన్నమాట నిజమే. అయితే, సాంస్కృతికంగా ముస్లిం వ్యతిరేక శిబిరానికి నాయకత్వం వహిస్తున్న అమెరికా వెనుక నడవడానికి ఇప్పుడు ముస్లిమేతర మతాలన్నీ ఉవ్విళ్లూరుతున్నాయి.

ఏదో ఒక శత్రువు లేకుండా మనుగడ సాగించలేని అమెరికా సామ్రాజ్యవాదం సోవియట్ రష్యా పతనం తరువాత ముస్లింలనే తన ప్రధాన శత్రువుగా భావిస్తోంది. వర్తమాన ప్రపంచంలో అసంఖ్యాక పీడిత ప్రజలు అనేక యుద్ధరంగాల నుండి అనేక రకాలుగా అమెరికా సామ్రాజ్యవాదంతో తలపడుతున్నారనేది ఎవరికైనా అర్థం అయ్యే విషయమే. ఈ యుద్ధాల్లో ముందు శ్రేణిలో నిలబడి అమెరికాతో తలపడుతున్నది ముస్లింలే అనేది కూడా సులభంగానే తెలుస్తోంది. ఈ జ్ఞాన సముపార్జన క్రమం ఇంకో అడుగు ముందుకు వేస్తే ఎవరికైనా అర్థం అయ్యేది ఏమంటే వర్తమాన ప్రపంచంలో ప్రధాన పీడితులు ముస్లింలు అని. విప్లవ రచయిత వరవరరావు వంటి వారు ముస్లింలతో పాటూ ఆదివాసుల్ని కూడా ప్రధాన పీడితులుగా పేర్కొంటున్నారు. ఇది సమంజసమైన ప్రతిపాదన. ముస్లిం దేశాల్లో చమురు నిల్వలున్నాయి. ఆదివాసుల నివాసాల్లో ఖనిజ నిక్షేపాలున్నాయి. ఇది సాంస్కృతిక రూపంలో సాగుతున్న పచ్చి ఆర్థిక పోరాటం.

మధ్య యుగాల్లో రాజకీయార్థిక వ్యక్తీకరణలన్నీ మత రూపంలోనే సాగేవి. 18వ శతాబ్దం ఆరంభంలో వాల్టేర్, రూసోలు రంగ ప్రవేశం చేశాక మాత్రమే రాజకీయార్థిక వ్యక్తీకరణలకు ఆధునిక మాధ్యమం ఏర్పడింది. గడిచిన మూడు శతాబ్దాలకాలంలో జరిగిందేమంటే పెట్టుబడి దారీ రాజకీయార్థిక విధానాలు సామ్రాజ్యవాద దశకు చేరుకుని ప్రపంచ పీడిత ప్రజల నుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొంటున్నాయి. ఈ సంక్షోభాన్ని దాటి మళ్లీ ఆమోదాంశాన్ని పొందాలంటే సామ్రాజ్యవాద దేశాలు తమ రాజకీయార్థిక వ్యక్తీకరణలకు ఒక కొత్త మాధ్యమాన్ని కనిపెట్టాలి. ఇప్పుడు వాటికా శక్తిలేదు. అంచేత గతంలో వదిలేసిన మత మాధ్యమాన్నే అవి పునరుద్ధరిస్తున్నాయి. అమెరికా నాయకత్వంలో సాంస్కృతికంగా ప్రపంచం ఇప్పుడు నిజంగానే రెండు మత శిబిరాలుగా చీలిపోయింది. గ్లోబ్‌ను మత యుద్ధమేఘాలు దట్టంగా కమ్ము కుంటున్నాయి!

ప్రపంచ వ్యాప్తంగా వస్తున్న ప్రధాన వార్తల్ని చూస్తుంటే ఇస్లాంను ద్వేషించని వారు భూగోళం మీద ఎవరూ లేరేమో అనిపిస్తోంది. ఇంకొన్ని పేజీలు తిరగేస్తుంటే అందుకు విరుద్ధమైన వార్తలు కూడా కనిపిస్తున్నాయి. ముస్లిం జనాభా మెజారిటీ అయిపోతోందని యూరప్ దేశాలు భయపడి పోతున్నాయట. ఇంగ్లండ్, జర్మనీ, అమెరికాలనూ ఇప్పుడు ఇస్లాం భూతం వెంటాడుతోంది!. అంతమంది అంతలా తిట్టిపోస్తున్నా, ముస్లింలను భూతాల్లా చూపిస్తున్నా, ఇస్లాంను స్వీకరించేవాళ్లు రోజురోజుకూ పెరిగిపోతుండడం నిజంగా ఆశ్చర్యమే! ఇలాంటి సందర్భాల్లో ఖిలాఫత్ ఉద్యమ నాయకుడు, భారత జాతీయ కాంగ్రెస్‌కు అలనాటి అధ్యక్షుడు, కవి మౌలాన ముహమ్మద్ ఆలీ (జౌహర్) కవితా పంక్తులు గుర్తుకు వస్తాయి. వఖతల్ ఏ హుస్సేన్ అసల్ మే మర్గ్ ఏ యజీద్ హై / ఇస్లాం జిందా హోతాహై హర్ కర్బలా కే బాద్ద్ దీనికి ఒక్క ముక్కలో అర్థం చెప్పుకోవాలంటే 'అణిచివేత నుండే ఇస్లాం జీవాన్ని నింపుకుంటుంది'.

కళాకారులు, ఆలోచనాపరులు చేయాల్సిన పని ఆధిపత్యాన్ని సవాలు చేయడం. వాళ్లు ఎప్పటికీ చేయకూడని పని పీడితుల్ని వెటకరించడం. అమెరికా ప్రపంచ ప్రధాన పీడక దేశం అయ్యి, ముస్లింలు, ఆదివాసులు ప్రపంచ ప్రధాన పీడితులు అయినప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సామ్రాజ్యవాద వ్యతిరేకులు ఏం చేయాలి? అనేదే ఈరోజు మన ముందున్న ప్రధాన సమస్య. దానికి ఎవరికివారు ఇచ్చుకునే సమాధానమే ప్రపంచ ప్రజల ముందున్న చారిత్రక కర్తవ్య నిర్వహణకు దారితీస్తుంది. ఇటో అటో తేల్చుకోవాల్సిన సమయమిది.

*(రచయిత సీనియర్ పాత్రికేయులు సమాజ విశ్లేషకులు)* వీ

# క్షీణిస్తున్న మీడియా చైతన్యాలు

***విదేశాల్లో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కొనసాగుతున్న పోరాటకారులను తెలుగు మీడియా ఒకసారి పోరాట వీరులని రాస్తూ, మరొకసారి పాశ్చాత్య మీడియాపై ఆధారపడి వారినే టెర్రరిస్టులుగా చూపిస్తోందని అంటున్నారు టంకశాల అశోక్***

ఒకవేళ వియత్నాం యుద్ధం ఇప్పుడు జరుగుతుండి ఉంటే, అక్కడి గెరిల్లా వీరులను తెలుగు జర్నలిస్టులు 'టెర్రరిస్టు'లంటూ రాసేవారేమో! ఇది అతిశయోక్తిగా అంటున్నమాట కాదు. ఇట్లా భావించడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి, స్వయంగా తెలుగు జర్నలిస్టులకు పరిజ్ఞానాలు, అవగాహనలు తగ్గుతున్నాయి. రెండు, పాశ్చత్య వార్తా సంస్థలు, పత్రికలు ఏమిరాస్తే దానిని నిర్విచక్షణగా స్వీకరించే లక్షణం పెరిగిపోతున్నది. అటువంటప్పుడు అమెరికా సామ్రాజ్య వ్యతిరేక దురాక్రమణకు వ్యతిరేకంగా, తమ దేశాన్ని తాము కాపాడుకునేందుకు పోరాడుతున్న వారు ఆరాధించి మద్దతివ్వవలసిన గెరిల్లా పోరాట యోధులో, లేక ఈసడించదగ్గ విధంగా సంబోధనకు గురవుతున్న టెర్రరిస్టులో వారు ఆలోచించగల, రాయగల అవకాశం తగ్గిపోతున్నది.

ఇది అతిశయోక్తి కాదనడానికి ఒక వాస్తవాన్ని గమనించండి. పాలస్తీనా పోరాటం ఎప్పటి నుంచో సాగుతున్నది. దానిని భారతదేశపు జర్నలిస్టులు దశాబ్దాలుగా సానుభూతి పూర్వకంగా చూసి వారిని పోరాట వీరులని రాస్తూ వస్తున్నారు. ఇప్పుడు వియత్నాం యుద్ధం ముగిసింది కాని పాలస్తీనా పోరాటం కొనసాగుతున్నది. దానికి సంబంధించి క్రమక్రమంగా 'టెర్రరిస్టు'లనే మాట తెలుగు పత్రికలు, ఛానళ్లలో చోటుచేసుకుంటున్నది. ఆ సమస్య గురించి కొత్త తరాల జర్నలిస్టులకు అవగాహన తగ్గుతున్నది. మన పిటిఐ, ఇతర వార్తా సంస్థలలో విదేశీ వార్తా సంస్థల ప్రమేయం పెరుగుతున్నది. ఎపి, ఎఎఫ్‌పి, రాయిటర్ వగైరాలు ఇచ్చే కాపీని ఇప్పుడు ఇండియా ఎడిటర్లు మార్చరు లేదా ఉపేక్షిస్తారు. స్వయంగా వారికి కూడా పరిజ్ఞానాలు, చైతన్యాలు తగ్గుతున్నాయి. పాలస్తీనాపై ప్రత్యేక కథనాలు, వ్యాసాలు, విశ్లేషణలు ఇక్కడ రాయడం దాదాపు ఉండడం లేదు. వాటిని కూడా విదేశీ ఏజెన్సీలు, రచయితలు తయారు చేస్తారు. అవి భారతీయ భాషా పత్రికల వారు యథాతథంగా తమ పత్రికా భాషలోకి అనువాదం చేసుకుంటారు. ఒకసారి పాశ్చాత్య దేశాల అంతర్జాతీయ మేగజైన్లు అయిన టైమ్, ఎకానమిస్టు వంటి వాటినుంచో, ఇంటర్నెట్ నుంచో కాపీ చేస్తారు. ఆ క్రమంలో పాలస్తీనా వంటి ఆయా అంశాలకు సంబంధించి పాశ్చాత్యుల భాష మాత్రమే గాక దృక్పథం కూడా ఏ మార్పు లేకుండా దిగుమతి అవుతుంది. తెలుగు పత్రికలు 'సెంట్రల్ డెస్క్' అని పేరు పెట్టుకుని రాసే సోకాల్డ్ ప్రత్యేక కథనాలలో కనిపించేది కూడా చాలావరకు ఇదే.

డెస్క్ వద్ద ఉండే కొత్త తరాల జర్నలిస్టుల స్థితి మాత్రమే ఈ విధంగా లేదు. కొంత సీనియారిటీ గలవారు కూడా అదే పని చేస్తున్నారు. ఇక పూర్తి సీనియర్లకు చాలా మందికి అసలు తమ పత్రికలలో ఏమి రాబోతున్నది, ఏమి వచ్చింది అని చూసే శ్రద్ధ లేదు. చూసినా సరిచూసే ఓపిక, పట్టింపు లేకుండా పోతున్నాయి. ఒక మేరకు ఇది అసలు వృత్తి విషయాలన్నింటికి ఆవరిస్తున్నది గనుక, ఇక పాలస్తీనా వంటి అంతర్జాతీయ అంశాల గురించి చెప్పనక్కర లేదు.

పాలస్తీనా గురించి ఇది ప్రత్యక్షంగా కనిపిస్తున్న విషయం గనుక, అదే విధమైన వియత్నాం గురించి కూడా మాట్లాడడం అతిశయోక్తి కాదని అంగీకరించవలసి ఉంటుంది. నిజానికి ఇటీవలి కాలపు అతి ప్రధాన ఘటనలైన అఫ్ఘానిస్థాన్, ఇరాక్‌లపై అమెరికా దుర్మార్గాన్ని గురించి మన తెలుగు పత్రికల తీరు చాలా మందికి గుర్తుండే ఉంటుంది. మనం పైన చర్చించుకున్న మీడియా ధోరణి కనిపించడం అప్పటికే మొదలైంది. అప్పటికే కొత్త తరాలవారు వృత్తిలోకి రావడం, సీనియర్ తరాలకు అధ్యయనంతో పాటు శ్రద్ధ తగ్గడం, మరొకవైపు మీడియాలో పాశ్చాత్య మీడియా ప్రాబల్యం పెరగడం మొదలయ్యాయి. ఆ రెండు యుద్ధాలు లేదా సామ్రాజ్యవాద దురాక్రమణలు మొదలు కొంతకాలం గడిచిన తర్వాత మన మీడియాకు కొద్దికొద్దిగా స్పృహ రావడం మొదలైంది గాని, ఆరంభం నుంచి తగినంత కాలం వరకు పాశ్చాత్య ప్రచారాన్ని యథాతథంగా స్వీకరించి రాశారు. అదే భావజాలం, అదే పదజాలం. వాటికి జోడించి స్వంత ఆవేశాలు, అదే రీతిలో.

అమెరికన్లు, యూరోపియన్లు, వారి పెట్టుబడి దారీ, ఫైనాన్స్ క్యాపిటల్, మల్టీనేషనల్స్, ఆర్థిక సంస్కరణలు, జాతి దురహంకారాలు, వీటన్నింటి పరిరక్షణకు ప్రపంచ వ్యాప్తంగా వర్ధమాన దేశాలలో, పేద దేశాలలో సాగిస్తున్న ఆర్థిక లావాదేవీలు, రాజకీయవ్యూహాలు, జరిపిస్తున్న సైనిక కుట్రలు, స్థానికంగా పాలక వర్గాలను, బురాక్రసీలను, రక్షణ అధికారులను, శాస్త్రజ్ఞులను, సామాజిక శాస్త్రజ్ఞులను, మీడియా పెద్దలను, సీనియర్ జర్నలిస్టులను కొనివేస్తున్న తీరు ఒక అంతులేని మహాకథ. భావజాలాలను, సంస్కృతులను భ్రష్టు పట్టించడం మరొక కథ. తమ ప్రయోజనాలకు కలిసిరాని వర్గాలకు, వ్యక్తులకు, ప్రతిఘటించే వారికి రకరకాల ముద్రలు వేసి తుదముట్టించడం, లేదా తమ కనుసన్నలలో పనిచేసే స్థానిక పాలకవ్యవస్థల ద్వారా ఆ పని చేయించడం ఒక అనునిత్య కార్యక్రమం.

ఇవేవీ ఊహాగానాలు కావు. నోమ్ ఛోమ్‌స్కీ వంటి అమెరికన్ మేధావుల నుంచి జూలియన్ అసాంజే వంటి అదే అమెరికన్లు వెల్లడి చేసిన అధికారిక డాక్యుమెంట్ల వరకు అనేకానేకం తెలియచెపుతున్న పచ్చి నిజాలు ఇవన్నీ. ఇట్లా బయటకు రాకున్నా అర్థమవుతున్న పరిస్థితులు అంతకు అనేకానేక రెట్లున్నాయి. విచారకరం ఏమంటే ఈ

విధంగా సామ్రాజ్యవాదపు పట్టు ప్రత్యక్ష పరోక్ష రీతులలో పెరుగుతూ వారి కార్యకలాపాలు విస్తరిస్తున్నా కొద్దీ తెలుగు - ఇండియా సహా వర్ధమాన ప్రపంచపు జర్నలిస్టుల పరిజ్ఞానాలు, అవగాహనలు కుంచించుకు పోతున్నాయి. శ్రద్ధ తగ్గుతున్నది. ఈ విధంగా ఏర్పడే శూన్యంలోకి పాశ్చాత్య సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ భావజాలాలు ప్రవేశిస్తున్నాయి. అంతిమంగా ఈ సమాజానికి హాని కలిగిస్తున్నాయి.

అంతర్జాతీయంగా పాశ్చాత్య పెట్టుబడిదారీ వైపునుంచి ఇటువంటివన్నీ జరుగుతున్నందున, వారు వర్ధమాన దేశాల ప్రజల భావజాలాన్ని కూడా తప్పు సమాచారాలు, వక్రీకరించిన విశ్లేషణలతో కలుషితం చేస్తున్నందున, ఒకవేళ స్థానిక మీడియాలోకి విదేశీ పెట్టుబడులు ప్రవేశించినట్లయితే ఆ ప్రమాదం మరింత పెరగగలదని ఆలోచనాపరులు భయపడ్డారు. ఇది ఇరవయ్యేళ్ల కిందటి మాట. వారి పెట్టుబడులు లేకుండానే భావజాలాన్ని ఒక మేరకు కలుషితం చేయగలుగుతున్నప్పుడు ఇక పెట్టుబడులు ప్రవేశించినా లేక ఆ పత్రికల ఎడిషన్లను యథాతథంగా ఇక్కడ ముద్రించేందుకు అనుమతి ఇచ్చినా ఇక చెప్పవలసింది లేదన్న ఆందోళనలు వ్యక్తమయ్యాయి. కాని ఈ ఇరవయ్యేళ్లలో పరిస్థితులు మారిపోయాయి. చివరకు పాశ్చాత్య ప్రపంచమే గెలిచింది. వారి పత్రికల ఎడిషన్లు ఏదో ఒక రూపంలో వస్తున్నాయి. కొన్ని ఇక్కడి పత్రికలకు అనుబంధాలుగా వస్తున్నాయి. ఇక్కడి పత్రికలలో విదేశీ పెట్టుబడులను, బోర్డులలో వారు నియమించే డైరెక్టర్లను ప్రభుత్వాలు అనుమతిస్తున్నాయి. ఇక్కడి కంపెనీల ద్వారా, ధనికుల ద్వారా వారి బేనామీలు వచ్చివేస్తున్నారు. సీనియర్ జర్నలిస్టులను, ఎడిటర్లను తమ ప్రయోజనాలకు అనుగుణంగా పనిచేసే వారిని నియమించుకుంటున్నారు. సీనియర్లు కాని వారిలోని కొత్త తరాలవారు అత్యధికులు పెద్ద కుటుంబాలవారు, ఎలిటిస్ట్ చదువులు చదివినవారు, పాశ్చాత్యీకరణ చెందినవారు అవుతున్నారు. ఇంకా మిగిలినవారు స్వయంగా ఒక అక్షరం కూడా రాయలేని పరిస్థితి ఉంటున్నది.

ఇప్పుడు ఇటువంటి పరిస్థితులలో పాలస్తీనా వగైరా అంతర్జాతీయ విషయాల మాట అట్లుంచి అసలు ఇక్కడి సమాజం, సమస్యలు, ప్రజల ఆకాంక్షలు, ఉద్యమాలు, జీవితాలు వగైరాలకు చోటు లేకుండా పోతున్నది. తప్పు సమాచారాలు, వక్రీకరణలు, వారికి అనుకూలమైన ప్రచారాలకు మాత్రం అన్ని అవకాశాలుంటాయి. ఈ పరిస్థితి 15-20-25 ఏళ్ల క్రితం ఉండేది కాదు. ఇప్పుడు మారిపోతున్నది. చాలా వరకు ఇప్పటికే మారింది. ఇప్పుడు ఈ మీడియాకంతా కావలసింది అభివృద్ధి, అభివృద్ధి, అభివృద్ధి. చెప్తే నమ్మకం కలగకపోవచ్చు గాని, తెలంగాణ ఉద్యమానికి వ్యతిరేకమైన వైఖరిని తీసుకునేట్లు ఢిల్లీ మీడియాను సీమాంధ్ర పెట్టుబడి దారులు, వారితో ఏకీభావం గల ఢిల్లీ వర్గాలు ప్రభావితం చేయగలగడానికి కారణం ఇదే.

జాతీయ మీడియా అనబడే ఇంగ్లీష్ మీడియాతో ఆరంభమైన ఈ మార్పును స్వయంగా ఆ మీడియా యజమానులు కొందరు మొదట్లో వ్యతిరేకించారు. కాని పాశ్చాత్యులతో చేతులు కలపడం వల్ల తమకు నష్టం లేకపోగా లాభాలున్నాయని, పెట్టుబడులు లభిస్తాయని, తమ స్థానిక పోటీదార్లతో తట్టుకునేందుకు, విస్తరణకు అవకాశాలుంటాయని, ఈ మేనేజ్‌మెంట్లకు గల ఇతర ఆర్థిక ప్రయోజనాలకు అవసరమైన సహకారాలు కూడా లభిస్తాయని నెమ్మదిగా ఒప్పిస్తూ పోవడంతో వారి దృష్టి మారింది. ఇప్పుడిది ఇంగ్లీష్ మీడియాను విజయవంతంగా గెలిచిన తర్వాత, తెలుగు తదితర భాషా పత్రికలలోని పెద్ద మీడియాకు విస్తరిస్తున్నది. అయితే ఇంకా ఆరంభదశలో ఉండగానే మొదట చెప్పుకున్నటువంటిది జరుగుతున్నప్పుడు, ఇక తర్వాత దశలలో ఏమి జరగగలదనే ఆలోచనే జంకు కలిగిస్తున్నది.

ఇంతవరకు చేసిన ఈ చర్చ నేపథ్యంలో ఇప్పుడు ప్యారిస్ పత్రిక చార్లెస్ హెబ్డోపై ఇస్లామిస్ట్ యువకుల దాడి వార్తలు, వ్యాఖ్యలు, శీర్షికలు, కార్టున్లు మన తెలుగు పత్రికలలో ఏ విధంగా వచ్చాయన్నది ఒకసారి తిరిగి పరిశీలించండి. ఆదాడి, హత్యలు ఖండించదగినవనడంలో రెండవ అభిప్రాయం లేదు. కాని, వార్తలు ఎట్లున్నప్పటికీ వాటి శీర్షికలు, వ్యాఖ్యలు, సంపాదకీయాలు, కార్టున్లు ఏకపక్షంగా ఎందుకున్నట్లు? ఆ ఘటనకు వెనుక గల కారణాలను ఎందుకు విస్మరించినట్లు?

అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచవ్యాప్తంగా ఏమేమి చేస్తున్నదో, అందులో భాగంగా పాలస్తీనా అణచివేత అన్నది మొదలుకొని అఫ్ఘాన్, ఇరాక్ వంటి ఉదంతాలు, ఇంకా అటువంటివే అంతటా ముస్లిం యువతకు, ప్రజలకు ఆగ్రహ కారణాలవుతూ వస్తున్నాయి. మతంతో నిమిత్తం లేకుండా ప్రజాస్వామిక వాదులు, మానవతా వాదులు కూడా ఆ చర్యలను వ్యతిరేకిస్తున్నప్పుడు ముస్లింల మనోభావాలు ఏ విధంగా ఉండేదీ చెప్పనక్కర లేదు. మణిశంకర్ అయ్యర్ వంటి సీనియర్ కాంగ్రెస్ నాయకుడు బహిరంగంగా ఎత్తి చూపినట్లు, అమెరికన్ టవర్స్‌పై దాడి అనంతరం టెర్రరిజం అణచివేత పేరిట అమెరికన్లు, యూరోపియన్లు ప్రపంచ వ్యాప్తంగా ముస్లింలపైన, పాశ్చాత్య దేశాలలో సాగిస్తున్న చర్యలు అమాయకులను కూడా పెద్ద ఎత్తున బలితీసుకుంటున్నాయి. జీవితాలను దుర్భరం చేస్తున్నాయి. ప్యారిస్ పత్రిక కార్టున్లు టెర్రరిజం ఖండనకు పరిమితమైతే అభ్యంతర పెట్టవలసిందేమీ లేదు. కాని బుద్ధి పూర్వకంగా పదేపదే మహమ్మద్ ప్రవక్తను అందులోకి లాగడంలోని విజ్ఞత గాని, పత్రికా స్వేచ్ఛగాని ఏమిటి?

పాశ్చాత్యులు 16వ శతాబ్దంతో ఆరంభించి లాటిన్ అమెరికాలో కాంక్విస్టాడోర్స్‌గా, బానిసల వ్యాపారులుగా, వేర్వేరు ఖండాలలో వాణిజ్య పెట్టుబడిదారులుగా, వలస వాదులుగా, మతవ్యాప్తి దారులుగా, సామ్రాజ్యవాదులుగా సాగించిన హత్యాకాండలు, ప్రపంచ యుద్ధాలు, జపాన్‌పై అణ్వస్త్ర ప్రయోగాలు, వియత్నాం మొదలుకొని అఫ్ఘాన్, ఇరాక్‌ల వరకు మారణ హోమాలలో ఎన్ని కోట్ల మంది ప్రజలు హతమయ్యారో లెక్కించగలరా? మరి ఇన్నిన్ని దారుణాలను ఖండించిన ఆయా దేశాలవారు వాటితో ఎక్కడైన ఏసుక్రీస్తును ముడిపెట్టారా? ఆయన పేరిట మత ప్రచారంలో ప్రచారకులు దుర్మార్గం చేశారన్నారు తప్ప నేరుగా క్రీస్తును నిందించడం జరగలేదు. అటువంటి స్థితిలో ఇప్పుడు ప్రవక్త ప్రస్తావనలోని వివేకం, నాగరికత, భావప్రకటనా స్వేచ్ఛ, సహేతుకత ఏమిటి?

ప్రస్తుతం మన చర్చకు సంబంధించిన సమస్య ఏమంటే మన మీడియా చైతన్యాలు, భావజాలాలు ఇటువంటి విచారణలన్నింటిని మరిచిపోయి పాశ్చాత్య భావజాల ప్రభావంతో ఏకపక్ష ధోరణి

తీసుకుంటున్నాయి. ముఖ్యంగా ఇటువంటి విషయాలలో వారిని ప్రభావితం చేస్తున్న అంశం మరొకటి ఉంది. అది, ముస్లిం దేశమైన పాకిస్థాన్‌తో మనవైరం కొనసాగుతుండడం, ముస్లిం మెజారిటీ రాష్ట్రమైన జమ్మూ – కశ్మీర్ సమస్య ఇంకా పరిష్కారం కాకపోవడం, దేశంలోని ముస్లిం యువకులు కొందరు తీవ్రవాద కార్యకలాపాలలో పాల్గొంటుండడం. ఈ పరిస్థితుల వల్ల మీడియాకు కలుగుతున్న ఆలోచనలు సందర్భవశాత్తు అమెరికా వ్యూహానికి, ప్రయోజనాలకు కలిసి వచ్చే విధంగా తయారవుతున్నాయి. ఆ మాట తెలిసిన ఆ వ్యూహ కర్తలు దీనిని పూర్తిగా ఉపయోగించుకుంటున్నారు. ఒకవేళ పాకిస్థాన్, జమ్మూ – కశ్మీర్, ముస్లిం యువకులు అనే మూడు అంశాలు లేనట్లయితే మన మీడియా ప్యారిస్ ఘటనను గాని, అంతకు ముందు అఫ్ఘాన్, ఇరాక్‌లను గాని, ఇంకా అనేకానేక ఇతర అంశాలను గాని భిన్నమైన దృష్టితో చూసి ఉండేదనాలి. పాలస్తీనాను కొన్ని దశాబ్దాల పాటు అట్లా చూసింది కూడా. వారిని పోరాట వీరులనే అభివర్ణించింది. పాశ్చాత్యుల ప్రచారాన్ని విచక్షణా యుతంగానే గమనించి తిరస్కరించింది. కాని ఇప్పుడు వారు అమెరికన్లకు వలెనే మన జర్నలిస్టులకు కూడా టెర్రరిస్టులయ్యారు.

ఈ విధమైన సామ్రాజ్యవాద భావజాలానికి తమకు తెలియకుండానే లోనయిపోతున్న మన జర్నలిస్టులు మునుముందు ఇంకా ఏమేమి చేయవచ్చు? ఒక సమస్య ఏమంటే వారికి లోగడవలె స్వీయ అధ్యయనం ఉండడం లేదు, సీనియర్ల నుంచి మార్గదర్శకత్వం లభించడం లేదు, జర్నలిజం కోర్సులు చెప్పే కాలేజీలకు, సంస్థలకు అసలు ఇటువంటివి దృష్టి పెట్టదగ్గ విషయాలుగా తోచడం లేదు, జర్నలిస్టు సంఘాల వంటి సంస్థలు ఇతరత్రా విరామం లేకుండా ఉన్నాయి. ఇందుకు అదనంగా, వారికి గతంలో వలె సామాజికంగా జరుగుతుండిన రాజకీయ, బౌద్ధిక కార్యక్రమాల నుంచి, తత్సంబంధిత సాహిత్యం నుంచి పరిజ్ఞానం, చైతన్యం లభించడం గాని, దానిని వారు స్వీకరించడం గాని గణనీయంగా తగ్గుతున్నది. వివిధ అస్తిత్వ ఉద్యమాలు తమ పరిధిలకు పరిమితం కావడంతో ఈ విధమైన విస్తృత దృష్టి లేకుండా పోతున్నది.

పైన మొదటి నుంచి పేర్కొన్న వివిధ పరిస్థితులన్నీ కలిసి మీడియా చైతన్యాలను క్షీణింపచేస్తున్నాయి. ఇది అధిగమించలేని సమస్య కాదు. అయితే ఇందుకు బహుముఖ ప్రయత్నాలు అవసరం. అందుకు చొరవ తీసుకోవలసింది సీనియర్ జర్నలిస్టులు, జర్నలిస్టు సంస్థలు, డిపార్టుమెంట్లు. చొరవ తీసుకుని ఆ తర్వాత ఇతరుల సహకారాన్ని కూడా పొందాలి.

జనవరి 19న పత్రికలలో వచ్చిన ఒక తాజా వార్తను గమనించండి. ఫ్రాన్స్‌లో జరిగిన ఒక ప్రజాభిప్రాయ సేకరణలో 42 శాతం మంది, చార్లెస్ హెబ్డో పత్రిక మహమ్మద్ ప్రవక్తపై కార్టున్లు ప్రచురించడాన్ని వ్యతిరేకించారు. అవి తమ మనోభావాలను గాయపరుస్తున్నాయని ముస్లింలు అభిప్రాయపడినపుడు అట్లా ప్రచురించడం సరికాదన్నారు. 'ఇఫాప్' అనే సంస్థ జరిపిన ఆ ప్రజాభిప్రాయ సేకరణలోని మరొక ఆసక్తికరమైన విషయం లిబియా, సిరియా, మెమెన్ వంటి ఇతర దేశాలలో సైనిక జోక్యాన్ని ఫ్రాన్స్ ప్రజలలో 57 శాతం మంది వ్యతిరేకించారు.

ఇందులో మొదటి అంశం గురించి స్పష్టంగా అర్థమవుతున్నదే గనుక ఎక్కువ వివరణ అక్కరలేదు. ఎక్కడైతే దాడి జరిగిందో అక్కడి ప్రజలలోనే అంత పెద్ద సంఖ్యలో పౌరులు ఇతర మతాల వారి మనోభావాలను గాయపరచడం పత్రికా స్వేచ్ఛ కాదని, సమంజసం కాదని అభిప్రాయపడ్డారంటే, వర్ధమాన దేశాల ప్రజలు, జర్నలిస్టులు మరెంత సహేతుకంగా, సంయమనపూర్వకంగా ఆలోచించవలసి ఉందో ఈ ప్రజాభిప్రాయ సేకరణ చెప్తున్నది. టెర్రరిస్టు చర్యను ఖండించడానికి, ప్రవక్తను అందులోకి తెచ్చే తరహా చర్యలకు తేడా ఉందని గ్రహించాలి. కాని గమనించదగినదేమంటే, భావ ప్రకటనా స్వేచ్ఛపై రాజీలేదంటూ ఫ్రెంచ్ అధ్యక్షుడు ఫ్రాన్సువా హోలాండె మరొక మారు ఇదే సందర్భంలో ప్రకటించాడు. అందులో ఆశ్చర్యపడదగింది లేదు. ఆయన ఒక సామ్రాజ్యవాది గనుక. రకరకాల స్వేచ్ఛల పేరిట వీరందరి ఉద్దేశం సామ్రాజ్యవాద ప్రయోజనాలను కొనసాగించడమే. గొప్ప సాంస్కృతిక విప్లవాల ద్వారా ఫ్రాన్స్ సమాజం కొన్ని శతాబ్దాలుగా అనేక స్వేచ్ఛలను సాధించుకున్నది, రూపొందించుకున్నది. కాని వాటిని పెట్టుబడిదారులు దుర్వినియోగపరుస్తున్నారు.

ఇక పై అభిప్రాయ సేకరణలోని రెండవ అంశం ఇంతకన్న ముఖ్యమైంది. విదేశాలలో సైనిక జోక్యాన్ని అక్కడ అధిక సంఖ్యాకులు వ్యతిరేకిస్తున్నారు. బ్రిటన్ తర్వాత రెండవ అతిపెద్ద వలస సామ్రాజ్యాన్ని నడిపిన ఫ్రాన్స్‌కు ఆఫ్రికాలో అనేక మాజీ వలసలున్నాయి. ఇప్పటికీ అవి నయా వలసలుగా కొనసాగుతుండడమే గాక, చిన్న చిన్న భూ భాగాలు, దీవులు అక్కడ ఫ్రాన్స్ స్వాధీనంలో ఉన్నాయి. వీటన్నింటి నుంచి వలస పాలనా కాలంలో, ఆ తర్వాత కూడా అనేక లక్షల మంది (ఇప్పటికి కోట్లు) ఫ్రాన్స్‌కు వలస పోయారు. అట్లా పోయిన వారిలో ఆయా దేశాల ఆదివాసులు, నల్లవారు, అరబ్బులు ఉన్నారు. వీరిలో అత్యధికులు ముస్లింలు. అటువంటి వలసలను రకరకాల కారణాల వల్ల ఫ్రాన్స్ అనుమతించడమే గాక ప్రోత్సహించింది. వారినక్కడ బానిసలుగా, కూలీలుగా, చిన్నా చితకా పనులకు తక్కువ జీతాలపై వాడుకోవడం ప్రధాన ఉద్దేశం. వలసల అనుమతిని కొందరు ఉదారవాద మంటూ వక్రీకరిస్తున్నారు. వీరిపట్ల దారుణమైన వివక్షత కారణంగా ప్యారిస్ పరిసర మురికి వాడలలో నేరాలు, తిరుగుబాట్లు, అల్లర్లు సర్వ సాధారణమన్నది తెలిసిందే. ఇస్లామిస్టు యువకుల ఆగ్రహాలు ఒక విధంగా ఈ పరిస్థితుల పట్ల నిరసనకు కొనసాగింపు.

ఫ్రెంచ్ సామ్రాజ్యవాదానికి, కొనసాగుతున్న నయా వలసవాదానికి, తరచు సైనిక జోక్యాలకు, ఆయా దేశాల నుంచి ఇతరులతో పాటు ముస్లింల వలసలకు, వీరందరి అశాంతికి, వారి అణచివేతకు పరస్పర సంబంధాలున్నాయి. చివరకు భావ ప్రవటనా స్వేచ్ఛ, పత్రికా స్వేచ్ఛ అన్నది కూడా పరోక్ష రూపంలో ఈ అణచివేత కార్యక్రమానికి సాధనాలు అవుతున్నాయి. ఈ స్వేచ్ఛలు మౌలికంగా ఎంత వాంఛనీయమో, వాటిని ఆ ముసుగులో సామ్రాజ్యవాదం, జాతివాదం దుర్వినియోగ పరచడం అంత గర్హనీయమవుతుంది. ఈ విధమైన సమగ్ర దృష్టి తీసుకోవడం తెలుగు జర్నలిస్టులకు అవసరం. లేనిదే తమ ప్రజలకు అవగాహన ఎట్లా?

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)* వీ

# ప్యారిస్ ఘటన - ఫ్రాన్స్ తప్పిదాలు

*ప్రపంచ జనాభాలో రెండవస్థానంలో ఉన్న ముస్లింల సంస్కృతిని, మనోభావాలను కించపరిచే విధంగా పెట్టుబడిదారీ సంస్థలు, పత్రికలు ప్రచురించి, వారిపై ఉగ్రవాదులుగా ముద్రవేసి ప్రచారం చేస్తున్నాయని అంటున్నారు* **ఎం.కె. కుమార్**

ప్యారిస్ నగరంలో వ్యంగ్య వారపత్రిక చార్లీ హెబ్డో కార్యాలయంపై 2015 జనవరి 7న గుర్తు తెలియని సాయుధులు దాడులకు పాల్పడ్డారు. పత్రిక ఎడిటర్ ఇన్ చీఫ్ చార్బ్, ముగ్గురు ప్రముఖ కార్టూనిస్టులు కబు, టిగ్నస్, వొలిన్స్కీలను, ఇద్దరు పోలీసులను కాల్చి చంపారు. దాడి జరిగిన వెంటనే ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ హులాండ్ దాడిని ఖండిస్తూ, ఈ దాడిని ఇస్లామిస్ట్ ఉగ్రవాదులు చేశారని, వీరికి ఆల్‌ఖైదాతో సంబంధముందని ప్రకటించారు. దాడి జరుగుతున్నంత సేపు అల్‌ఖైదా గుర్తు కుడిచేయి చూపుడువేలును పైకి చూపడం చేశారని మీడియా పేర్కొంది. దేవుడు ఒక్కడే అనే దానికి ఇది సంకేతం. భావప్రకటనా స్వేచ్ఛపైన, రిపబ్లిక్ స్ఫూర్తిపైనా జరిగిన దాడిగా హులాండ్ అభివర్ణించాడు. హెబ్డో వారపత్రిక వ్యంగానికి పెట్టింది పేరు. సెలబ్రిటీలను, రాజకీయ నాయకులను, మతాధికారులను కించపరుస్తూ, చిత్రీకరించడం వారు చాలాకాలంగా చేస్తున్నదే. దానికి వ్యంగమనే పేరు పెట్టి విశృంఖల స్వేచ్ఛకు పాల్పడ్డారు. ఈ లెక్క చేయని తనానికి వారు ప్యారిస్ కమ్యూన్ నుండి సాధించిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే పదాలను వాడుకున్నారు. ఆ పత్రికపై అనేక న్యాయ పరమైన కేసులు నడిచినప్పటికీ, పత్రికను మూసివేసే దిశగా తీర్పులు ఇప్పటివరకు వెల్లడికాలేదు. 30,000 మించి సర్క్యులేషన్ లేని వారపత్రిక, దాడి జరిగిన దరిమిలా 60,000 కు అమాంతం పెరిగిందని, పత్రికను కొనడం ద్వారా ఉగ్రవాద వ్యతిరేకతను ఫ్రాన్స్ ప్రజలు చాటారని పత్రికా యాజమాన్యం ప్రకటించుకుంది.

దీన్ని మీడియాపై దాడిగా భావించిన అన్ని దేశాలు ఖండించాయి. అంతర్జాతీయంగానే మీడియాపై దాడులు తీవ్రమయ్యాయి. మీడియా యాజమాన్యంపై దాడులు చాలా తక్కువే కాని, అందులో పొట్టకూటి కోసం పనిచేసే పాత్రికేయులు ఎంతోమంది ప్రపంచానికి వార్తలు అందించబోయి, తమ ప్రాణాలను కోల్పోయారు. 70 మంది ప్రముఖ పాత్రికేయులు మరణించినట్టు మీడియా పేర్కొంది. వందల సంఖ్యలో సాధారణ స్థాయి విలేకరులు మరణిస్తూనే ఉన్నారు. మరోవైపు కిడ్నాప్ అయిన పాత్రికేయు 120 దాకా ఉన్నారు. సుమారు 200 మంది నిర్బంధంలో మగ్గుతున్నారు. ఈ సంఘటనలు ఎక్కువుగా ఈజిప్టు, మెక్సికో, సిరియా, యెమన్, ఇజ్రాయిల్, ఆఫ్ఘనిస్థాన్ తదితర దేశాలలో జరుగుతున్నవే. ఈ దేశాలన్నిటిపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానే అమెరికా కూటమి అప్రజాస్వామిక యుద్ధం చేస్తోంది. 1848లో ఫ్రెంచి బూర్జువా విప్లవం జరిగింది. 1871లో ప్యారిస్ కమ్యూన్ స్థాపించబడింది. పట్టుమని రెండు నెలలు కూడా నిలువని కమ్యూన్ కూల్చబడింది. ఆ తర్వాత ఫ్రాన్స్‌లో అద్భుత పోరాటాలు జరిగాయి. అదే ఫ్రాన్స్ ఈ రోజు అమెరికా యుద్ధం చేస్తున్న ప్రతిదేశంలోని సాధారణ పౌరులను, ఉగ్రవాదులనే నెపంతో చంపేదానికి తమ సైన్యాన్ని పంపిస్తూనే ఉంది. ఫ్రాన్స్ నాటో కూటమిలో భాగంగా ఉండడం మూలాన అనేక దేశాల్లో డ్రోన్, బాంబు దాడుల్లో ప్రత్యక్షంగా పాల్గొంది. ఫ్రాన్స్‌లోని అభ్యుదయకర శక్తులు ఫ్రాన్స్ నాటో కూటమి నుండి వైదొలగాలని, ఉగ్రవాదం పేరుతో మరొక దేశ సార్వభౌమాధికారాన్ని అగౌరవపరచడం తగదని నిరసనలు తెలుపుతూనే ఉన్నారు. అంతిమంగా ఫ్రాన్స్ పౌరులు ఉగ్రవాదుల దాడులకు బలి కావల్సి వస్తుందనీ హెచ్చరించాయి. అయినా ఫ్రాన్స్ పాలకుల వైఖరిలో మార్పురాలేదు.

స్వేచ్ఛా, సమానత్వాలకు వ్యతిరేకంగా ఉగ్రవాదులు మతం పేరు చెప్పి మతిలేని హింసకు పాల్పడుతున్నారని, వారి దాడులను తిప్పి కొడతామని సుమారు 44 దేశాల ప్రతినిధులతో పాటు ఫ్రాన్స్‌లోని అశేష జనవాహిని ముక్తకంఠంతో నినదించింది. ఈ శాంతి ర్యాలీని అమెరికా సామ్రాజ్యవాద కూటమి తను వివిధ దేశాల్లో చేసిన మారణకాండకు సాధికారితను తెచ్చుకునేందుకు, భవిష్యత్తులో మరింత దూకుడుగా, ఏకపక్షంగా వ్యవహరించడానికి ఉపయోగించుకుంది.

హెబ్డో వారపత్రికపై జరిగిన దాడిని అందరూ ఖండించవలసిందే. దాడికి పాల్పడ్డ వ్యక్తులకు, శక్తులకు చట్టం పేర్కొన్న విధంగా శిక్షలు పడవలిసిందే. అదే సమయంలో హెబ్డో వ్యంగ్యపత్రిక వ్యవహరించిన తీరును తప్పుపట్టాల్సి ఉంది. ప్రజాస్వామిక విలువలను తుంగలో తొక్కి, పత్రికా స్వేచ్ఛపేరుతో తీవ్ర నిరంకుశ వైఖరిని ఆ పత్రిక పాటించింది. ఆ పత్రికలో పడ్డ కార్టూన్‌లపై ప్రతిమాసం ఏదో ఒక దేశంలో నిరసనలు వ్యక్తమవుతూనే ఉన్నాయి. ఆ పత్రికా ప్రతులను తగలపెడుతూనే ఉన్నారు. ప్రపంచంలో రెండవ అతిపెద్ద జనాభాగా ఉన్న ముస్లింల మనోభావాలను కించపరిచే విధంగా మహ్మద్‌ప్రవక్త కార్టూన్‌ను ప్రచురించింది. ఇది మొదటిసారి కానే కాదు. వివిధ దేశాల ముస్లిం మత పెద్దలు అనేకసార్లు అటువంటి పెడవాద ధోరణులను మానుకోవాలని హితవు పలికినా తన తీరును మార్చుకోలేదు. ఇంత మందిని పొట్టన పెట్టుకోవడానికి పత్రిక యాజమాన్య మూర్ఖత్వం, నిరంకుశత్వం కూడా కారణాలే. ఇప్పటికీ తన పద్ధతిలో మార్పురాబోదని, ఇంకా వ్యంగ్యంగా మరింతగా ప్రజల మనోభావాలు దెబ్బ తినే విధంగా పత్రికను తీసుకువస్తామని వారు సెలవిచ్చారు. ఫ్రెంచి విప్లవ స్ఫూర్తితో ప్రకటించుకున్న వాక్ స్వాతంత్ర్యపు హక్కును అపరిమిత స్వేచ్ఛతో వాడుకోవడం చార్లీ హెబ్డోకే చెల్లింది. భారతదేశంలో 1837లో రూపొందించబడి, 1950న రాజ్యాంగం ద్వారా ఇవ్వబడ్డ వాక్ స్వాతంత్ర్యపు హక్కు అనేకసార్లు మార్పులకు గురైంది. ఉన్న హక్కులకే

గ్యారంటీలేని దశలో మనముంటే, పెట్టుబడిదారీ దేశమైన ఫ్రాన్స్‌లో పూర్తి భిన్నంగా ఉంది. పరమత సహనానికి ఇక్కడ అనేక చట్టాలున్నాయి. వలస పాలకులు రూపొందించిన 175 ఏళ్లలాంటి చాలా చట్టాలను, మనదేశంలో ప్రజాస్వామ్యం పేరిట కొనసాగిస్తూనే ఉన్నారు. 2009లో చార్లీ హెబ్డో తన పత్రికలో పనిచేసే సైన్ మారిస్ సిన్ అనే పాత్రికేయుణ్ని తొలగించారు. అతను యూదు వ్యతిరేక భావనను కల్పించే విధంగా హెబ్డోలో ఒక వ్యాసం రాశారు. పెను ప్రకంపనలను సృష్టించిన ఆ వ్యాసం ఫ్రాన్స్‌లో తీవ్ర నిరసనలకు దారితీయడంతో అప్పటి హెబ్డో సంపాదకులు ఫిలిప్పెవాల్ అతన్ని తొలగించారు. ముస్లింలకు వ్యతిరేకంగా వరుసగా వస్తున్న కార్టూన్లకు, వార్తలకు హెబ్డో సంపాదకీయం క్షమాపణల దిశగా ఎప్పుడూ అడుగులు వేయలేదు.

50 దేశాల నేతలు, సుమారు 40 లక్షలమంది ప్రజలు పాల్గొన్న శాంతి ప్రదర్శన చివరకు ఉగ్రవాదులను మరింత రెచ్చగొట్టే రీతిలోనే ముగిసింది. మేము చార్లీలనే మమ్మల్ని చంపుతారా అనే నినాదాలు మిన్నంటాయి. ఆశ్చర్యంగా ఉగ్రవాదానికి మారుపేరైన, ఉగ్రవాదాన్ని పెంచిపోషించిన దేశాలతో పాటు, అమెరికా ఉగ్రవాదానికి బలవుతున్న పాలస్తీనా, ఇజ్రాయిల్‌తో పాటు ప్రదర్శనలో పాల్గొనింది. మతాన్ని, ఉగ్రవాదాన్ని వేరుచేసి చూడాలని వీరు వక్కాణించి ఉంటే బాగుండేది. ఇస్లామిస్ట్ తీవ్రవాదానికి వ్యతిరేకంగానే ఈ ప్రదర్శన జరిగినట్టు మీడియా పేర్కొంది. ఇంత భారీ జన ప్రదర్శన ఫ్రాన్స్‌లో ఉగ్రవాదానికి వ్యతిరేకంగా జరగడం ఇదే ప్రథమం. 1961 తర్వాత ఇంత భారీ ప్రాణనష్టం ఎప్పుడూ సంభవించలేదు. ఈ సంఘటనతో ముఖ్యంగా ధనికదేశాలు బెంబేలెత్తి పోయాయి. కాల్పులకు పాల్పడిన వారు కౌచీ సోదరులైన సయీద్, షరీఫ్‌లని, వీరు అల్జీరియా దేశం నుండి వలస వచ్చి ఫ్రాన్స్‌లో స్థిరపడ్డవారుగా ప్రభుత్వంపేర్కొంది. అల్జీరియా గతంలో ఫ్రెంచి వలస పాలనలో ఉంది.

గుర్తు తెలియని వ్యక్తులు ఎక్కడైనా కాల్పులకు తెగపడితే, కొన్ని గంటల వ్యవధిలోనే వారు ఇస్లామిక్ ఉగ్రవాదులని ప్రచారం విశ్వ వ్యాప్తితమవుతోంది. ఎటువంటి ఆధారాలు లేకుండానే చూపుడు వేలు ముస్లింల వైపు, వారు నివసించే దేశాలవైపు చూపబడుతుంది. సంఘటన జరిగిన వెంటనే అంతర్జాతీయ సమాజం స్పందించడం, శాంతి ర్యాలీల పేరుతో ఇస్లామిక్ ఉగ్రవాదాన్ని తుదముట్టిస్తామని, సమర్థవంతంగా వారి దాడులను తిప్పికొడతామని అమెరికా రికార్డు ప్లేని అందరూ అనుకరిస్తారు. సంఘటనకు దారితీసిన పరిస్థితులను, ఉగ్రవాద మూలాలను కనుగొనడానికి ప్రయత్నించరు. ఉగ్రవాద సంఘటనలను రాజకీయ, సామజిక కోణంలో చూడనంత కాలం ఇటువంటి సంఘటనలు పునరావృతమవుతూనే ఉంటాయి.

కౌచీ సోదరులు ఇంతటి దుర్మార్గమైన చర్యకు పాల్పడక ముందు వారు సాధారణ పౌరులుగానే జీవించారు. పిజ్జా తయారీ చేసే షాపులో డెలివరీ బాయిస్‌గా పని చేశారు. మసీదుకు వెలుతున్న క్రమంలో ఫరీదు అనే వ్యక్తి పరిచయంతో వారి ఆలోచనలు మారాయి. ఇరాక్‌లోని సాధారణ ముస్లిం పౌరులను అమెరికా ఎంత దారుణంగా చంపుతుందో, పిల్లలను, మహిళలను ఎలా చిత్రహింసలకు గురిచేస్తుందో, అబూ గ్రాయిబ్ జైలులో యుద్ధవీరులు ఎలాంటి అమానుష చిత్రహింసలకు గురిచేయబడ్డారో వీరికి వీడియోలు చూపించారు. అమెరికాపై ఆగ్రహంతో ఊగిపోయిన వీరు ఇరాక్‌లో అమెరికా కూటమి సైన్యానికి వ్యతిరేకంగా యుద్ధానికి 2005లో వెళ్లారు. షరీఫ్, అతని మరో స్నేహితుడు పోలీసులకు దొరికిపోవడంతో 2008లో 18 నెలల జైలు జీవితం గడిపారు. సిరియాలో అసద్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు అమెరికా, ఫ్రాన్స్ పన్నిన కుట్రకు రెచ్చిపోయిన వీరు సిరియాలోను యుద్ధం చేశారు. సిరియా, ఇరాక్‌లలో వీరు దేశభక్తులుగా కీర్తింపబడ్డ వారే. 2014లలో ప్యారిస్‌కు వచ్చినవీరికి యెమెన్ కేంద్రంగా పనిచేస్తున్న అల్‌ఖైదా సంస్థ చార్లీ పత్రికా కార్యాలయంపై దాడికి పాల్పడాలని, అవసరమైతే మానవబాంబులుగా మారి ఆత్మాహుతి దాడులకు సిద్ధపడాలని పిలుపునిచ్చింది. కోట్లమంది ముస్లింల ఆత్మగౌరవాన్ని కించపర్చిన చార్లీ యాజమాన్యానికి బుద్ధి చెప్పారని సంఘటన తదనంతరం అల్‌ఖైదా ప్రకటించింది. యెమన్ కేంద్రంగా పనిచేస్తున్న అల్‌ఖైదాను, ఇస్లామిస్ట్ తీవ్రవాదులను తయారు చేసి, వారికి ఆయుధాలు ఇచ్చింది అమెరికా, ఫ్రాన్స్‌లే. ఆయాదేశాలలోని మార్కెట్‌ను సొంతం చేసుకోవడానికి, అక్కడ తమ కీలుబొమ్మ ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి అమెరికా పెంచిపోషించిన తీవ్రవాదుల్లో కౌచీ సోదరులు కూడా ఉన్నారు. ఇరాక్, సిరియాలలో అమెరికా, ఫ్రాన్స్‌లు సైన్యాన్ని పంపించకపోయి ఉంటే ఈ సంఘటన జరిగేది కాదని, కౌచీ సోదరులు తీవ్రవాదులుగా మారేవారు కారని ప్రజాస్వామికవాదులు అభిప్రాయ పడుతున్నారు. రూపంలో ఇది చార్లీ పత్రికా కార్యాలయంపై దాడిగా కనిపించవచ్చు, నిజానికి ఇది అమెరికా సామ్రాజ్యవాదంపై దాడి మాత్రమే. అమెరికాకు కొమ్ము కాస్తున్న ఫ్రాన్స్ ప్రభుత్వంపై దాడి. అందుకే సామ్రాజ్యవాద దేశాలు ఈ సంఘటనకు అత్యంత ప్రాధాన్య మిచ్చి మరింత మారణకాండకు పాల్పడేందుకు ఫ్రాన్స్ ప్రజల అనుమతిని శాంతిర్యాలీ ముసుగులో తీసుకున్నాయి.

ఫ్రాన్స్ గత కొంతకాలంగా పని కట్టుకుని ముస్లిం వ్యతిరేక భావ జాలాన్ని ప్రచారం చేస్తున్నది. పశ్చిమ దేశాల్లో ముస్లిం వ్యతిరేక ప్రచారం తుదిదశకు చేరింది. యూరప్‌లో నిరుద్యోగ సమస్యకు వలస వచ్చిన ముస్లింలే కారణమనే పెడ ధోరణులను అక్కడి ప్రభుత్వాలు ప్రచారం చేస్తున్నాయి. ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంషా ఒలాండే సిరియాలోని ఉగ్రవాద గ్రూపులకు తమ దేశం ఆయుధాలను సరఫరా చేస్తుందని 2014లో ప్రకటించారు. సిరియా నుండి వచ్చిన కౌచీ సోదరులు తమ దేశంలో దాడికి పాల్పడితే ఉగ్రవాదులై పోయారు. సిరియా ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నవారు ఉద్యమకారులు, యోధులని కామెరూన్, ఒబామాలు పేర్కొన్న విషయం అంతర్జాతీయ సమాజం ఇంకా మర్చిపోలేదు. ఫ్రాన్స్‌లో రాజకీయ అస్థిరత రాజ్యమేలుతోంది. హొలాండే, సర్కోజీ మాదిరే పొదుపు విధానాలను, కార్పొరేట్లకు ప్రయోజనం చేకూర్చే ఆర్థిక విధానాలను అవలంభిస్తున్నాడు. ఈ సమయంలో ప్యారిస్ ఘటన హోలాండేకు అందివచ్చిన అవకాశంగా విశ్లేషకులు భావిస్తున్నారు. సిరియాలో ఫ్రాన్స్ సైన్యం వెంటనే రావాలని ఫ్రాన్స్ ప్రజలు కోరుతున్న సమయంలో ఈ సంఘటన జరగడం వల్ల ప్రజలు ఇకపై సిరియా విషయంపై మౌనం వహించే విధంగా ఫ్రాన్స్ శాంతిర్యాలీ పేరిట ఎత్తు వేశారు. ఈ దాడి 9/11 దాడితో పోల్చి మరింత సానుభూతిని ఫ్రాన్స్ పొందాలనుకుంటోంది. మరోవైపు విదేశీ వ్యవహారాల్లో అక్రమ జోక్యానికి ఇది అవకాశం కానుంది.

ప్యారిస్ సంఘటన జరుగక ముందు నుంచి నిఘా వర్గాలు, సిరియాలో తిరుగుబాటు చేస్తున్న ఫ్రాన్స్ జాతీయులు ఫ్రాన్స్‌లోను

దాడులకు పాల్పడవచ్చునే సంకేతాలను ఇచ్చింది. దాడి జరిగిన రాత్రే కాల్పులకు పాల్పడ్డవారు సయీద్ కువాచి, చెపిఫ్ కువాచి, హమీద్ మెరాద్‌గా ప్యారిస్ పోలీసులు ప్రకటించారు. ఇద్దరు సోదరులను పోలీసులు కాల్చివేస్తే, మూడో వ్యక్తి 18 సంవత్సరాల యువకుడు పోలీస్ స్టేషన్‌లో లొంగిపోయాడు. వీరంతా ఐదు సంవత్సరాలుగా ఫ్రాన్స్ ప్రభుత్వం నిఘా నీడలో ఉంటున్నవారే. ముస్లిం వ్యతిరేకతను మూట గట్టుకున్న చార్లీ పత్రికపై దాడిని ఫ్రెంచి గూఢాచారవర్గం ముందుగా పసికట్టకపోవడం, నిందితులు ఫ్రెంచి పోలీసులకు సుపరిచితులు కావడం పలు అనుమానాలకి తావిస్తోంది. 2011లోను అల్లా వ్యంగ్య చిత్రాన్ని ప్రచురించినందుకు చార్లీ పత్రికపై పెట్రోలు బాంబు దాడి జరిగింది. విగ్రహారాధనను నమ్మని ముస్లింలు అల్లాను బొమ్మరూపంలో చిత్రీకరించడాన్ని ఎంత మాత్రం సహించరు.

పాలస్తీనా ఐరాస తీర్మానం మేరకు భౌగోళిక సరిహద్దులు ఏర్పర్చుకున్నా, ఆ దేశాన్ని అమెరికా ప్రోత్సాహంతో ఇజ్రాయిల్ ఆక్రమించుకుంది. పాలస్తీనా జాతీయ ఉద్యమాన్ని, ప్రపంచానికి ఉగ్రవాదంగా అమెరికా చూపిస్తోంది. ఆఫ్ఘనిస్థాన్‌లో సోవియట్ రష్యా ప్రభావంతో ఏర్పడ్డ ప్రభుత్వాన్ని కూల్చడానికి, తాలిబన్లను, ముజాహుద్దీన్‌లను, బిన్‌లాడెన్‌లను తయారు చేసింది. అప్పుడు దేశభక్తులుగా అమెరికా చేత కీర్తింపబడ్డ తాలిబన్లు ఈ రోజు ఉగ్రవాదులుగా మారిపోయారు. సిరియాలో తమని కాదన్న అసద్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి ఐఎస్ తీవ్రవాదాన్ని పెంచిపోషించింది. లిబియాలో గడాఫీ ప్రభుత్వాన్ని కూల్చడానికి ఉగ్రవాదుల గ్రూపులనే అమెరికా చేరదీసింది. ఈ రోజు ఇస్లాం మతం పేరుతో మారణకాండను సాగిస్తున్న ఉగ్రవాద గ్రూపుల్లో ఆధిపత్య గొడవలు పెద్దవయ్యాయి. అవి అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నామని చెప్పుకుంటూ మతిలేని హింసకు పాల్పడుతున్నాయి. అమెరికా సామ్రాజ్యవాద విధానాలను ప్రశ్నించి, దాని యుద్ధోన్మాదాన్ని అరికట్టకపోతే ప్యారిస్ ఘటనలు పునరావృతం అవుతాయని ఉగ్రవాదులు చెప్పదలుచుకున్నారు. అమెరికాకు మద్దతిచ్చే ఏ దేశంపైనైనా మేం దాడులు చేస్తామని, ఆ దేశాధినేతలను కట్టడి చేయాల్సిన బాధ్యత ఆ దేశ పౌరులదేనని, లేనిపక్షంలో ఆ దేశంతో పాటు ఆ దేశ ప్రజలు మాకు శత్రువులేనని అల్‌ఖైదా అనేకసార్లు హెచ్చరించింది. అమెరికాలోని 75 శాతం ప్రజలు తమదేశంలో దాడులు జరిగే అవకాశం ఉందని అభిప్రాయపడ్డట్టు మీడియా పేర్కొంది. ఈ నేపథ్యంలో మతం పేరుచెప్పి దాడులు చేస్తున్న వారి వైఖరిని ఖండిస్తూనే, అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం అన్ని దేశాలకు ఉంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*వీక్షణం జనవరి 2015 సంచికలో వచ్చిన లోకసంచారి గారి 'యువతను ఆకర్షించలేకపోతున్న ప్రజాసంఘాలు' వ్యాసంలో అందరికీ తెలిసిన, ఉన్న వాస్తవాలే చెప్పారు. కాని ఆ వాస్తవాలను అర్థం చేసుకోవడంలో, ఆ సమస్యలకు కారణాలు, పరిష్కారాలు చెప్పడంలో పొరపాటు పడ్డారనిపిస్తుంది. "ఒకవైపు దోపిడీ, అణచివేత, అన్యాయాలు, అక్రమాలు పెరుగుతూ ప్రజల జీవితాలు మరింత కష్టపూరితంగా, దుర్భరంగా తయారవుతున్న... భౌతిక పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పటికీ" ప్రజాసంఘాలు, మార్క్సిస్టు దృక్పథంతో పనిచేసే సంఘాలు ఎందుకు విస్తరించడం లేదు అని రచయిత చాల సరైన, అవసరమైన ప్రశ్న వేశారు. కాని అలా విస్తరించకపోవడానికి మన సమాజంలో ఉన్న అనేక కారణాలు వదిలేసి, ప్రజాసంఘాలలో, లేదా నాయకత్వాలలో మాత్రమే కారణాలు చూడడానికి ప్రయత్నించారు. వ్యవస్థ మీద భ్రమలు, ఆశలు, ప్రత్యామ్నాయ శక్తుల మీద నిరాశలు, అపనమ్మకాలు, కుల, మత, ప్రాంతీయ, భాషా విభజనలు, కర్మ సిద్ధాంతం, వ్యక్తిగత ప్రయోజనాలు, రాజ్య నిర్బంధం, నిజమైన, స్థిరమైన చైతన్యం కలిగించడంలో ప్రజాసంఘాల వైఫల్యం, చిన్న, వ్యక్తిగత సమస్యల దగ్గర ప్రారంభించి వ్యవస్థ మార్పు పోరాటం దాకా సుదీర్ఘమైన క్రమానికి అవసరమైన చైతన్యాన్ని మెట్టుమెట్టుగా ఎదిగించాలనే ఓపిక లేని మధ్యతరగతి తొందరపాటుతనం లాంటి తెలిసిన, తెలియని కారణాలు ఎన్నిటి వల్లనో ప్రజాసంఘాలు సమాజానికి అవసరం అయినంతగా ముందుకు పోవడం లేదు. అందువల్ల లోకసంచారి ఆబ్జెక్టివ్ టైప్ ప్రశ్న వేసి ఔనా కాదా అని సులభమైన, గీత గీసినట్టు, ప్రజాసంఘాల నాయకత్వపు తప్పా కాదా అంటే జవాబు చెప్పడం కుదరదు. ఆ చిక్కుముడి ప్రశ్నకు ఎన్నో జవాబులు అన్వేషించవలసి ఉంటుంది. అదంతా వదిలి ఫీడ్ బ్యాక్, బ్రెయిన్ స్టార్మింగ్, రి-ఇన్వెంటింగ్ ద వీల్, లెర్నింగ్ ఆర్గనైజేషన్ లాంటి పెట్టుబడిదారీ వ్యక్తివికాసం, సంస్థానిర్వహణ పాఠాల్లో (క్షమించాలి, రచయిత రాసిన మాటలు ఆ పుస్తకాల్లో ఉంటాయి గనుక ఈ మాట అంటున్నాను, రచయితకు అవి తెలుసునో లేదో నాకు తెలియదు) చెప్పే చిట్కా వైద్యాలు మార్క్సిస్టు ప్రజాసంఘాలకు చెప్పడానికి ప్రయత్నం చేశారు. ఇంతకూ ప్రజాసంఘాలు రచయిత పరిభాషలోని ఫీడ్ బ్యాక్ తీసుకోవడం లేదని నిర్ణయానికి ఆయన ఎలా వచ్చారో తెలియదు. ఈ ప్రజాసంఘాలు ప్రజలలో పనిచేస్తున్నప్పుడు, ఆ ప్రజలు ఎంత తక్కువ సంఖ్యలో ఉన్నా, వారిమధ్య భిన్నాభిప్రాయాలు ఉంటాయి గదా, ఒక జరిగిపోయిన పరిణామం మీద వాళ్లు ఆ అభిప్రాయాలు పంచుకుంటారు గదా, వారికి విమర్శ - ఆత్మవిమర్శ అనే పద్ధతి ఉంటుంది గదా, ఏ ప్రజల దగ్గర విఫలమయ్యారో ఆ ప్రజల దగ్గరికి మళ్లీ వెళ్లవలసిన అవసరం ఉంటుంది గదా, మరి ఈ క్రమమంతా ఎవరూ మాట్లాడకుండానే, ఎవరి మాటలూ వినకుండానే, అవసరమైన మార్పులు చేర్పులు జరగకుండానే సాగుతుందా? నాకు తెలిసిన అతి తక్కువ చరిత్రలోనే ప్రజాసంఘాలు ఎన్నోసార్లు తమ వైఖరులు, పద్ధతులు, అభిప్రాయాలు మార్చుకున్నట్టు తెలుసు. అదంతా "ఫీడ్ బ్యాక్" లేకుండానే జరుగుతుందా? ఇప్పటివరకూ వారు అమలు చేస్తున్న పద్ధతులు సరిపోవనో, సరిపోవడం లేదనో అనడానికి ఎవరికైనా హక్కు ఉంది. తప్పకుండా ప్రజాసంఘాల పనిపద్ధతులలో మార్పులు రావలసి ఉంది. కాని ప్రజాసంఘాలకు అసలు ఆ విషయాలే తెలియనట్టు, వారు ముందుకు పోకపోవడానికి అదే కారణమైనట్టు మాట్లాడడం సరికాదు. ఇక చివరికి "ప్రజల ఆదరణ దొరకక, కాలక్రమంలో సంస్థ బలహీనమైపోవడం, కనుమరుగైపోవడం జరిగిన సంఘటనలు ప్రపంచ వ్యాప్తంగా ఉన్నాయి. దానికి కారణం ఆ సంస్థ నాయకత్వ లోపం" అని భౌతిక పరిస్థితులు, సమాజపు స్థితి, సాంస్కృతిక స్థాయి, శ్రేణుల చైతన్యం, సంస్థ వనరులు, జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు, ప్రత్యర్థి వర్గాల బలాబలాలు లాంటి ఎన్నో అంశాలను పక్కన పెట్టి, నాయకత్వమే ఏకైక కారణమన్నట్టు పూర్తి బాధ్యతను నాయకత్వం మీదికి నెట్టివేశారు. నాయకత్వపు లోపాలకు తప్పనిసరిగా నాయకత్వాన్ని విమర్శించవలసిందే. కాని, చేయని తప్పులకు, సంబంధం లేని తప్పులకు, శక్తికి మించిన కారణాలకు ఎవరినీ తప్పు పట్టగూడదు. మొత్తం మీద వ్యాసాన్ని పరిశీలించినప్పుడు, వ్యాసంలో లోపించినది గతితార్కిక దృష్టి అనిపిస్తుంది. సమస్యను చారిత్రక నేపథ్యంలో పరిశీలించకపోవడం, సమస్యకు ఉన్న అన్ని కోణాలనూ పరిశీలించకపోవడం, సమస్య అంతర్గత వైరుధ్యాలను గుర్తించి దాని చలనం ఎటువైపు ఉన్నదో అంచనా కట్టలేకపోవడం గతితార్కిక దృష్టి లేకపోవడానికి చిహ్నాలు. ఇవాళ్టి సమాజంలో ప్రజాసంఘాల విస్తరణకు ఆటంకాలున్నాయనే సమస్యలను సరిగానే గుర్తించినా, కారణాలు, పరిష్కారాలు సరిగా చూడలేక పోవడానికి గతితార్కిక దృష్టి లోపం ఎలా కారణమవుతుందో ఈ వ్యాసం మంచి ఉదాహరణ.*

**-ఎస్ జనార్దన్,** సిద్ధిపేట

*జనవరి 2015 ప్రత్యేక సంచిక బాగుంది. ఇటువంటి విశ్లేషణాత్మక వ్యాసాలనే కొనసాగించాలని పత్రికవారిని కోరుతున్నాను. ప్రతిరోజూ దినపత్రికల్లో వచ్చే వ్యాసాలు కాకుండా పాఠకులకు వివరణాత్మక, విశ్లేషణలతో కూడిన వ్యాసాలు పత్రికలో వేయండి. గత రెండు మూడు నెలలుగా టంకశాల అశోక్ వ్యాసాలు వస్తున్నాయి. కొన్నేళ్ల క్రితం రాజకీయార్థిక, సామాజిక పుస్తకాల్లో ఆయన వ్యాసాలు వచ్చేవి. వాటిని మళ్లీ ముద్రించగలిగితే బాగుంటుంది.*

**- తాడేపల్లి శివరామకృష్ణ**
వీక్షణం మెయిల్

వీ

# హిజ్రా సమస్య

***హిజ్రా సమస్యకు ఉన్న వ్యక్తిగత మానసిక, శారీరక, సామాజిక కోణాలను చర్చిస్తూ పరిష్కారాలు సూచిస్తున్నారు***

**రంగనాయకమ్మ**

'నేను హిజ్రాని' అని చెప్పుకునే రేవతి రాసిన 'ఒక హిజ్రా ఆత్మ కథ' పుస్తకం చదవక ముందు నాకు హిజ్రాల గురించి ఎక్కువ విషయాలు తెలియవు. 'కొజ్జా' అనే మాట చిన్నప్పుడు విని ఉన్నదే. అయినా, అదీ, ఇదీ ఒక్కటే అయినట్టు ఇప్పటికీ అనిపించడం లేదు. రేవతి పుస్తకం చదివిన తర్వాత కొన్ని కొత్త విషయాలు తెలిశాయి గానీ, అసలు తెలియవలిసిన విషయాలు అందులో ఏవీ దొరకలేదు.

మొగపిల్ల వాడిగా పుట్టి పెరుగుతోన్న వాడికి, కొంత ఊహ వచ్చిన తర్వాత, ఆడ పిల్లగా ఉండాలనే కోరిక ఎందుకు పుడుతుంది? దానికి కారణం, ఆ శరీరంలోనే ఏదైనా ఉందా? శరీరాల్లో, స్త్రీ హార్మోన్లు, పురుష హార్మోన్లు అంటారు. ఆ హార్మోన్లలో ఏదైనా అసహజంగా జరగడం వల్ల, మొగపిల్ల వాడికి ఆడపిల్లగా ఉండాలని అనిపిస్తుందా? ఈ విషయం తెలుస్తుందనే ఆ పుస్తకం చాలా జాగ్రత్తగా చూశాను. కానీ, ఆ పుస్తకంలో ఆ విషయం ఎక్కడా లేదు. అది 'శరీరాల సైన్సు' విషయం అయితే, ఆ పుస్తకం రాసిన రేవతికి ఆ విషయం తెలిసే అవకాశం ఉండదు. రేవతి తన అనుభవాలే తను చెప్పింది.

'రేవతి' పేరుతో, పెద్ద వయసులో ఆ పుస్తకం రాసిన మనిషి, పద్నాలుగేళ్ల వయస్సు దాకా దొరై స్వామి పేరుతో ఉన్న మొగపిల్ల వాడే. ఆ తర్వాత 'ఆడపిల్ల'గా మారిపోయాడని కాదు. 'మారిపోయాన' ని దొరై స్వామి అనుకున్నాడు. దొరై స్వామి, చిన్నతనం నుంచీ ఇంటా బయటా కనపడుతోన్న ఆడవాళ్లనే కాదు, మొగవాళ్లని కూడా చూస్తూనే పెరిగాడు. అతనికి, తను మొగ వాడినని తెలుసు. అయినా, అది చిన్న వయసు. ఆ పిల్లవాడికి, ఆడపిల్లల లాగే బొట్లూ కాటుకలూ దుద్దులూ గాజులూ పువ్వులూ అన్నీ పెట్టుకోవాలనీ, వాలు జడలు వేసుకోవాలనీ, పరికిణీలు కట్టుకోవాలనీ, అన్నీ ఆడవాళ్ల ముస్తాబుల మీద కోరికలే. వంటల గిన్నెలు తోమాలన్నా, వాకిళ్లు ఊడ్చాలన్నా, ముగ్గులు పెట్టాలన్నా – ఆ రకంగా ఆడవాళ్లు చేసే పనులు చేయడం అంటే దొరై స్వామికి ఒకటే ఉత్సాహం. సహజంగా ఆడపిల్లలుగా పుట్టిన వాళ్లకి ఆ పనుల మీద ఉత్సాహం ఉంటుందా? వాళ్లు ఎప్పుడూ ఇంటి పనులన్నీ ఎగ్గొడుతూ తల్లుల్ని విసిగిస్తూ ఉంటారు. అసలు, ఆ పనులన్నీ ఆడవాళ్లు చేయాలని ఆడ శరీరంలో కోరిక ఉంటుందా? ధనవంతుల ఇళ్లల్లో ఆడపిల్లలు ఒక్క ఇంటి పని అయినా చేస్తారా?

దొరై స్వామికి పద్నాలుగేళ్ల వయసు వచ్చే నాటికి, ఆడపిల్లగా ఉండాలనే ఉత్సాహం, అతన్ని ఎంతదూరం తీసుకుపోయిందంటే, తన పురుషాంగాన్ని మొత్తాన్ని డాక్టర్ చేత కత్తిరింపించేసుకుని, దాన్ని మట్టిలో కప్పించేసే వరకూ తీసుకుపోయింది! అప్పటికి తన పేరు మార్చుకుని, తను రేవతిగా మారి పోయానని ఆనందంలో మునిగి పోయాడు.

దొరై స్వామి పెరిగిన కుటుంబం, సిరి సంపదలు కలది కాకపోయినా, తిండికీ బట్టకీ మరీ అంతగా లోటు లేనిదే. అతని తల్లి దండ్రులు, పిల్లలంటే బాధ్యతగల వాళ్లే. ఆ బాధ్యతతో వాళ్లు, ఉత్సాహంగా ముగ్గులు పెట్టే పిల్లవాడి ప్రవర్తనకి విసిగి అతన్ని, 'ఆడంగి వెధవా' అని తిట్టీ కొట్టీ చక్కదిద్దాలని ప్రయత్నించారే గానీ, 'ఈ పిల్లవాణ్ణి ఏ డాక్టరుకైనా చూపించాలేమో' అని ఆలోచించలేక పోయారు. ఆ ఊరు, ఏ డాక్టర్లూ లేని పల్లెటూరు. ఎంత పెద్ద పట్టణాల్లో మనుషులైనా, రోగాలు రాగానే దేవుళ్లని తలుస్తారేగానీ, డాక్టర్ల కోసం మొదట ఆలోచించరు. డాక్టర్లు దొరకరు కాబట్టీ, దొరికినా వైద్యాన్ని కొనలేరు కాబట్టీ, డాక్టర్ల కోసం ఆలోచన ఉండదు. దేవుళ్లు మాత్రం దొరుకుతారా? దేవుళ్లు ఎక్కడా దొరక్కపోయినా, మొక్కులు మొక్కేస్తే సరిపోతుంది కాబట్టి, మొదట ఆ ఆలోచనే ఉంటుంది. దొరై స్వామి తండ్రీ అన్నలూ రోజంతా పొలం పనుల్లోనూ, లారీల పనుల్లోనూ మునిగి ఉండి, తమ 'ఆడంగి' కుర్రాడు, ఎక్క డెక్కడ తిరుగుతున్నాడో చూసుకునే స్థితిలో ఉండేవారు కాదు. ఈ కుర్రాడు ఆ ఊరు చుట్టు పక్కల కొండల మీద తిరిగే 'ఆడంగి మొగ వాళ్లని' పట్టుకోగలిగాడు. ఆ కొండ మీద తిరిగేటప్పుడే, ఒక 'ఆడ మొగ' వాణ్ణి, ఒక రౌడీ వాడు లాక్కుపోయి మలద్వారం దగ్గిర ఏదో చేశాడని, అదంతా ఆ బాధితుడు వచ్చి ఏడుస్తూ చెప్పు కున్నాడు. ఆ సంగతులు దొరై స్వామికి ఆ వయసులోనే తెలుసు. ఆ కొండ మీద వాళ్ల మాటలతో దొరై స్వామి, పద్నాలుగేళ్లప్పుడే ఒక హిజ్రా గురువు దగ్గరికి చేరాడు.

ఆ గురువు, చిన్నప్పుడు మొగపిల్ల వాడిగానే పుట్టి, పెద్ద వాడయ్యాక తన అంగాన్ని కోయించేసుకుని, చెవులూ ముక్కులూ కుట్టించుకుని వాటికి కొన్ని నగలు పెట్టుకుని, జుట్టు పెంచి వాలు జడ వేసుకుని, పూలు పెట్టుకుని, చీర కట్టుకుని, తన లాగే మారబోయే కుర్రాళ్లకు 'గురువు'గా మారినవాడు. ఆ గురువు దగ్గరికి వెళ్లేటప్పటికి మన కుర్రవాడికి, తన అంగాన్ని తీసి పారేసే ఆపరేషన్ ఇంకా జరగలేదు.

ఆ మొదటి గురువు, దొరై స్వామికి మంచి సలహాయే ఇచ్చింది. 'నీకు హిజ్రాగా బతకవలిసిన అవసరం లేదు. నీది మంచి కుటుంబం. చక్కగా చదువుకో, ఉద్యోగం చేసుకో' అని చెప్పింది. (ఆ గురువు అలా ఎందుకు చెప్పింది? 'మొగ పిల్లవాడికి, ఆడగా మారాలనే కోరికని ఆపుకుంటే అదే ఆగిపోతుంది; చదువు మీదే మనసు పెట్టాలి' అని ఆ గురువుకి పెద్ద వయసులో అర్థమై అలా చెప్పిందా? – ఈ వివరణ రేవతి పుస్తకంలో లేదు, మనమే అర్థం చేసుకోవాలి.) కానీ గురువు చెప్పిన ఆ మాటలు మన దొరై స్వామికి నచ్చలేదు. ఈ కుర్రాడికి చీరలు కట్టుకోవాలనే సరదా వదలలేదు. (కానీ, ఈ దొరై స్వామి కూడా తన పెద్ద వయసులో, రేవతిగా ఉన్నప్పుడు, తన దగ్గరికి శిష్యులుగా వచ్చిన ఇద్దరు కుర్రవాళ్లకి, 'మీకెందుకీ జీవితం? చదువుకోండి, ఉద్యోగాలు చేసుకోండి' అనిచెప్పాడు! అలా చెప్పాడంటే కారణం ఏమిటి? అతని తప్పు అతనికి తెలిసినట్టు కాదా?)

మొదటి గురువు మాటలు తన చిన్నతనంలో నచ్చని దొరై స్వామి, ఇంటి నుంచి ఢిల్లీకి పారిపోయి ఇంకో హిజ్రా గురువు వెంటపడ్డాడు.

ఆ గురువు చెప్పినట్టు చెవులూ ముక్కులూ కుట్టించుకుని, ఆ కన్నాల్లో ఏవో ప్లాస్టిక్ నగలు పెట్టుకుని, జుట్టు పెంచి జడలల్లుకుని, బొట్లూ కాటుకలూ పువ్వులూ సింగారించుకుంటూ, చీరలు కట్టుకుంటూ, 'నిర్వాణం' పేరుతో గురువు చెప్పిన పూజలు చేసిన తర్వాత ఆపరేషన్ చేయించుకుని, కొన్నాళ్లకి ఇంటి కొచ్చి వాలు జడతో, చీరకట్టుతో, తల్లి ముందు నిలబడ్డాడు! భోరున ఏడ్చింది తల్లి. దొరైస్వామి అటువంటి చేష్టలతో అప్పుడప్పుడూ ఢిల్లీ, బొంబాయి, బెంగుళూర్లకు పారిపోతూ ఉన్నాడు; అక్కడ విసుగెత్తినప్పుడు ఇంటికొచ్చి ఇంట్లో కొంతకాలం గడుపుతూనూ ఉన్నాడు (ఉన్నాడు కాదు, ఉంది).

ఆ దొరైస్వామి, తను రేవతిగా మారిపోయాననీ, వ్యభిచారం వృత్తి చేసుకుంటున్నాననీ, తన పుస్తకం నిండా చెప్పుకున్నాడు. ఆ పుస్తకంలో చివరికి కూడా ఆ రేవతి ఆ వృత్తిలోనే ఉంది!

హిజ్రాల జీవిత విధానం ఏమిటంటే, ఒక ఆడ బట్టల గురువుకి కొందరు మగ శిష్యురాళ్లు ఉంటారు. అది, వాళ్ల కుటుంబం. ఆ గురువే, తల్లి. ఆ శిష్యురాళ్లందరూ అక్కచెల్లెళ్లు. ఆ శిష్యురాళ్లు, ఆ తల్లికి కూతుళ్లు కూడా. అక్కడ కూతుళ్లే గానీ కొడుకులు ఉండరు. ఆ కూతుళ్లు ఆ తల్లికి పాద వందనాలు చేస్తూ, దేవుళ్ల పూజలు చేస్తూ, 'మాతా, శివుడూ' స్తోత్రాలతో, బోలెడు సంప్రదాయాలు పాటిస్తూ ఉంటారు. ఆ జనం అంతా, ఆపరేషన్లు చేయించుకుని పురుషాంగాల్ని తీసి పారేసిన వాళ్లూ, ఇంకా అది జరగని వాళ్లూ కూడా. వాళ్లందరూ, జడలు అల్లుకుని, చీరలు కట్టుకుని, తిరిగే వాళ్లే. చారెడు చోటు దొరికిన చోట్ల చిన్న చిన్న గుడిసెల్లో ఉంటారు. రైల్వేలైన్ల పక్క, నాలుగు తడికెల కింద. ఆ గుడిసెల్లోనే ఒక తడికె అవతల సెక్సుదందా నడుస్తూ ఉంటుంది. తాగుబోతులూ, రౌడీలూ, బిచ్చగాళ్లూ, రేవతి లాంటి మొగ ఆడ వాళ్లకి కస్టమర్లు! రేవతిగా మారిన వాళ్ల బతుకుదెరువులు, చీకటిగా దొరికే పబ్లిక్ స్థలాల్లో వ్యభిచారమూ, పగళ్లు షాపుల మీద గుంపుగా పడి దౌర్జన్యంగా అడుక్కోవడమూ, మామూలు కుటుంబాల వాళ్లు కొన్ని ఫంక్షన్లలో పిలిస్తే, వాళ్లు పిలువక పోయినా వీళ్లే అక్కడ చేరి అక్కడ పాటలూ డాన్సులూ గంతులూ చేయడమూ – ఈ రకం చేష్టలే. రైళ్లల్లో అడుక్కుంటే ఎక్కువ డబ్బులు వస్తాయట. ఈ మార్గాల్లో డబ్బు సంపాదించి, అందులో కొంతని గురువుకి ఇవ్వాలి. కొంతని తమ అవసరాలకు వాడుకుంటారు. ఈ రకంగా వీరికి వృద్ధాప్యాల దాకా జీవితాలు ఎలా సాగుతున్నాయో రేవతి పుస్తకంలో లేదు. హిజ్రా వ్యభిచారం ఎలాసాధ్యమో, ఆ సంగతులేవీ సరిగా ఆ పుస్తకంలో లేవు.

హిజ్రా సమస్య మీద నెట్ నుంచి కొన్ని వ్యాసాలు తీసి చూస్తే కూడా వాటిలో అన్నీ పైపై సానుభూతి మాటలే గానీ, ఎక్కడా సరైన సమాచారం లేదు. ఒకే ఒక్క చోట, ఒకే ఒక్క ముక్క కనపడింది. మగ వాడికి ఆ ఆపరేషన్ చేసేటప్పుడే, తర్వాత చేయబోయే వృత్తికి తగిన మార్పు ఏదో (సెక్సువల్ రీ ఎసైన్‌మెంట్ సర్జరీ) చేస్తారు – అని! ఈ ఆపరేషన్లు ఈ దేశంలో (ఇండియాలో) గవర్నమెంటు ఆస్పత్రుల్లో చేయరు. ప్రైవేటు డాక్టర్లే చేస్తారు. హిజ్రాలుగా ఉన్న పెద్ద వాళ్లు కూడా కొత్త కుర్రవాళ్లకి ఆ ఆపరేషన్లు చేస్తారు. ఆ ఆపరేషన్ తర్వాత రక్తం కారిపోతూ ఉంటే, 'అది మగ రక్తం. పోవాలి, పోవాలి, అదంతా పోవాలి' అని రక్తాన్నంతా ఆనందంగా పోనిస్తారట! (ఇది రేవతి పుస్తకంలో సంగతి కాదు. వేరే వ్యాసాల్లో సంగతి. ఆ ఆపరేషను, డాక్టర్ ద్వారా జరిగితే, రక్తాన్ని అలా పోనివ్వడం చేయరు.)

ఆ రేవతి పుస్తకం ముగించగానే నేను ఈ ఊళ్లోనే ఉన్న ఒక పెద్ద వయసు లేడీ డాక్టర్‌తో మాట్లాడాను. ఆవిడ చాలా కాలం ప్రాక్టీస్ చేసిన డాక్టరే. కానీ ఆవిడ, తనకు హిజ్రాల శరీరాల విషయాలేవీ తెలియవనీ, అటువంటి పేషెంట్లకు తను ఎప్పుడూ ఆపరేషన్లు చేయలేదనీ, చెప్పారు. అయినా, నా ప్రశ్న నేను అడిగాను మళ్లీ. 'మొగ శరీరంలో స్త్రీ మర్మాంగాన్ని ఏర్పరచడం సాధ్యమా?' అని.

ఆవిడ, 'ఏముంది అందులో? ఒక 'దారి' ఏర్పరచడమేగా? చేతిలో కత్తి ఉన్న వాళ్లకి అదేం అసాధ్యం?' అన్నారు. ఆ విషయాల మీద ఇంకా తెలుసుకోవలిసినవి ఉన్నా, ఆవిడ అంత కన్నా చెప్పలేకపోయారు.

అమెరికాలో ఉన్న ఎం.ఇందిర నాకు బాగా తెలిసిన డాక్టరు. (అమెరికా అంటే నాకు చాలా అయిష్టం. అక్కడికి ఒక సారి రమ్మని ఎన్ని ఆహ్వానాలు వచ్చినా నేను ఎప్పుడూ ఒప్పుకోలేదు. మొత్తం బూర్జువా ప్రపంచం అంతా అసహ్యమే. అయినా ఈ బూర్జువా ప్రపంచంలోనే బతుకుతున్నాం. నేను అమెరికా డాక్టర్లతో మాట్లాడింది, డాక్టర్లు ఇండియాలో లేరని కాదు. అమెరికా మీద మోజుతో కాదు. ఇందిర నాకు బాగా తెలుసు కాబట్టి, ఎక్కువ శ్రద్ధగా, ఎక్కువ టైము పెట్టి మాట్లాడతారని నమ్మకంతో మొదట ఆవిడితోనే మాట్లాడాను.) నేను వరసగా నాలుగైదు రోజులు అడిగినా, ఇందిర చాలా శ్రద్ధగా చెప్పి, వారు ఇవ్వగలిగే సమాచారం ఇచ్చారు.

నేను, 'మొగ శరీరంలో, కత్తితో కోతల ద్వారా కొన్ని మార్పులు చేసినా, ఆ కోతలు జరగడం వల్లే ఆ మొగ శరీరంలో ఆడ అనుభూతులు కలుగుతాయా? ఆ మొగవాడు, తనలో ఆడతనమే ఉన్నట్టు మొదటి నుంచీ భావిస్తున్నాడు కాబట్టి, ఆ రకంగా ఆడ మనిషిగా మారిపోతాడా?' అని అడిగాను.

ఆ డాక్టరు, 'దానికి తగ్గ వైద్యం జరిగితే, ఆడ లక్షణాలు డెవలప్ కావచ్చు' అన్నారు.

'మొగ వాడికి ఆ ఆపరేషన్ జరిగిన తర్వాత, గడ్డాలూ మీసాలూ పెరగడం ఆగిపోతుందా? మొగ కంఠ స్వరం ఆడ స్వరంగా మారుతుందా?' అని అడిగితే, వాటికి కూడా వైద్యాలు ఉన్నాయనీ, అవి ఏ మనిషి మీద ఎంత వరకూ పనిచేస్తాయో చెప్పలేమనీ, అన్నారు.

ఆడతనాన్ని వైద్యాల ద్వారా తెచ్చుకోవాలంటే, ఇక ఆ మొగవాడిలో అంతకు ముందే ఉన్న ఆడతనం ఏమిటి? – అని నా సందేహం. హిజ్రాలుగా తిరిగే వాళ్లందరూ ఆ వైద్యాలు చేయించుకుంటారా?

నాకు తెలిసిన పరిచయస్తుల్నీ, స్నేహితుల్నీ కూడా 'హిజ్రాల గురించి మీకేమైనా తెలుసా?' అని అడిగాను. వాళ్లు, ఎవరికి తెలిసిన విషయాలు వాళ్లు చెప్పారు. హిజ్రాలందరూ పేద కుటుంబాల వాళ్లనీ, వాళ్లు ఆడబట్టలతో ఉన్నా, గడ్డాలు పెరుగుతూనే ఉంటాయనీ, గడ్డాలకు షేవ్ చేసుకుంటూ ఉంటారనీ, రోడ్ల మీద తరుచుగా హిజ్రాల్ని చూసే కొందరు అన్నారు. రేవతి, తన గడ్డాల సంగతి రాయలేదు. కానీ, తన కంఠ స్వరం, మొగ స్వరంగానే ఉండి పోయిందనీ, మారలేదనీ, రాసింది. రేవతి, తన పుస్తకంలో, తనని అనేక మంది ఆడవాళ్లు ఒక ప్రశ్న అడిగే వారని రాసింది. 'నువ్వు ఆడ దాన్ని అయ్యానంటున్నావు. నీకు రొమ్ములు పెరిగాయా?' అని అడిగేవారట. ఆడవాళ్లే కాదు, మొగవాళ్లు కూడా కొందరు అదే అడిగేవారట. రేవతి, తను రొమ్ముల కోసం చాలా టాబ్లెట్లు వాడాననీ, చాలాకాలం వరకూ ఏమీ జరగలేదనీ, కొంతకాలానికి కొంత జరిగిందనీ, రాసింది. హిజ్రాలు దూది ఉండల, స్పాంజీల బాడీలు కట్టుకోవడమే చేస్తారని ఒక చోట చదివాను (రేవతి పుస్తకంలో కాదు. ఇతర హిజ్రాల రొమ్ముల సంగతి రేవతి పుస్తకంలో లేదు.) పిల్లల్ని కని, పాలివ్వాల్సిన అవసరమే లేని హిజ్రా శరీరాలకు రొమ్ముల కోసం వైద్యాలు ఎందుకు? కేవలం వ్యభిచార వృత్తి కోసమా?

*(ఇంకా ఉంది)*

*(రచయిత బహు గ్రంథకర్త, మార్క్స్ 'పెట్టుబడి' పరిచయకర్త)* వీ

# అవసరమైన సమాచారం - పొసగని నిర్ధారణలు

-ఎన్. వేణుగోపాల్



**పల్లెను మింగిన పెట్టుబడి** – గ్రామీణ ఆర్థికం – ఒక పరిశీలన – ఎస్.ఎ. విద్యాసాగర్ – పీకాక్ బుక్స్ – 414 పేజీలు, 1/8 డెమీ, పేపర్ బ్యాక్ రు. 250, హార్డ్‌బౌండ్ రు. 425, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్

**ఎస్.** ఎ విద్యాసాగర్ రచించిన 'పల్లెను మింగిన పెట్టుబడి – గ్రామీణ ఆర్థికం – ఒక పరిశీలన' వెలువడి దాదాపు రెండు సంవత్సరాలు కావస్తున్నది. తెలుగు మేధోప్రపంచంలో ఒక ముఖ్యమైన పుస్తకంగా దానిమీద విరివిగా చర్చలు జరగవలసి ఉండింది గాని ఏ కారణం వల్లనో జరగవలసినంత చర్చ జరగలేదు. కొంత ప్రశంస వచ్చినట్టున్నది గాని వివరమైన గుణదోషాల చర్చ జరిగినట్టులేదు. ఈ పుస్తకం జరిపినటువంటి పరిశోధన 'నభూతో నభవిష్యతి' అని, 'పాత నమ్మకాలను తుడిచిపెట్టేసిన పుస్తకం' అని, 'విశ్వవిద్యాలయాల పరిశోధకులకు కూడ మార్గదర్శకం కాగలిగిన పరిశోధన' అని సభలలో, సమీక్షలలో కొన్ని అతిశయోక్తులు వచ్చాయి. పుస్తకం తప్పుడు దృక్పథం తీసుకున్నదని, అందువల్ల దాన్ని పట్టించుకోనక్కరలేదని లిఖితంగా కాకపోయినా, మౌఖికంగా విమర్శలూ వచ్చాయి. అలా ఒక చివర అతిశయోక్తులకు, మరొక చివర తిరస్కరణకు వెళ్లకుండా, విస్తారమైన పరిశోధనతో, సుదీర్ఘకాలం శ్రమించి రాసిన ఈ పుస్తకం మీద వాస్తవికమైన గుణదోష విచారణ చేయవలసి ఉంది.

ప్రచురణకర్తల మాటల్లో చెప్పాలంటే, 'ఈ పుస్తకం ఐదు సంవత్సరాల కఠోర పరిశ్రమ ఫలితం. గ్రామసీమల్లో ఏమి జరుగుతోంది, గ్రామాల చలనం ఏ దిశగా ఉంది, పాలకుల విధానాలు ప్రజల జీవితాలను ఎలా ప్రభావితం చేస్తున్నాయి అనే అంశాలపై రచయిత విద్యాసాగర్ చేసిన పరిశోధనే ఈ గ్రంథం. శ్రీకాకుళం జిల్లా గ్రామాల సూక్ష్మ పరిశీలన ఇక్కడ మనకు క్షుణ్ణంగా కనపడుతుంది. దేశంలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోనూ ఉన్న గ్రామసీమల స్థూల చిత్రణ కూడా మనకు లభిస్తుంది. పరిశోధన అభిమాన దురభిమానాలకు దూరంగా జరిగింది. విషయాలను అధ్యయనం చేయడంలో రచయిత అనుసరించిన పద్ధతి సాధ్యమైనంత శాస్త్రీయంగానూ సమగ్రంగానూ ఉందని చెప్పవచ్చు. పరిశోధనా గ్రంథాలకు ఈ పుస్తకం ఒక నమూనాగా నిలుస్తుందని కూడ ఆశించవచ్చు.

రెండు భాగాలుగా ఉన్న ఈ పుస్తకంలో మొదటి భాగంలో గ్రామాలు, భూమి, వ్యవసాయం, పంటలు, మానవ వనరులు, పశుసంపద – యాంత్రీకరణ, నీటి పారుదల, విత్తనాలు, ఎరువులు – పురుగు మందులు, రుణపాశం, మార్కెట్, కులవృత్తులు అనే పన్నెండు అధ్యాయాలు, రెండో భాగంలో అడవులు – ఆదివాసులు, దళితులు, సముద్రము – మత్స్యకారులు, చేనేత కార్మికులు అనే నాలుగు అధ్యాయాలు ఉన్నాయి. మొత్తం మీద 77 పట్టికలలో సమాచారం ఉంది. ఇవికాక రచయిత మాట, సంపాదకుని మాట, రచయిత సర్వే చేసిన గ్రామాల జాబితా, ఉపయుక్త గ్రంథసూచి కూడ ఉన్నాయి. గ్రామాలలో జరుగుతున్న మార్పులను క్షేత్రస్థాయిలో, సూక్ష్మస్థాయిలో పరిశీలించి, తన పరిశోధనా ఫలితానికి ఈ పుస్తకరూపం ఇచ్చానని రచయిత చెప్పుకున్నారు.

ఏ పరిశీలనకైనా ఒక ముందస్తు దృక్పథం, కనీసం ప్రాతిపదిక అవగాహన ఉంటుంది. పరిశీలనాంశాన్ని ఆ దృక్పథం నుంచే అధ్యయనం చేయడం జరుగుతుంది. అధ్యయన క్రమంలో ఆ దృక్పథాన్ని, అవగాహనను బలపరిచే అంశాలూ కనబడవచ్చు, తిరస్కరించే అంశాలూ కనబడవచ్చు. పరిశోధన ముగిసే సమయానికి ప్రాతిపదిక అవగాహన చాల మారవలసి రావచ్చు. అయితే చాల సందర్భాలలో పరిశోధకులు తమ దృక్పథానికి సరిపడని అంశాలను ప్రస్తావించకుండా పక్కన పెట్టడమో, లేదా వాటిని ప్రస్తావించినా, తమ దృక్పథానికి తగినట్టుగా అన్వయించి, నిర్ధారణలు తీయడమో జరుగుతుంది. బహుశా ఇది ఒక సహజమైన అధ్యయన పద్ధతి. ఇటువంటి స్వీయమానసిక దృక్పథం ఉండగూడదని, పరిశీలనాంశాన్ని నిరపేక్షంగా, నిర్మమమకారంగా చూడాలని, పరిశీలకులకు వస్తుగత తటస్థత (ఆబ్జెక్టివ్ న్యూట్రాలిటీ) ఉండాలని, తమ ప్రాతిపదికను తిరస్కరించే వాస్తవికతను కూడ పరిగణనలోకి తీసుకోవాలని సామాజిక శాస్త్రాలు ఒక సంవిధానాన్ని తయారుచేశాయి. కాని పరిశీలకులూ మనుషులే, పరిశీలనాంశాలూ మనుషులే అయినప్పుడు, పరిశీలకులూ పరిశీలనాంశమూ కూడ చలనశీలంగా ఉన్నప్పుడు ఆ తటస్థత సంపూర్ణంగా సాధ్యం కాదు. పరిశీలకుల దృక్పథం నుంచే పరిశీలనాంశాలు కనబడడానికి అవకాశం ఉంటుంది. ఇది ఒక సంవిధానపరమైన సమస్య. దాన్ని అధిగమించడానికి కొన్ని జాగ్రత్తలను సామాజిక శాస్త్రాలు తయారు చేసుకున్నప్పటికీ, ఆ సమస్య పూర్తిగా పరిష్కారం అయిందని, అవుతుందని చెప్పలేం. కనుక ఈ పుస్తకాన్ని, ఆ మాటకొస్తే ఇటువంటి ఏ పుస్తకాన్నయినా, చదవడానికి ముందు రచయిత దృక్పథం పరిశీలనాంశం మీద, పరిశోధనలో ప్రస్తావనకు వస్తున్న వాస్తవికత మీద ప్రభావం వేయగల అవకాశం ఉందని గుర్తించడం అవసరం.

'అవసరాల కోసం ఒదిగి వుండిన శ్రామిక వర్గానికి తన అవసరాలను మరికాస్త మెరుగుగా తీర్చే మరో ఉత్పత్తి విధానం ఒకటి అందుబాటులోకి వచ్చింది. అందుకే ఆ వర్గం ఆ విధానం వైపు ప్రయాణిస్తోందని గమనించాను... గ్రామీణ ఉత్పత్తి విధానంలో వచ్చిన కొత్తమార్పులు పాతకాలపు ఉత్పత్తి విధానానికి అనుబంధంగా సాగిన అనేక అంశాలను తెరమరుగు చేశాయి. ఒక్కోసారి ధ్వంసం చేశాయి. ఇది నా అంచనా. అయితే ఈ ధ్వంసం గ్రామాల్లో వివిధ విభాగాల ప్రజలను ఎలా ప్రభావితం చేసిందనేది కీలకమైన అంశం. దీన్ని తెలుసుకోవడానికే

నా ఈ గ్రామాల సర్వే దోహదపడిందని అనుకుంటాను' (పే.8) అనేది రచయిత అవగాహన. శ్రామిక వర్గానికి 'మరికాస్త మెరుగుగా' అవసరాలను తీర్చే ఉత్పత్తి విధానం అందుబాటులోకి వచ్చిందనే నిర్ధారణ సరైనదేనా అని చర్చించవచ్చు గాని దానికన్న ముఖ్యమైనది గ్రామాల్లో ఒక పాత ఉత్పత్తి విధానం అదృశ్యం అయిందనీ, ధ్వంసం అయిందనీ, ఆ స్థానంలో మరో కొత్త ఉత్పత్తి విధానం వచ్చిందనీ (పే.8), 'ఏ దేశంలోనైనా ఫ్యూడల్ వ్యవస్థను ధ్వంసం చేసేది పెట్టుబడే. ఆ పని భారతదేశంలో దాదాపుగా పూర్తయింది...' (పే.249) అనీ రచయిత నమ్ముతున్నారు. అందువల్ల ఆ మార్పు జరిగిందా లేదా, మార్పుగా కనబడేది రూపంలో మార్పా, సారంలో మార్పా, అసలు మార్పేనా, దాన్ని మరొక రకంగా చూడవచ్చునా అనే తటస్థ పరిశీలన కోసం కాక పాత ఉత్పత్తి విధానం స్థానంలో కొత్త ఉత్పత్తి విధానం ఎలా వచ్చిందో తెలుసుకోవడానికే తన గ్రామాల సర్వే దోహదపడిందని రచయితే చెపుతున్నారు.

ఈ దృక్పథానికే ప్రాతినిధ్యం వహిస్తున్న పుస్తక సంపాదకులు 'ఇవ్వాళ భారతదేశం ఏమాత్రం ఫ్యూడల్ దేశమూ కాదు. అర్ధఫ్యూడల్ దేశమూ కాదు. ఇప్పుడది పెట్టుబడిదారీ దేశం. అయితే, పెట్టుబడిదారీ అభివృద్ధి వల్ల వచ్చే సమస్యలతో పాటు, అది తగినంత అభివృద్ధి చెందకపోవడం వల్ల వచ్చే సమస్యలు కూడా మనల్ని చాలాకాలం పాటు పీడించడానికి సిద్ధంగా ఉన్నాయి' (పే.15) అని రాశారు. 'పెట్టుబడిదారీ తగినంత అభివృద్ధి చెందకపోవడం' అనే వాస్తవాన్ని గుర్తిస్తున్నప్పుడు, 'తగినంత' అంటే ఎంతో సూచించకపోయినా, అదే ఊపులో దేశాన్ని 'పెట్టుబడిదారీ దేశం' అని నొక్కిచెప్పడం అతిశయోక్తి అవుతుందని గుర్తించవలసి ఉంది.

సంవిధాన సమస్యలను, ముందస్తు దృక్పథం సమస్యను అలా ఉంచి, పాత శ్రీకాకుళం జిల్లాలోని (ప్రస్తుత శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలలోని) 115 గ్రామాలను పరిశీలించి, ఒకవేళ ఆ గ్రామాలలో పాత ఉత్పత్తి విధానం అదృశ్యమైపోయిందనీ, కొత్త ఉత్పత్తి విధానం నెలకొన్నదనీ చూపగలిగినా, సువిశాల భారతదేశపు ఉత్పత్తి విధానం గురించి ఇంత సాధారణీకరణ చేయవచ్చునా అనేది మరొక ప్రశ్న. ఉత్పత్తి శక్తులు (సాధనాలు, సాంకేతిక పరిజ్ఞానం, ప్రజలు), ఉత్పత్తి సంబంధాలు (ఆస్తి సంబంధాలు, సామాజిక సంబంధాలు), ఉపరితలాంశాలు మూడు కోణాలనూ, వాటికి ప్రస్తుత భారత సమాజంలో ఉన్న విశిష్టతలనూ సంక్లిష్టతలనూ పరిగణనలోకి తీసుకోకుండా సామాజిక స్వభావాన్ని నిర్ధారించవచ్చునా అనేది ప్రశ్న. అటువంటి సాధారణీకరణ చేయాలంటే కేవలం కొన్ని గ్రామాల పరిశీలన (అది ఎంత శాస్త్రీయంగా చేసినా) తో పాటు, పెట్టుబడి దశ, పెట్టుబడి స్వభావం, వర్గాల పొందిక, వర్గాల బలాబలాలు, పరిశ్రమలు, సేవారంగం, ప్రభుత్వ విధానాలు, రాజ్యాంగయంత్రం స్వభావం, ఆర్థికేతర పీడనా రూపాలు, ఉపరితలాంశాలు, అదనపు విలువ సంగ్రహించే రూపాలు, అదనపు విలువ పునరుపయోగపు పద్ధతులు, మార్కెట్లు, మార్కెట్ల స్థాయి వంటి ఎన్నెన్నో అంశాలు పరిశోధనలో భాగం చేయవలసి ఉంటుంది.

ఆ రకంగా సంపాదకులు కూడ ఆమోదించిన, రచయిత ముందస్తుగానే ఏర్పరచుకున్న ఒక సాధారణీకరణ నుంచి గ్రామాల పరిశోధన జరిగిందనేది మొట్టమొదటి అంశం. దానికదిగా తప్పు కాదు. పరిశోధన అనేదేదైనా అలాగే జరుగుతుంది. కాని దృగ్గోచరాంశాలన్నిటినీ, తమ పూర్వ నిర్ధారణకు భిన్నమైన అంశాలతో సహా, నిజాయితీగా నమోదు చేయవలసి ఉంటుంది. ఈ పుస్తకం ఆ పని చేసింది. కాని తాను నమోదు చేసిన ప్రతి అంశమూ తన పూర్వ నిర్ధారణను బలపరుస్తుందన్నట్టుగా వాదించింది. అందువల్ల ఈ పుస్తకాన్ని చదివేటప్పుడు ఈ మౌలిక అంశాన్ని దృష్టిలో పెట్టుకుని, పరిశోధన ఫలితాలనూ, నిర్ధారణలనూ చూడవలసి ఉంది.

మొదటి అధ్యాయం 'గ్రామాలు'లో రచయిత భారతదేశంలో మొదట పట్టణాలు తక్కువగా ఉండేవని, ఈ రోజున ఆ పరిస్థితి మారిపోయిందని చెప్పడంతో ప్రారంభించారు. అదే వరుసలో 'ప్రపంచంలో జనాభారీత్యా నూరు నగరాలను తీసుకుంటే అందులో 13 నగరాలు భారతదేశానికి చెందినవే' అన్నారు. అయితే ఏమిటి? ఈ వాక్యానికీ ఇక్కడ చర్చిస్తున్న విషయానికీ సంబంధం ఏమిటి? ప్రజలు గ్రామాలనుంచి పట్టణాలకు వలస వెళుతున్నారనేది ఒక వాస్తవికమైన, దృగ్గోచరమైన అంశం. ఎందుకు వలస వెళుతున్నారు, వలస వెళ్లినచోట ఏం చేస్తున్నారు, తాను అనుకుంటున్నట్టే కొత్త ఉత్పత్తి విధానంలోకి వెళుతున్నారా, ఒకచోట నిరుద్యోగాన్ని, అల్పోద్యోగాన్ని తప్పించుకోవడానికి మరొకచోట నిరుద్యోగులుగా, అల్పోద్యోగులుగా మారడానికి వెళ్తున్నారా, ఒకచోట అసమానతనూ పీడననూ తప్పించుకునే క్రమంలో మరొకచోట అసమానతలోకీ పీడనలోకీ వెళ్తున్నారా అనే ప్రశ్నలు వేసుకోకుండా, వలసలన్నీ కొత్త ఉత్పత్తి విధానంలోకే అనుకోవడం వల్ల, ఎంత ఎక్కువ వలస సాగితే, ఎంత ఎక్కువ పట్టణ జనాభా పెరిగితే అంతగా కొత్త ఉత్పత్తి విధానం వచ్చినట్టే అని నిర్ధారించాలనే ఉత్సాహపు సమస్య ఇది.

ఈ అధ్యాయంలోనూ, చివరి అధ్యాయమైన 'కులవృత్తులు' లోనూ, పుస్తకమంతా కూడ అక్కడక్కడ ఆయన కొందరు ప్రత్యర్థులను, వారి భావాలు అని తాననుకున్న కొన్ని పూర్వనిర్ధారణల గడ్డిబొమ్మలను ఉద్దేశించినట్టు కనబడుతుంది. ఉదాహరణకు 'గ్రామం ధ్వంసం అయింది' అని ఉద్వేగపూరితంగా రాసే, పాడే రచయితలనూ, కవులనూ, గాయకులనూ అందరినీ ఆయన గ్రామాన్ని యథాతథంగా పునర్నిర్మించాలనుకునేవారిగా, గ్రామీణ కుల పీడన దుర్మార్గం తెలియని వారిగా ఒక కారికేచర్ వర్ణన చేశారు. నిజానికి గ్రామంలోని నైసర్గిక సౌందర్యం, గ్రామీణ జీవితంలోని గతకాలపు సహకార జీవనం, ఆటపాటలు, పండుగలు పబ్బాలు గురించి రాసినవాళ్లందరూ కూడ కులపీడన గురించి ప్రస్తావించారు. వారెవరూ రచయిత అన్నట్టుగా పాత గ్రామం 'భోగభాగ్యాలతో తులతూగిందని' అనలేదు. ఆ కుల పీడనతో సహా గ్రామ పునర్నిర్మాణం జరగాలని అన్నవాళ్లు ఎవరూ లేరు. ఆ పురాస్మృతిలో ఖండించదగిన అంశాలు ఉండవచ్చు గాని వాళ్లు అననివాటికి విమర్శించడం సరికాదు.

మొదటి భాగం ముగింపులో కూడ రచయిత 'గుర్తించవలసిందేమిటంటే ఫ్యూడలిజం జబ్బుకు పెట్టుబడి మందుగా పనిచేస్తుంది. దీన్ని తిరగవ్రాసి పెట్టుబడి జబ్బులకు ఫ్యూడలిజం మందు అని భావించడం పొరపాటు అవుతుంది' (పే. 250) అని రాశారు. ఈ వాక్యంతో మూడు సమస్యలున్నాయి. ఒకటి, ఫ్యూడలిజం జబ్బుకు పెట్టుబడి మందుగా పని చేస్తుందనే రచయిత అవగాహన. సామ్రాజ్యవాద దశలో ఫ్యూడలిజం జబ్బుకు పెట్టుబడి మందుగా పనిచేయజాలదని చరిత్ర చూపింది. ఆ భూస్వామ్య వ్యతిరేక మందుకు

ఎప్పుడో ఎక్స్ పైరీ డేట్ అయిపోయి, అది ఫ్యూడలిజంతో మిలాఖత్తు అయి ఉన్నది. రెండు, ఇవాళ జబ్బు పెట్టుబడి మాత్రమే అనే రచయిత అవగాహన. ఇవాళ భారత సమాజంలో భూస్వామ్యానికీ, సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడికీ, దళారీ పెట్టుబడికీ కుదిరిన ప్రజావ్యతిరేక కుమ్మక్కు నిజమైన జబ్బు. దానికి మందు పెట్టుబడిలో లేదు, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఉన్నది. మూడు, ఫ్యూడలిజం ఒక మందు అని ఎవరో అంటున్నారని రచయిత పడుతున్న అపోహ, భ్రమ. ఇవాళ్టి భారత సామాజిక సమస్యలకు ఫ్యూడలిజం ఒక మందు అని ఎప్పుడో గాంధీ అనుకున్నాడేమో గాని ఇవాళ గాంధేయవాదులు కూడ అనుకోవడం లేదు. రచయిత విమర్శించదలచుకున్న మార్క్సిస్టులెవరూ అనుకోవడం లేదు. అసలు ఎవరైనా అలా అనుకున్నా అది అచారిత్రకం.

గ్రామాలు, భూమి, వ్యవసాయం, మానవ వనరులు, కులవృత్తులు వంటి అంశాలు చర్చించిన అన్ని సందర్భాలలోను రచయిత అనివార్యంగా గ్రామీణ ప్రాంతం నుంచి పట్టణాలకు సాగుతున్న వలసల గురించి రాశారు. 'వ్యవసాయానికి కీలకమైన ముడిపదార్థం అయిన జనాభాను గ్రామీణ ప్రాంతాలనుంచి పట్టణం నిరంతరాయంగా లాక్కుంటోంది. 'స్వేచ్ఛ'గా శ్రమను అమ్ముకొనే వీలును కల్పించడం ద్వారా గ్రామీణ ప్రజానీకాన్ని పట్టణం ఆకర్షిస్తోంది' (పే. 157) అని వలసలు అనే నిజమైన సమస్యను ప్రస్తావిస్తూ తప్పుడు నిర్ధారణకు వచ్చారు. ఆ తర్వాతి పేజీలోనే ప్రస్తావించిన 'తల దాచుకోవడానికి గ్రామం, శ్రమ అమ్ముకోవడానికి బస్తీ' అనే క్షేత్రస్థాయి పరిశీలన ఆ నిర్ధారణ తప్పు అని చూపుతుంది. అలాగే, రెండో భాగంలోని 'దళితులు' అధ్యాయంలో 'ఇద్దరు జిల్లా కలెక్టర్లు ప్రయత్నించినా దళితులకు భూమి దక్కని స్థితి వలన మొత్తం దళిత కుటుంబాలలో 90 శాతం మద్రాసుకు వలస పోయిన సంఘటన దళాయిపేటలో జరిగింది' (పే. 316) అని రాశారు. వలస వెళ్లినవాళ్లు మట్టిపనిలో, రోజువారీకూలీ పనుల్లో, భవన నిర్మాణ కార్మికులుగా, వాచ్ మెన్ లుగా, సున్నం వేయడంలో, ఐసు అమ్ముకోవడంలో, సైకిళ్లద్వారా మసాలాలు, ఇతర సామాగ్రి తీసుకెళ్లి గ్రామాల్లో అమ్ముకోవడంలో, రిక్షా కార్మికులుగా, ఆటో డ్రైవర్లుగా ఉన్నారని (పే. 393-394) ఆయనే రాస్తున్నారు.

అంటే, ఆయన పరిశీలన లోని దృగ్గోచరాంశాలే వలసలు అనేక కారణాలవల్ల జరుగుతున్నాయని చూపుతున్నాయి. వలసలు వెళ్లిన వాళ్లు పరిశ్రమలోకి, ఉన్నత ఉత్పత్తి విధానంలోకి, ఇతర ఉత్పత్తి విధానంలోకి, స్వేచ్ఛలోకి, స్థిరత్వంలోకి, ఎక్కువ ఆదాయంలోకి వెళ్లడం లేదని చూపుతున్నాయి. జాగ్రత్తగా గమనిస్తే, రచయితే స్వయంగా గ్రామీణ వ్యవసాయ ప్రజలను లాక్కుంటున్నది 'పరిశ్రమ' అని రాయలేదు, 'పట్టణం' అని రాశారు. మరి పట్టణమే కొత్త ఉత్పత్తి విధానం ఎలా అయిందో తెలియదు.

గ్రామీణ వ్యవసాయ జనాభా పెద్ద ఎత్తున వలస వెళుతుండడం ఒక నిజమైన సమస్య. అది ఎంత సంక్లిష్టమైన సమస్యంటే దానిలో ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, చారిత్రక, రాజకీయ కోణాలెన్నో కలగలిసి ఉన్నాయి. దాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవడానికి ఈ రచయిత జరిపినటువంటి నిశితమైన, సూక్ష్మమైన క్షేత్రస్థాయి పరిశోధనలు అనేకం జరగాలి. గ్రామాలనుంచి శ్రామికులను పరిశ్రమలు లాక్కోవడం (పుల్ ఫాక్టర్) ఒక అంశమైతే, గ్రామాలు శ్రామికులను బైటికి తోసేయడం (పుష్ ఫాక్టర్), వారిని పరిశ్రమ ఇముడ్చుకోవడం మరొక అంశం. భారత సమాజంలో గ్రామీణ శ్రామికుల విషయంలో పరిశ్రమల వైపు నుంచి పుల్ ఫాక్టర్ లేదు, వలస వెళ్లిన వారిలో ఒక్క శాతం కూడ పారిశ్రామిక కార్మికులు కావడం లేదు. గ్రామాల నుంచి అనేక కారణాల వల్ల పుష్ ఫాక్టర్ ఉన్నది గాని అక్కడ కూడ అది పూర్తిగా గ్రామంతో సంబంధం తెంచుకుని పోవడంగా ఉన్నదా అనుమానమే. అలా వలస వెళ్లినవాళ్లలో కొందరు అసంఘటిత రంగ శ్రామికులుగా, అసంఖ్యాకులు ఎక్కడ ఎప్పుడు పని దొరుకుతుందా అని చూసే అడ్డాకూలీలుగా మారిపోతున్నారు. కనుక వలసలను పెట్టుబడి లాక్కుపోతోందని నిర్ధారించడం తొందరపాటు సాధారణీకరణే అవుతుంది. అలాగే వలసలలో తాత్కాలిక వలసలకూ శాశ్వత వలసలకూ మధ్య, నిర్బంధ వలసలకూ స్వచ్ఛంద వలసలకూ మధ్య కూడ తేడా చూడవలసి ఉంది. అన్ని వలసలూ ఒకటి కావు.

ఇలా వలస వెళ్లిన వారు స్వేచ్ఛా కార్మికులుగా మారుతున్నారని కూడ రచయిత చాల చోట్ల అన్నారు. వాళ్లు అసలు కార్మికులుగా మారగలిగే అవకాశం ఉందా లేదా అని చర్చిస్తున్నప్పుడు ఈ సూత్రీకరణ చేయడం అతిశయోక్తే అవుతుంది. స్వేచ్ఛా కార్మికుల భావన గురించి వివరిస్తూ మార్క్స్ ఆ మాటకు రెండు అర్థాల గురించి చెప్పాడు. వారు తమ పూర్వ, గ్రామీణ, వ్యవసాయ, భూ బంధాలన్నిటినుంచీ విముక్తులై స్వేచ్ఛ అనుభవించేవారు అని ఒక అర్థం. తమ శ్రమను ఎవరికైనా అమ్ముకోగల స్వేచ్ఛ అనుభవించేవారు అని మరొక అర్థం. మన సమాజంలోని వలసలలో ఈ రెండు అర్థాలలోనూ స్వేచ్ఛ అనుభవిస్తున్నవారు ఉన్నారా అనేది అనుమానమే. వలస వెళ్తున్న వారెవరూ తమ పూర్వ బంధనాలను పూర్తిగా వదులుకొని స్వేచ్ఛ అనుభవిస్తున్నారని చెప్పలేం. తమ శ్రమను ఎవరికైనా అమ్ముకోగల స్వేచ్ఛతో కాదు, తమ శ్రమను ఎవరు కొంటారా అనే ఎదురుచూపుతో, ఆందోళనతో ఉన్న స్థితిలో ఉన్నారు. ఒకవేళ అలా ఎదురుచూసేవారికి ఎక్కడో ఒక పని దొరుకుతున్నదనుకున్నా అది ఉత్పత్తి రంగంలో పని కాదు, నిజమైన ఉత్పాదక శ్రమ కాదు.

రచయిత నిర్ధారణలలో ఇటువంటి చర్చనీయాంశాలు ఎన్నో ఉన్నాయి గాని స్థలాభావం దృష్ట్యా ఒకటి మాత్రం చర్చించవచ్చు. భూమి గురించీ, భూసంస్కరణల గురించీ చాల వివరమైన, విలువైన చర్చ చేసిన రచయిత 'దున్నేవారికే భూమి' అనే భారత కమ్యూనిస్టుల నినాదం పట్ల తీవ్రమైన వ్యతిరేకతను చూపారు. 'భూమి లెక్కలలో ఖచ్చితత్వం అనేది దాదాపు లేదని భావించవచ్చు' (పే. 52) అనీ, '1977 వ్యవసాయ గణాంకాలు నమ్మశక్యం గాని స్థితిలో ఉన్నాయి' (పే. 56) అనీ కఠోర వాస్తవాన్ని గుర్తించి, ప్రకటిస్తూనే ఆ కచ్చితత్వం లేని లెక్కల సహాయంతోనే ఎన్నో సూత్రీకరణలు, సాధారణీకరణలు చేశారు. వాటి ఆధారంగానే రైతాంగ పోరాటాల మీద విమర్శలు చేశారు. 'జిల్లాలో భూయాజమాన్యాన్ని మార్చడంలో భూమి కోసం సాగిన పోరాటాల పాత్ర ఏమీ లేదన్నదే సారాంశం' (పే. 54) అనీ, 'ఇక మైదాన ప్రాంతాలలో పేద రైతాంగాన్ని భూములకోసం కదిలించిన చరిత్ర దాదాపు శూన్యం.' (పే. 55) అనీ కమ్యూనిస్టు పార్టీల, విప్లవ పార్టీల ఆచరణను తృణీకరించడం మాత్రమే కాదు, అసలు భూపోరాటాల సైద్ధాంతిక అవగాహననే ప్రశ్నించారు. 'దున్నేవానికే భూమి నినాదం – ఆచరణలో వైఫల్యం' అనే ఉప అధ్యాయంలో 'భూమి సమస్య

పరిష్కారానికి చిత్రంగా 'దున్నేవానికే భూమి' అనే నినాదం ముందుకొచ్చింది .... జనాభారీత్యా అధికసంఖ్యకు చెందిన కులాలకు చెందిన కొద్దిమంది కౌలు రైతుల పోరాటాలుగా 'దున్నేవానికే భూమి' పోరాటం పరిణమించింది...'(పే. 67) అని ఆ నినాదాన్ని తప్పు పట్టారు. 'భూమి ప్రయివేటు ఆస్తిగా ఉన్నంతకాలం అందులో ఏ పద్ధతుల్లోనైనా సమానత్వ సాధన, సమాన అవకాశాల సాధన అనేది ఉండబోదని చరిత్ర రుజువు చేసింది...' (పే. 72) అనీ, 'భూమిని జాతీయం చేయాలనే నినాదమే ఇవ్వాలి తప్ప కొద్దిపాటి భూమికి యజమానులుగా మార్చాలనే కార్యక్రమం ఉండరాదనేది సారాంశంలో అర్థమౌతుంది. కానీ దురదృష్టవశాత్తూ దున్నేవానికే భూమి పేరుతో ఈ దేశంలో భూమి సమస్యను వామపక్ష ఉద్యమకారులు మరింత జటిలం చేసారు. భూమి పంపిణీలో సమస్త అసమానతలకూ ఈ నినాదం కారణం అయింది' (పే74) అనీ సూత్రీకరించారు.

చరిత్ర రుజువు చేసింది అంటున్న రచయిత భూమి విషయంలో, భూపోరాటాల విషయంలో చరిత్రను ఎంతమాత్రం పరిగణనలోకి తీసుకున్నట్టు లేరు. భారత సమాజంలో దున్నేవారికి భూమి మీద ఎన్నడూ హక్కు లేకపోవడం, అందువల్ల భూమిలేని నిరుపేద రైతుకూలీలలో భూదాహం పెరగడం, ఆ భూదాహంలో సొంతఆస్తి భావన కన్న ఎక్కువగా స్వతంత్ర జీవన కాంక్ష ఉండడం, అందువల్ల భూమి సమస్యే ప్రజాచైతన్యానికి ఇరుసుగా మారడం ఈ సమాజ ప్రత్యేకతలు. ఒక ఉత్పత్తి సాధనంగా భూమిని జాతీయం చేయవలసిందే. కాని దానికి సమయ సందర్భాలు ఉంటాయి.

అలాగే, 'చిన్న, సన్నతరహా భూఖండాలు వాటికవే పెట్టుబడిదారీ వ్యవసాయ ఉత్పత్తి సంబంధాలకు నిదర్శనం' అనీ, 'పంటభూమిలో తోటలు పెంచడం పెట్టుబడిదారీ వ్యవసాయ లక్షణం' అనీ కాట్స్కీ అన్నాడని అసందర్భంగా ఉటంకించడం, 'ఒక మారకపు సరుకుగా భూమి మారడమనేది పెట్టుబడిదారీ సంబంధాలను సూచిస్తుంది' అనీ, 'పాత భూ కేంద్రీకరణ ఫ్యూడల్ కేంద్రీకరణ, ఇప్పటిది పెట్టుబడిదారీ కేంద్రీకరణ' అనీ గంపగుత్త సూత్రీకరణలు చేయడం వివరంగా చర్చించవలసినవే.

నిజానికి ఇటువంటి సూత్రీకరణలను స్వేచ్ఛగా ప్రకటించినప్పటికీ, పుస్తకంలో దాదాపు సగభాగంలో ఆయనే చూపిన అనేక వ్యవసాయాభివృద్ధి సూచికలలో పెట్టుబడిదారీ చొరవగాని, ఉధృతిగాని కనబడడం లేదు. అన్నిచోట్లా వేగవంతమైన అభివృద్ధి బదులు మందకొడితనం, నిర్లక్ష్యం వంటి పెట్టుబడిదారీ పూర్వ, లేదా, సామ్రాజ్యవాద పెట్టుబడి దశలోని అవలక్షణాలే కనబడుతున్నాయి. అన్ని అధ్యాయాలలోను కొట్టవచ్చినట్టు కనిపించే అంశం, రచయిత ఏమి నిర్ధారించినప్పటికీ, ఆయనే గుర్తించకతప్పని వాస్తవికత భిన్నంగా ఉంది. గ్రామాల్లో కొనసాగుతున్న ఆర్థికేతర పీడనా రూపాల గురించి, అంటే పాత ఉత్పత్తి విధాన సూచికల గురించి దాదాపు ప్రతి అధ్యాయంలోనూ వివరమైన పరిశీలనలు ఉన్నాయి. పాత ఉత్పత్తి విధానం ధ్వంసమూ అదృశ్యమూ అయిపోతే ఆ ఉత్పత్తి విధానపు ప్రధాన సూచికలు ఇంకా ఇంత గణనీయంగా ఎందుకు కనబడుతున్నాయని రచయిత ప్రశ్నించుకుంటే బాగుండును. రచయిత చేయదలచిన నిర్ధారణలకు ఎన్నో చోట్ల ఆయన చూపిన ఉపపత్తులే ఆటంకంగా ఉన్నాయి. పుస్తకం పొడవునా ఆయన చూపిన వివరాలు, ఉపపత్తులు, దృగ్గోచరాంశాలు, ఘటనలు, పరిణామాలు చాల విలువైనవి. మరీ ముఖ్యంగా రెండో భాగంలో ఆయన ఇచ్చిన నాలుగు వర్గాల జీవిత వివరాలు ప్రతి ఒక్కరూ చదవవలసినవి.

చివరగా, రచనాశైలి సమస్య చెప్పాలి: ఒకప్పుడు పట్టణ జనాభా తక్కువని చెప్పడానికి కాంప్ బెల్ మోడరన్ ఇండియా నుంచి, ఆ పుస్తకం ఎప్పుడు రాసిందో, ఎప్పుడు అచ్చయిందో చెప్పకుండా, ఉటంకింపు ఇచ్చారు. ఆ ఉటంకింపు అయిపోగానే 'ఈ రోజున' అని మొదలుపెట్టారు. ఈ రోజున అని పోలిక చెప్పదలచుకున్నప్పుడు 'ఆ రోజు' ఎప్పుడో చెప్పడం అవసరం. ఇక ఉపయుక్త గ్రంథ సూచి కూడ అకడమిక్ పద్ధతిలో లేకపోవడం వల్ల అక్కడ కూడ ఉపయోగించిన పుస్తకాలు ఎప్పుడు ప్రచురితమైనవో తెలియడంలేదు. ఎన్నోచోట్ల ఉటంకింపుల్లో, పట్టికల్లో, వివరణల్లో ఇటువంటి అసంగతాలు ఆ విలువైన సమాచారపు ప్రాధాన్యతను తగ్గిస్తున్నాయి. కొన్నిచోట్ల ఉటంకింపులు ఎందుకో, అవి ఏం సూచిస్తున్నాయో, వాటినుంచి రచయిత ఏం నిర్ధారించదలచుకున్నారో అర్థం కావడం లేదు. ఉదాహరణకు భూమి అధ్యాయంలో 1872 నాటి హెన్రీ మెయిన్ ఉటంకింపు పక్కనే 1869 నాటి కార్మైకేల్ ఉటంకింపు, 1853 నాటి మార్క్స్ ఉటంకింపు ఇచ్చారు (ఈ తేదీలు కూడ రచయిత ఇచ్చినవి కాదు!). ఈ మూడూ మూడు భిన్నమైన సందర్భాల ఉటంకింపులు. వాటిని పోల్చడానికైనా, ఒకదాని కొనసాగింపుగా మరొకదాన్ని చెప్పడానికైనా పక్కపక్కన పెట్టవచ్చు. కాని అటువంటి పోలిక గాని, ఒక ఉటంకింపుతో మరొక ఉటంకింపును కలిపే రచయిత వాక్యాలు గాని లేకుండా, అనువాదాలు కూడ లేకుండా ఇవ్వడం ఉపయోగకరమైన రచనాశైలి కాదు. అందుకు తోడు అచ్చుతప్పులు, ముఖ్యంగా గణాంకాలలో తప్పులు. ఉదాహరణకు పట్టిక 19లో గ్రామీణ వ్యవసాయ జనాభాలో 1971 జనగణన నుంచి 2001 జనగణన వరకు సాగుదార్లు, వ్యవసాయ శ్రామికులు కలిపితే 100 శాతం కాగా, 2011 జనగణనలో ఆ రెండు వర్గాలూ కలిసి 50.21 శాతం మాత్రమే ఉన్నారు. మరి వ్యవసాయ జనాభాలోని మిగిలిన 49.79 శాతం ఏమయిపోయారో తెలియదు. ఇది కచ్చితంగా పొరపాటు అంకె. ఈ పొరపాటు గణాంకాన్ని పట్టుకుని 'పెట్టుబడి విజృంభించిన ఈ దశాబ్దంలో వీళ్ల తగ్గుదల' అని రచయిత నిర్ధారించారు. అలాగే పట్టిక 35 ఎ రావలసిన చోట 33 పునరుక్తమయింది. పట్టిక 42లో ఉన్న అంకెలు వేరు, దానికి వివరణలో ఉన్న అంకెలు వేరు. పట్టిక 48లో కాలమ్ లు మారిపోయాయి. పే. 287లో వ్యవసాయదారులు, వ్యవసాయకూలీలు నికర అంకెలు ఇచ్చారుగాని శాతాలలో చూపినప్పుడు మాత్రమే పోలిక తెలుస్తుంది. పే. 303లో ఉటంకించిన మార్క్స్ వ్యాసం అచ్చయిన పత్రిక ది నేషనల్ హెరాల్డ్ కాదు, ది ఇంటర్నేషనల్ హెరాల్డ్.

ఏది ఏమైనా మన సమాజం గురించి, గ్రామీణ, వ్యవసాయ రంగాలలో వస్తున్న మార్పుల గురించి ఆలోచించేవారందరూ తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం ఇది. వాస్తవాలను సరిగా గ్రహించినప్పుడు కూడ దృక్పథంలో లోపాలుంటే, దృక్పథ స్పష్టత లేకపోతే ఎటువంటి తప్పుడు నిర్ధారణలకు అవకాశం ఉంటుందో గ్రహించడానికి కూడ ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

### ఎన్.కె. మృతి

విరసం వ్యవస్థాపక సభ్యులు, కవి, గాయకులు, కామ్రేడ్ నెల్లుట్ల కోదండ రామారావు (70) (ఎన్‌కె) డిసెంబర్ 27న వరంగల్లు జిల్లా, హనమకొండలో అనారోగ్యంతో చనిపోయారు. సృజన సాహితీ మిత్రుల్లో ఒకరిగా ఉంటూ అభ్యుదయ సాహిత్య వ్యాప్తికి కృషి చేశారు. ఎమర్జెన్సీ కాలంలో జైలు జీవితాన్ని అనుభవించారు. ఆయన 'లాల్ బనో గులాబీ చోడో బోలో వందేమాతరం' అనే దీర్ఘ కవిత తెచ్చారు. రిహార్సల్ కవితా సంకలనం రాశారు.

### భూ సమీకరణకు నోటీస్ జారీ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని కోసం గుంటూరు జిల్లా తుళ్లూరు మండలం, నేలపాడు గ్రామంలో 1409.25 ఎకరాలకు జనవరి 1న ఉత్తర్వులు జారీ చేయగా, జనవరి 2 నుంచి భూ సమీకరణ ప్రక్రియ ప్రారంభమైంది. మొత్తం తుళ్లూరు మండలంలో 11 గ్రామాలకు భూ సమీకరణ కోసం ఉత్తర్వులు జారీ చేశారు. కొంతమంది రైతులు ఈ ఉత్తర్వులకు వ్యతిరేకంగా నిరసన తెలిపారు.

### భారత సైన్స్ కాంగ్రెస్‌కు వ్యతిరేక సభ

ముంబాయిలో జనవరి 3 నుంచి 7 వరకు 102వ 'భారత సైన్స్ కాంగ్రెస్' సమావేశాలు జరిగాయి. ఈ సమావేశాల్లో సైన్స్‌కు విరుద్ధంగా వ్యక్తమైన అశాస్త్రీయ భావాలు ప్రజలను తప్పుదోవ పట్టించే విధంగా ఉన్నాయని ఖండిస్తూ 'బ్రేక్ త్రూ సైన్స్ సొసైటీ' ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో జనవరి 8న సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పాల్గొన్న వక్తలు శాస్త్ర రంగాల్లో పనిచేసే వారు శాస్త్రీయ దృక్పథంలో వ్యవహరించాలని అన్నారు. మతం వ్యక్తిగతమైందని దాన్ని సైన్స్‌లోకి చొప్పించడం సరైనది కాదన్నారు. ప్రధానమంత్రి హోదాలో ఉన్న వ్యక్తి ఒక మతానికి చెందిన భావాలను ప్రచారం చేయడం, ఇస్రో మాజీ చైర్మన్ రాధాకృష్ణన్ శాటిలైట్ నమూనాను ఒక మతానికి చెందిన ప్రార్థన మందిరంలో పెట్టి పూజలు చేయడం లౌకికవాదానికి వ్యతిరేకమని ఖండించారు. ఈ సమావేశానికి పద్మభూషణ్ పి.ఎం. భార్గవ, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, ప్రొ. పి.ఎల్. విశ్వేశ్వరరావు, బ్రేక్ త్రూ సొసైటీ రాష్ట్ర కన్వీనర్ ఆర్. గంగాధర్‌లు హాజరయ్యారు.

### తాడిగిరి పోతరాజు మృతి

తొలితరం విప్లవ రచయిత, పౌరహక్కుల నాయకులు తాడిగిరి పోతరాజు (77) కరీంనగర్‌లోని ఒక ప్రైవేట్ హాస్పిటల్‌లో క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ జనవరి 9న చనిపోయారు. ఆయన 1937 మే 3న గుంటూరు జిల్లా, తాటికొండ మండలం, అత్తిలి గ్రామంలో జన్మించారు. ఆయన కరీంనగర్ జిల్లా, ఎల్కతుర్తి మండలం, శాంతినగర్‌లో స్థిరపడ్డారు. ఆయన 1969 తెలంగాణ ఉద్యమంలోనూ, 1970 నక్సల్బరీ పోరాటంలోనూ, 1974 ఎమర్జెన్సీ వ్యతిరేక ఉద్యమంలోనూ పాల్గొన్నారు. 'కెటిల్' కథా సంకలనం, 'గాజు కిటికి' నవలా రచించారు. చేశారు.

### టివివి రాష్ట్ర మహాసభలు

తెలంగాణ విద్యావంతుల వేదిక (టివివి) 5వ రాష్ట్ర మహాసభలు జనవరి 10, 11 తేదీలలో హైదరాబాద్‌లోని నాంపల్లిలో ఉన్న ఇందిర ప్రియదర్శిని హాలులో జరిగాయి. ఈ సభలకు ముఖ్య అతిథిగా జాతీయ మానవహక్కుల ఉద్యమకారులు స్వామి అగ్నివేష్ హాజరయ్యారు. ఈ సభలలో అభివృద్ధి పేరుతో పారిశ్రామికవేత్తలకు వేలాది ఎకరాల భూమిని కేటాయించ వద్దని, తెలంగాణలోని ప్రైవేట్ పరిశ్రమలలో స్థానికులకు 80 శాతం ఉపాధి అవకాశం కల్పించాలని, కార్పొరేట్ విద్యను అంతం చేసి, ప్రభుత్వ విద్యను పటిష్టం చేయాలని, ఎస్‌సి, ఎస్‌టిలకు సబ్ ప్లాన్ ద్వారా భూమిలేని వారికి భూమిని పంపిణీ చేయాలని, ఆదివాసి చట్టాలను అమలు చేయాలని తీర్మానించారు. మిషన్ కాకతీయకు సంపూర్ణ మద్దతు ప్రకటించారు. నూతన అధ్యక్షులుగా గురజాల రవీందర్, గౌరవ అధ్యక్షులుగా ప్రొ. కోదండరాం, ప్రధాన కార్యదర్శిగా తిప్పర్తి యాదయ్య ఎన్నికయ్యారు.

### రోడ్డు ప్రమాదంలో 16 మంది మృతి

అనంతపురం జిల్లా, పెనుగొండ – మడకశిర మధ్యలో జనవరి 7న బస్సు బోల్తా పడి 16 మంది ప్రయాణికులు చనిపోగా, 40 మందికి గాయలైనాయి. చనిపోయిన వారిలో విద్యార్థులు ఎక్కువగా ఉన్నారు. మొత్తం బస్సులో 50 మంది ప్రయాణికులు ఉన్నారు. ఎదురుగా వస్తున్న ఆటోను తప్పించపోయి అదుపు తప్పడంతో ఈ ప్రమాదం జరిగిందని అధికారులు తెలిపారు.

### గిరిజన ప్రాంతాల్లో ప్రత్యేక బెటాలియన్ క్యాంప్

ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల్లోని గిరిజన ప్రాంతాల్లో నక్సల్ ప్రభావం ఉందని రాష్ట్ర మంత్రివర్గ ఉప సంఘం జనవరి 3న ఆర్థిక మంత్రి యనమల రామకృష్ణుడు నేతృత్వంలో సమావేశం జరిగింది. ఈ సమావేశంలో నక్సల్స్ ప్రభావ ప్రాంతంలో సెల్ టవర్లు నిర్మించాలని, రహదారులను అభివృద్ధి చేయాలని, ఏజెన్సీ ప్రాంతంలోని గిరిజనులకే హోంగార్డు ఉద్యోగాలను ఇవ్వాలని, ఖమ్మం జిల్లా నుంచి ఆంధ్రప్రదేశ్‌లో విలీనమైన ఏడు మండలాలలో ఒక ప్రత్యేక గిరిజన బెటాలియన్ క్యాంప్ ఏర్పాటు చేయాలని మంత్రివర్గ ఉపసంఘం తీర్మానించింది. ఈ సమావేశానికి రాష్ట్ర హోంమంత్రి సిద్దా రాఘవరావు, రెవెన్యూ ముఖ్య కార్యదర్శి జెసి శర్మ, హోంశాఖ ముఖ్యకార్యదర్శి ప్రసాద్‌రావులు హాజరయ్యారు.

### ముగ్గురు సినీ నటులు మృతి

సినీ నటుడు ఆహుతి ప్రసాద్ (57) (అడుసుమిల్లి జనార్దన్ వరప్రసాద్) జనవరి 4న చనిపోయారు. ఆయన కృష్ణా జిల్లా, కోడూరు గ్రామంలో 1958 జనవరి 2న జన్మించారు. 275 చిత్రాలలో నటించారు. జనవరి 12న ప్రముఖ నిర్మాత వి.బి. రాజేంద్రప్రసాద్ (83) హైదరాబాద్‌లో చనిపోయారు. ఆయన కృష్ణా జిల్లా, గుడివాడలో 1932 నవంబర్ 4న జన్మించారు. ఆయన 16 చిత్రాలకు నిర్మాతగా, 14 చిత్రాలకు దర్శకునిగా పనిచేశారు. జనవరి 23న ప్రముఖ హాస్యనటుడు ఎంఎస్. సత్యనారాయణ (64) (మైలవరపు సూర్య సత్యనారాయణ) చనిపోయారు. ఆయన 1951 ఏప్రిల్ 16న పశ్చిమగోదావరి జిల్లా, నిడమర్రు గ్రామంలో జన్మించారు. 700 చిత్రాలలో నటించారు. రెండు చిత్రాలకు దర్శకత్వం వహించారు.

### మంత్రివర్గం నుంచి రాజయ్య బర్తరఫ్

తెలంగాణ ఉప ముఖ్యమంత్రి, వైద్య, ఆరోగ్యశాఖ మంత్రి, డా. తాటికొండ రాజయ్యను తెలంగాణ రాష్ట్ర మంత్రి వర్గం నుంచి జనవరి 25న తొలగిస్తూ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖరరావు ఆదేశాలు జారిచేశారు. వరంగల్ ఎం.పి. కడియం శ్రీహరిని ఉపముఖ్యమంత్రిగా, విద్యాశాఖ మంత్రిగా నియమించారు. రాష్ట్ర గవర్నర్ నరసింహన్ జనవరి 25న కడియం శ్రీహరి చేత ప్రమాణ స్వీకారం చేయించారు. అలాగే విద్యాశాఖ మంత్రిగా ఉన్న జగదీశ్‌రెడ్డిని విద్యుత్తు శాఖ మంత్రిగా నియమించగా, విద్యుత్‌శాఖ మంత్రిగా ఉన్న లక్ష్మారెడ్డిని ఆరోగ్యశాఖ మంత్రిగా నియమించారు. వీ

### బి.జి. వర్గీస్ కన్నుమూత

రామన్ మెగసెసే అవార్డు గ్రహీత, హిందుస్థాన్ టైమ్స్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లకు ఎడిటర్‌గా పనిచేసిన ప్రముఖ పాత్రికేయులు బి.జి. వర్గీస్ (87) డిసెంబర్ 30న అనారోగ్యంతో గుర్‌గావ్‌లో మృతిచెందారు. ఆయన ఎమర్జెన్సీని తీవ్రంగా వ్యతిరేకించారు. పౌరహక్కుల యోధుడిగా గుర్తింపు పొందిన వర్గీస్ దేశంలోని అనేక సమస్యలపై పోరాడారు. 2002లో జరిగిన గుజరాత్ అల్లర్లపై నిజనిజాలు తేల్చేందుకు నియమించిన ఎడిటర్స్‌గిల్డ్ కమిటీలో ఆయన సభ్యుడిగా ఉన్నారు. ఆయన 'వాటర్స్ ఆఫ్ హోప్', ఇండియాస్ నార్త్ ఈస్ట్', 'ఫోర్త్ ఎస్టేట్', 'ఆటోబయోగ్రఫీ', 'ఫస్ట్ డ్రాఫ్ట్' తదితర పుస్తకాలు రాశారు.

### ఎపి భవన్ ముందు కార్మికుల నిరసన

ఔషధ తయారీ సంస్థ అరబిందో ఫార్మా కార్మికులకు, ఉద్యోగులకు అక్టోబర్ నుంచి వేతనాలు చెల్లించకుండా వారి శ్రమను దోచుకుంటోందని ఆరోపిస్తూ ఢిల్లీలోని ఎపి భవన్ ముందు ఇఫ్టు కార్మిక సంఘం ఆధ్వర్యంలో డిసెంబర్ 30న నిరసన ప్రదర్శన చేశారు. కేంద్రంలో మోడీ సర్కారు, ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు కార్మిక వ్యతిరేక విధానాలను అవలంబిస్తూ, కార్పొరేట్ శక్తులకు అనుకూలంగా వ్యవహరిస్తున్నారని ఇఫ్టు ఢిల్లీ కమిటీ నాయకులు రాజేష్ ఆరోపించారు. అనంతరం ఎపి భవన్ రెసిడెంట్ కమిషనర్‌కు విజ్ఞాపన పత్రాన్ని అందించారు.

### భూసేకరణ ఆర్డినెన్స్‌కు ఆమోదం

పారిశ్రామిక అవసరాలు, గ్రామీణ ప్రాంతాల్లో మౌలిక సదుపాయాల అభివృద్ధికి, రక్షణ, గృహ నిర్మాణం, ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యం (పిపిపి) కింద చేపట్టే పథకాల కోసం భూసేకరణ చేయనున్నారు.ఈ ఐదింటి కోసం భూసేకరణ చట్టంలో సవరణలకు కేంద్రం రూపొందించిన అత్యవసర ఆదేశానికి (ఆర్డినెన్స్‌కి) రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ డిసెంబర్ 31న ఆమోదం తెలిపారు. భూసేకరణకు ప్రజామోదం తీసుకోవడం సామాజిక ప్రభావ అంచనా (ఎస్ఐఎ) వంటివి ఈ ఐదింటికి ఇకపై అవసరం ఉండదు. పంటలు సాగుచేసే భూముల్ని కూడా అయిదు అవసరాల కోసం సేకరించుకోవచ్చని ఆర్డినెన్స్ చెపుతుంది.

### బొగ్గు గనుల్లో కార్మికుల సమ్మె

జాతీయ బొగ్గు పరిశ్రమల్లో పెట్టుబడుల ఉపసంహరణ, పునర్ వ్యవస్థీకరణ ప్రయత్నాలను వ్యతిరేకిస్తూ, గనుల ప్రైవేటీకరణను నిలిపి వేయాలని, రద్దు చేసిన బొగ్గు క్షేత్రాలను కోల్ ఇండియాతో పాటు సింగరేణికి కేటాయించాలని కార్మికులు డిమాండ్ ఐదు కార్మిక సంఘాలు చేపట్టిన ఐదు రోజుల సమ్మె జనవరి 6న ప్రారంభమైంది. మొత్తం ఐదు లక్షల మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నట్లు ఐఎన్‌టియుసి కార్యదర్శి ఎస్ క్యూ జమా వెల్లడించారు. జనవరి 7న కేంద్ర విద్యుశాఖ మంత్రి కార్మికులతో జరిపిన చర్చల్లో ప్రభుత్వం కోల్ ఇండియాను జాతీయాకరణ పరిధి నుంచి తప్పించే యోచన ప్రభుత్వానికి లేదని, కార్మికుల సమస్యలను పరిష్కరిస్తామని ప్రకటించారు. దీంతో కార్మిక సంఘాలు తమ సమ్మెను విరమించుకున్నాయి.

### జమ్ము కశ్మీర్‌లో గవర్నర్ పాలన

జమ్ము కశ్మీర్‌కు జరిగిన ఎన్నికల్లో ఏ పార్టీ ప్రభుత్వ ఏర్పాటుకు సరిపోయే మెజారిటీ సాధించలేదు. అత్యధిక స్థానాలు సాధించిన పిడిపి, రెండో స్థానంలో ఉన్న బిజెపి ఏవీ కూడా ప్రభుత్వ ఏర్పాటుకు అవసరమైన స్థానాలను సమీకరించుకోలేకపోయాయి. దీంతో గవర్నర్ పాలనకు రాష్ట్రపతి ఆమోదం తెలిపారు. జమ్ము కశ్మీర్ రాజ్యాంగంలోని సెక్షన్ 92 (1) ప్రకారం గవర్నర్ పాలన విధిస్తున్నట్లు జనవరి 10న గవర్నర్ అధికారిక ప్రకటన చేశారు. జమ్ము కశ్మీర్‌లో 1977 నుంచి గవర్నర్ పాలన విధించడం ఇది ఆరోసారి.

### ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికలు

ఢిల్లీ రాష్ట్ర అసెంబ్లీకి జనవరి 12న కేంద్ర ఎన్నికల సంఘం షెడ్యూల్‌ను విడుదల చేసింది. ఒకే విడతలో ఫిబ్రవరి 7న పోలింగ్, 10న ఓట్ల లెక్కింపు జరుగుతుందన్నారు. జనవరి 21 నాటికి నామినేషన్ల ప్రక్రియ ముగుస్తుందని, నామినేషన్ల ఉపసంహరణ గడువు జనవరి 24తో ముగుస్తుందని కేంద్ర ఎన్నికల సంఘం ప్రధాన కమిషనర్ వి.ఎస్. సంపత్ ఢిల్లీలో తెలిపారు. ఢిల్లీ అసెంబ్లీలో 70 స్థానాలున్నాయి. ఓటర్ల సంఖ్య సుమారు 1.30 కోట్లు. 11763 పోలింగ్ కేంద్రాల్లో పోలింగ్ జరుగుతుందన్నారు.

### కేంద్ర ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా బ్రహ్మ

కేంద్ర ఎన్నికల సంఘం ప్రధాన కమిషనర్ (సిఇసి) గా 1975 బ్యాచ్‌కు చెందిన హరిశంకర్ బ్రహ్మ నియమితులయ్యారు. గత కమిషనర్ వీరవల్లి సుందరం సంపత్ జనవరి 15న పదవి విరమణ చేశారు. బ్రహ్మ అసోం రాష్ట్రానికి చెందిన వారు.

### గాలి జనార్దన్‌రెడ్డికి బెయిల్

ఓబులాపురం ఇనుప ఖనిజం గనుల అక్రమ తవ్వకం కేసులో ప్రధాన నిందితుడైన కర్ణాటక మాజీ మంత్రి గాలి జనార్దన్‌రెడ్డికి జనవరి 18న బెయిల్ డీల్ కేసులో సుప్రీం కోర్టు షరతులతో కూడిన బెయిలు మంజూరు చేసింది. ఈ కేసులో దర్యాప్తు పూర్తిచేసి అభియోగ పత్రాలు దాఖలు చేశామని సిబిఐ తరపున అదనపు సొలిసిటర్ జనరల్ మణీందర్ సింగ్ జనవరి 20న తెలిపారు. దీంతో దర్యాప్తు సంస్థ నివేదికను పరిగణనలోకి తీసుకొని బెయిలిస్తున్నట్లు చీఫ్ జస్టిస్ హెచ్.ఎల్. దత్తు, జస్టిస్ ఎ.కె. సిక్రీ, జస్టిస్ అరుణ్ మిశ్రాలతో కూడిన ధర్మాసనం ప్రకటించింది.

### ఒబామా భారత పర్యటన

ప్రధాని మోడీ ఆహ్వానం మేరకు గణతంత్ర వేడుకల్లో పాల్గొనేందుకు అమెరికా అధ్యక్షుడు ఒబామా ఆయన భార్య మిషెల్‌తో కలిసి జనవరి 25న ఢిల్లీకి చేరుకున్నారు. జనవరి 26న గణతంత్ర వేడుకల్లో పాల్గొన్నారు. ప్రధాని మోడీతో జరిపిన ద్వైపాక్షిక అంశాలపై చర్చలు జరిపారు. రక్షణ రంగ ఒప్పందాన్ని రెండు దేశాలు పునరుద్ధరించుకున్నాయి. మరో పదేళ్లపాటు ఇది అమల్లో ఉంటుంది. భారత్ – అమెరికా మధ్య అణు ఒప్పందం కుదుర్చుకున్నారు. వాణిజ్య పరమైన సహకారాన్ని అందించాలని, రక్షణ రంగంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకోవడానికి రెండు దేశాలు ముందడుగు వేస్తున్నాయని సంయుక్త విలేకరుల సమావేశంలో ఒబామా ప్రకటించారు.

### నీతి ఆయోగ్

కేంద్ర ప్రభుత్వం కేంద్ర ప్రణాళిక సంఘాన్ని రద్దుచేసి దాని స్థానంలో నీతి ఆయోగ్‌ను ఏర్పాటు చేసింది. నీతి ఆయోగ్‌కు అధ్యక్షుడుగా ప్రధాని ఉంటారు. ఉపాధ్యక్షుడుగా ఒక సిఇఒ ఉంటారు. అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు, గవర్నర్లు, కేంద్ర పాలిత ప్రాంత లెఫ్టినెంట్ గవర్నర్లు పాలక మండలిలో ఉంటారు. ఐదుగురు పూర్తికాల సభ్యులు, ఇద్దరు పాక్షిక కాల సభ్యులు ఉంటారు. ఈ ఇద్దరినీ ప్రముఖ విశ్వవిద్యాలయాల, పరిశోధన సంస్థల నుంచి తీసుకుంటారు. నలుగురు కేంద్ర మంత్రులు తమ పదవి రీత్యా ఇందులో సభ్యులవుతారు. దీనికి తొలి ఉపాధ్యక్షునిగా ప్రముఖ ఆర్థిక వేత్త అరవింద్ పనగారియాను, సిఇఒగా సింధుశ్రీ ఖుల్లార్‌ను నియమించారు.

### కార్టూనిస్ట్ ఆర్‌కె లక్ష్మణ్ మృతి

ప్రముఖ కార్టూనిస్ట్ ఆర్‌కె లక్ష్మణ్ జనవరి 26న మృతి చెందారు. ఆయన దాదాపు ఐదు దశాబ్దాల పాటు సమకాలీన రాజకీయాలు, దిగజారుతున్న రాజకీయ విలువలపై వ్యంగ్యాస్త్రాలు సంధించారు. ఆయన సృష్టించిన 'కామన్ మ్యాన్' కార్టూన్ అందరికీ దగ్గరైంది. 1921 అక్టోబర్ 24న మైసూర్‌లో జన్మించారు. ప్రముఖ రచయిత ఆర్‌కె నారాయణ్ ఆయనకు పెద్దన్నయ్య. బాల్యం నుంచే లక్ష్మణ్‌కు చిత్రలేఖనంపై మక్కువ ఎక్కువ. టైమ్స్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగం వచ్చిన తర్వాత ఆయన జీవితం మలుపు తిరిగింది. 'యూ సెడ్ ఇట్' కామిక్ స్ట్రిప్ 1951లో ప్రారంభమైంది. తమ ఆశలు, కలలు, ఆకాంక్షలను తుంగలో తొక్కిన రాజకీయ నేతల మోసాలను మౌనంగా గమనించే 'కామన్ మ్యాన్' ప్రస్థానం అక్కడే మొదలైంది. వీ

## ఎయిర్ ఏషియా విమాన ప్రమాదం

ఇండోనేషియాలోని రెండవ పెద్ద నగరం సురబయ నుంచి సింగపూర్‌కు బయలుదేరిన ఎయిర్ ఏషియా విమానం జావా సముద్రంలో కూలిపోయింది. 2014, డిసెంబర్ 28న జరిగిన ఈ ప్రమాదంలో సిబ్బందితో సహా మొత్తం 162 మంది మరణించారు. సురబయ నుంచి బయలుదేరిన గంటకే ఈ ప్రమాదం జరిగింది. వాతావరణం బాగుండకపోవడంతో ఎయిర్ ట్రాఫిక్ కంట్రోల్‌తో విమానానికి సంబంధాలు తెగిపోయాయి. సముద్రంలో భారీ అలలు ఉండడం విమానం సముద్రాన్ని ఢీకొట్టగానే పేలిపోయినట్లు అధికారులు తెలిపారు.

## అఫ్ఘనిస్తాన్ నుంచి నాటో దళాల నిష్క్రమణ

అఫ్ఘనిస్తాన్‌లోని అమెరికా, నాటో దళాల అక్రమ దురాక్రమణకు తెరపడింది. గత పదమూడేళ్లుగా తిష్టవేసిన అమెరికా దళాల ఆధిపత్యం ముగిసింది. దీనికి గుర్తింపుగా డిసెంబర్ 28న కాబూల్‌లో నాటో నేతృత్వంలోని సంకీర్ణ దళం (ఐఎస్ఎఎఫ్) పతాకాన్ని అవతనం చేసి, భద్రతా బాధ్యతలను అఫ్ఘన్‌కు అప్పగించాయి. అయితే దీంతో అఫ్ఘనిస్తాన్ నుంచి అమెరికా పూర్తిగా నిష్క్రమించిట్లు అనుకోవద్దు. నాటో దళాల ఉపసంహరణ తరువాత కూడ అమెరికాకు చెందిన పదివేలకు పైగా సైనికులు అక్కడ శాశ్వతంగా ఉండేందుకు అమెరికా ముందుగానే పథక రచన చేసింది. కాబూల్‌లోని నాటో ప్రధాన కార్యాలయంలో అంతర్జాతీయ భద్రతా సహాయక దళాని (ఐసాఫ్)కి చెందిన ఆకుపచ్చ – తెలుపు రంగుల జెండాను అవనతం చేసి రిజల్యూట్ సపోర్ట్ పేరుతో రూపొందించిన కొత్త పథకాన్ని ఆవిష్కరించారు. ఈ పదమూడేళ్లలో దాదాపు మూడువేల ఐదు వందల మంది సంకీర్ణ దళాల సైనికులు ప్రాణాలు కోల్పోయారని ఐసాఫ్ కమాండర్ జాన్ కాంప్‌బెల్ అన్నారు. ఈ పదమూడేళ్లలో నాటో దళాల దాడులలో వేలాది మంది అఫ్ఘన్ సాధారణ పౌరులు ప్రాణాలు కోల్పోయారు. ఎన్నో లక్షల మంది నిరాశ్రయులయ్యారు.

## అంతం కాని ఎబోలా

పశ్చిమ ఆఫ్రికా దేశాలలో ఎబోలా వ్యాధి ఇంకా ప్రజల ప్రాణాలు బలితీసుకుంటూనే ఉంది. ఇప్పటి దాకా మొత్తం ఇరవై వేల మందికి పైగా ఈ వ్యాధి బారిన పడ్డారనీ, అందులో దాదాపు 7800 మంది మృతి చెందారని ప్రపంచ ఆరోగ్య సంస్థ వివరాలు తెలిపింది. ఈ కేసులన్నీ దక్షిణ ఆఫ్రికాలోని సియెర్రా, లియోనే, లైబీరియా, గినియా దేశాలకు చెందినవే. గత అక్టోబర్‌లో ఎబోలా నుంచి విముక్తి పొందాయని ప్రకటించినా, అక్కడక్కడా ఈ వ్యాధి బారిన పడిన వారి సమాచారం వస్తూనే ఉంది.

## చైనాలో తొక్కిసలాట

చైనాలోని షాంఘయి నగరంలో డిసెంబర్ 31 రాత్రి కొత్త సంవత్సర ఆహ్వాన వేడుకల్లో జరిగిన తొక్కిసలాటలో 36 మంది మరణించారు. నలభై మందికి పైగా గాయపడ్డారు. రాత్రి 11.35 గంటల సమయంలో ఈ వేడుకలు జరుగుతున్నప్పుడు అమెరికన్ డాలర్లు పోలి ఉన్న కూపన్లను పొందేందుకు ప్రజలు ఒక్కసారిగా గుమిగూడడంతో ఈ తొక్కిసలాట జరిగింది. ఈ తొక్కిసలాటలో మరణించిన వారిలో 16–36 ఏళ్ల మధ్య వయసు వారే ఎక్కువ ఉన్నారు.

## త్రీ గోర్జెస్ జల విద్యుత్ ప్రపంచ రికార్డ్

చైనాలోని అతి పెద్దదైన త్రీ గోర్జెస్ డ్యాం విద్యుత్ ప్లాంట్ గత ఏడాది కాలంలో 98.8 బిలియన్ కిలోవాట్ అవర్స్ (కెడబ్ల్యుఎచ్) విద్యుత్‌ను ఉత్పత్తి చేసి ప్రపంచ రికార్డు నెలకొల్పింది. ఇంతకు ముందు బ్రెజిల్‌కు చెందిన తైపు జల విద్యుత్ ప్లాంట్ 2013లో 98.6 బిలియన్ కెడబ్ల్యుఎచ్ ఉత్పత్తి చేసి నెలకొల్పిన రికార్డును బద్దలు చేసింది. త్రీ గోర్జెస్ విద్యుత్ కేంద్రం ప్రపంచంలోనే అతిపెద్దదైన జల విద్యుత్ కేంద్రం. దీని ప్రారంభ సామర్థ్యం 22.5 మిలియన్ల కెడబ్ల్యుఎచ్. బ్రెజిల్ జల విద్యుత్ కేంద్రం ప్రారంభ సామర్థ్యం 14 మిలియన్ల కెడబ్ల్యుఎచ్.

## ప్యారిస్‌లో దాడులు

ఫ్రాన్స్ రాజధాని ప్యారిస్‌లో ఉన్న వ్యంగ్య వారపత్రిక ఛార్లీ హెబ్డో కార్యాలయంపై జనవరి 7న ఇద్దరు సాయుధులు దాడి చేశారు. ఈ దాడిలో ఎడిటర్ ఇన్ చీఫ్ చార్బ్, ముగ్గురు ప్రముఖ కార్టునిస్టులు కబు, టిగ్నస్, వొలిన్స్కీలను, ఇద్దరు పోలీసులతో సహా పన్నెండు మందిని కాల్చి చంపారు. ఇద్దరు వ్యక్తులు తుపాకులు ధరించి పత్రికా కార్యాలయంలోకి చొరబడి కాల్పులు జరిపారు. అనంతరం ఒక కారులో పరారయ్యారు. మత ప్రవక్తపై వ్యంగ్య కార్టూన్లు వేసినందుకే ఈ దాడి జరిగినట్లుగా భావిస్తున్నారు. ఈ దాడిని ప్రపంచ దేశాల అధినేతలూ, ప్రముఖ పత్రికా వర్గాలూ అన్నీ ఖండించాయి. ఇది పత్రికా స్వేచ్ఛపై దాడి అని వ్యాఖ్యానించాయి. జనవరి 9న ఈశాన్య ప్యారిస్‌లోని పారిశ్రామికవాడలో ఒక ప్రింటింగ్ ప్రెస్‌లో దాక్కున్న నిందితులపై పోలీసులు దాడి చేసి చంపేశారు. మరొక ఘటనలో జనవరి 8న ప్యారిస్‌లోని దక్షిణ ప్రాంతంలో ఒక మహిళా పోలీసుపై కాల్పులు జరపడంతో ఆ కానిస్టేబుల్ చనిపోయింది. జనవరి 9న తూర్పు ప్యారిస్ ప్రాంతంలోని కోషర్ సూపర్ మార్కెట్‌లోకి సాయుధులు చొరబడి అక్కడున్న వారందరినీ బంధించారు. ఈ ఘటనలో పోలీసులు వెళ్లేలోగా నలుగురు బందీలను దుండగులు కాల్చేశారు. భద్రతా బలగాలు చేపట్టిన ఆపరేషన్‌లో ఒక తీవ్రవాది మరణించాడు.

## శ్రీలంక అధ్యక్షుడిగా మైత్రిపాల సిరిసేన

శ్రీలంక అధ్యక్షుడిగా మైత్రిపాల సిరిసేన ఎంపికయ్యారు. జనవరి 8న జరిగిన అధ్యక్ష ఎన్నికలు జరిగాయి. జనవరి 9న ఫలితాలు వెలువడ్డాయి. ఈ ఫలితాల్లో సిరిసేనకు 51.28 శాతం ఓట్లు వచ్చాయి. అధ్యక్షుడు మహిందా రాజపక్సకు 47.58 శాతం ఓట్లు వచ్చాయి. దీంతో అధ్యక్షుడు రాజపక్స ఓటమి పాలయ్యారు. యుఎన్‌పి నాయకుడు రనిల్ విక్రమసింగే శ్రీలంక ప్రధానిగా ఎన్నికయ్యారు. జనవరి 9న కొలంబోలోని ఇండిపెండెన్స్ స్క్వేర్ వద్ద ప్రమాణ స్వీకారోత్సవ కార్యక్రమాన్ని శ్రీలంక సుప్రీంకోర్టు న్యాయమూర్తి నిర్వహించారు. దశాబ్దం పాటు రెండు పర్యాయాలు అధికార పీఠం గెలుచుకున్న రాజపక్సకు ఈసారి ఓటమి తప్పలేదు. ఆయన హయాంలోనే తమిళ టైగర్లు అంతం అయ్యారు. ఆధిపత్య ధోరణి, అవినీతి ఆరోపణలు, పెరుగుతున్న నిరంకుశవాద ధోరణే ఆయన ఓటమికి ప్రధాన కారణమయ్యాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(డిసెంబర్ 1 నుండి డిసెంబర్ 31, 2014 వరకు తెలంగాణలోని 8 జిల్లాలు (1085), ఆంధ్రప్రదేశ్‌లోని 6 జిల్లాలలో (457) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1542)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 4 | – | 23 | 21 | 18 | 20 | 7 | 2 | 2 | 1 | 2 | 1 | – | 23 | 28 | – | – | – | 3 | – |
| మెదక్ | 4 | 39 | 3 | 19 | 25 | 5 | 13 | 2 | 12 | 15 | 8 | 6 | 12 | 6 | 19 | 16 | – | 12 | – | 4 | 3 |
| కరీంనగర్ | 8 | 2 | – | – | 10 | 3 | 8 | – | – | 7 | – | 4 | 6 | 11 | 57 | 13 | – | – | – | – | 6 |
| ఖమ్మం | – | 2 | – | 6 | 11 | 7 | 17 | 1 | 1 | 4 | 2 | 1 | – | 4 | 23 | 9 | – | 1 | – | – | 5 |
| మహబూబ్‌నగర్ | – | 4 | – | 22 | 24 | 1 | 1 | 4 | 9 | 10 | 12 | 14 | 16 | 16 | 52 | – | – | 1 | – | – | – |
| రంగారెడ్డి | – | 10 | – | 13 | 18 | 8 | 8 | 2 | 4 | 12 | 8 | 3 | – | 3 | 32 | 4 | – | – | – | – | – |
| నల్గొండ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | – | – | – | 5 | 16 | 1 | 1 | – | 4 | 6 | 3 | 9 | 7 | 3 | 35 | 8 | – | – | – | – | – |
| హైదరాబాద్ | – | – | – | 7 | 10 | – | – | – | 1 | 1 | 1 | 12 | – | – | 22 | 17 | – | – | – | 9 | – |
| **తెలంగాణ** | **13** | **61** | **3** | **83** | **135** | **43** | **68** | **16** | **33** | **57** | **35** | **51** | **42** | **43** | **263** | **95** | **-** | **14** | **-** | **16** | **14** |
| అనంతపురం | – | 4 | 5 | 5 | 11 | 4 | – | 3 | – | 6 | 1 | 1 | 3 | 4 | 28 | 2 | – | – | – | – | - |
| చిత్తూరు | – | – | – | 2 | 4 | 2 | 2 | 2 | 2 | 3 | 4 | 2 | 9 | – | 18 | – | – | – | – | – | – |
| కడప | 4 | 3 | – | 8 | 7 | – | – | 1 | – | 4 | 2 | – | 1 | 5 | 25 | 6 | – | – | – | – | 2 |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | 4 | 1 | – | 16 | 8 | 1 | 3 | 5 | 8 | 4 | 7 | 1 | 4 | 2 | 24 | 1 | – | – | 1 | – | 2 |
| శ్రీకాకుళం | – | 1 | – | – | 4 | 7 | 4 | 14 | 2 | – | 2 | – | 2 | 7 | 4 | 31 | – | – | – | – | 5 |
| విశాఖపట్నం | – | – | – | 6 | 5 | 1 | 2 | 1 | 3 | 1 | 1 | 4 | 10 | – | 23 | 10 | – | – | – | 17 | 5 |
| **ఆంధ్రప్రదేశ్** | **8** | **9** | **5** | **37** | **39** | **15** | **11** | **26** | **15** | **18** | **17** | **8** | **29** | **18** | **122** | **50** | **-** | **-** | **1** | **17** | **14** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| కొత్తకోణం | ఎనిశెట్టి శంకర్ | 80 |
| ఫారన్‌హీట్ 451 | ఎనిశెట్టి శంకర్ | 90 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టి నిధులు, విధిలింపు – మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్సి, ఎస్టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |
| రియాలిటీ చెక్ | పూడూరి రాజిరెడ్డి | 250 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయ | డి.డి. కొశాంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్వెస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీదేవి ప్రేమ్‌చంద్ | 120 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| ఒంద్రుమట్టి | నల్లూరి రుక్మిణి | 170 |
| బీజభూమి | వరవరరావు | 100 |

### డివిడి

| | | |
|---|---|---|
| వీక్షణం (2003 – 2012) | | 200 |
| సృజన (1966–1992) | | 240 |
| అరుణతార (1970–2013) | | 125 |
| ఓ యుద్ధకాండ | | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 163 - February 2015 ● **ISSN 2231-6892**
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/1/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

## ‘వీక్షణం’ను ఆదుకుందాం
## ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పన్నెండు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పన్నెండు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao